# చతుర

సంపుటి-3 సంచిక-1
ఫిబ్రువరి 1980

## ఈనెల సమగ్రనవల

ఆమె జీవితంలో వర్షాల్నేగాని వసంతాల్ని చూడలేదు. అటు కన్నవారి ఆదరణకు, ఇటు అత్తవారి ఆప్యాయతకు కూడ ఆమె నోచుకోలేదు. బిడ్డల తల్లిగా ఆమెకు లభించిన గౌరవం ఏమంత ఎక్కువైందీ కాదు. స్త్రీకి పురుషుడితోనే రక్షణుంటుందన్న ఈ సమాజం ఆమెకి కన్నకొడుకుతో సమానమైన మరిది నిచ్చి వివాహం జరిపించింది. పర్యవసానం వారి వైవాహిక జీవితం సంఘం అనుకున్న రీతిలో సాగిందా? మూర్ఖప్రజ ఆ మాతృమూర్తిలో

# జగన్మాత

సుదర్శించ గలిగిందా ? చివరకు ఆమె బతుకు బండి ఏ దిశకు పయనించింది? ఈ ప్రశ్నలన్నిటికీ సమాధానంగా ప్రఖ్యాత రచయిత

## రాజేంద్రసింగ్ బేడి

రచనకు

### కె. ఆర్. కె. మోహన్

చక్కని అనువాదం ఈ నెల చతుర సమగ్ర నవల.

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని వివిధ కోణాలనుండి ప్రతిబింబించగల సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి.

* ఈ పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసిపంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి. ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100-112 పేజీల పాకెట్ సైజు నవలాను బంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత వరకూ కుదించవలసివచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతోసహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పిపంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పని సరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే ప్రతి నవలకూ పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 004

# హిమనగ సన్నిధిలో..

మహోన్నతమైన హిమ పర్వతాల సన్నిధిలో విశ్రాంతులై నిలిచిపోనవసరం లేదు. వాటి ముందు మన అల్పత్వాన్ని చూసుకుని బెదిరి పోనవసరం అంతకన్నా లేదు. అలాంటి భావాలేవీ మీ మనసుల్లో చోటు చేసుకోకుండా చేసి ఆత్మ విశ్వాసాన్ని పెంచే ఏకైక సాధనం ''విపుల''. హిమాలయాల్నుండి కన్యాకుమారి దాకా అనంత వైవిధ్యంతో వెల్లివిరిసే మానవ జీవన సుమ సౌరభాన్ని మీకు అత్యంత సన్నిహితం చేసే ఏకైక పత్రిక ''విపుల''. శరత్కాలంలోనైనా, హేమంతంలోనైనా ఏ వాతావరణంలోనైనా మిమ్మల్ని హిమసానువుల నడుమ, సుందర్ కాశ్మీర్ వాతావరణంలో విహరింప జేస్తుంది 'విపుల'. అనేకానేక భాషల ప్రజల జీవన మార్గాన్ని, వారి ఆలోచనలను మీకు సన్నిహితం చేసే అత్యుత్తమ కథలకు వేదిక: 'విపుల'.

కథలు గాక అదనంగా నవ్వించే జోకులు, కార్టూన్లు, విచిత్ర విశ్వ పరిచయం, ప్రతి కథకూ రెండేసి రంగుల్లో ఆకర్షణీయ చిత్రాలు విపుల ప్రత్యేకతలు. ఇవన్నీ కూడా కేవలం 125 పైసల ఖర్చుతోనే అందజేసే విశ్వ కథా విపంచి 'విపుల'

# విపుల



# విచిత్రపక్షులు

అస్సాంకి చెందిన కచార్ జిల్లాలో "జాతింగా" అనే ఓ గ్రామం సముద్ర మట్టానికి 736 మీటర్ల ఎతున వుంది. అక్కడి ప్రజలంతా గిరిజనులే.

ఆ గ్రామంలో ప్రతీ సంవత్సరం సెప్టెంబర్, అక్టోబర్ నెలల్లో ఓ చిత్రం జరుగుతుంది. రాత్రిళ్ళు దీపాలు పెట్టే సరికి జాతింగా రైల్వేస్టేషన్ హెల్త్ సెంటర్ మధ్యనున్న ప్రదేశంలో ఎక్కణ్ణించో వందలకొద్దీ పక్షులు వచ్చి లైట్ల చుట్టూచేరి అక్కణ్ణించి కదలవు. కువ కువ లాడుతూ కులాసాగా కాలక్షేపం చేస్తాయి. 1905వ సంవత్సరం నుంచీ ఇది క్రమం తప్పకుండా జరుగుతోంది.



దీనికి ఇదమిత్థంగా కారణం ఇదీ అని ఏ శాస్త్రజ్ఞునికీ అంతుపట్టలేదు. కలకత్తా బర్డ్ వాచర్స్ సొసైటీ అధ్యక్షులు డాక్టర్ సుధీర్ సేన్‌గుప్తా రెండు సంవత్సరాలుగా ఈ విషయమై పరిశోధన సాగిస్తున్నారు.

మేఘావృతమైన ఆకాశం, మంచి వర్షపాతం, గంటకి 30,40 మైళ్ళ వేగంతో వీచే దక్షిణ గాలులూవున్న వాతావరణంలో ఈ పక్షులు దీపాలవైపు ఆకర్షింప బడతాయి. ఇందులో ఏ ఒక్కటి లేకపోయినా ఆనాడు పక్షులు దీపాల మొహం కూడా చూడవు.

దాదాపు 15 రకాల పక్షులు ఇక్కడికి వస్తాయని, వాటిలో గూడ కొంగలు, లకుముకి పిట్ట, వడ్రంగి పిట్ట, మనోహరంగా పాడే థ్రష్ పక్షులు, డ్రాంగోస్ మొదలైనవి వున్నాయని గత సంవత్సరం డాక్టర్ సేన్‌గుప్తా అన్నారు. ఆ విధంగానైనా పక్షి మాంసం రుచి చూపిస్తున్నందుకు భగవంతుడికి ధన్యవాదాలు చెప్పుకుంటారు అక్కడి ప్రజలు. అన్నింటి కంటే విచిత్రం ఏమిటంటే పగటిపూట ఆ చుట్టు పక్కల ఐదు కిలోమీటర్ల దూరంలో ఒక్క పక్షీ కనిపించక పోవడం!

# మతాధికారి ప్రేమ

"గోముఖ వ్యాఘ్రంలా 'భక్తి' ముసుగులో దురాగతాలు చేసే వ్యక్తులుంటారు జాగ్రత్త" అన్న బైబిల్లోని వాక్యంనిజమనిపిస్తోంది ఇటీవల శ్రీలంకలో జరిగిన ఓ సంఘటన వింటుంటే—

ముసలి శరీరం, నెరసినజుట్టు, తెల్లని పొడవైన గడ్డం, సమ్మోహనపరిచే చూపులు, సాధు రూపం వున్న ఫాదర్ పియారిస్ వయసు 60ఏళ్ళు. శ్రీలంకలోని సెయింట్ పాల్ చర్చిలో మతాధికారిగా వుంటున్న ఇతని ఇల్లు కూడా చర్చి కాంపౌండులోనే వుంది. అతనింటికి

# ప్రపంచం

దగ్గర్లోనే ఓ 32 ఏళ్ళ యువకుడు భార్య డోర్రీతో వుంటున్నాడు.

ఓనాడు అతను హఠాత్తుగా మరణించాడు. స్పృహతప్పిపోయిన స్థితిలో అతని ప్రాణం పోయింది. కానీ డోర్రీ భర్తను పోగొట్టుకున్న విచారం లేకుండా నిమ్మకు నీరెత్తినట్లు ప్రశాంతంగా వుంది. ఆమె ఇంటికి ఫాదర్ రాకపోకలు ఇదివరకటి కంటే ఎక్కువయ్యాయి. ఈ వార్త లండన్లో వున్న అతగాడి భార్య బెలీసియాకు చేరింది. ఆవిడ శ్రీలంకకు వచ్చి వాలింది. భర్త చర్యలను ఓ కంట కనిపెట్టి డోర్రీని ఇంటికి రానీయవద్దని చెప్పింది.



మతాధికారి ఆవిడ మాటల్ని లక్ష్య పెట్టలేదు సరికదా గట్టిగా మందలించాడు. హఠాత్తుగా ఓనాడు బెలీసియా స్పృహ తప్పి పడిపోయింది. ఆ తర్వాత 20 రోజులకు ఆస్పత్రిలో మరణించింది.

ఆరోగ్యంగా వుండే తల్లి హఠాత్తుగా మరణించడాన్ని లండన్లో వున్న ఆమె ముగ్గురు కూతుళ్ళు అనుమానించి శ్రీలంక పోలీసులకు చెప్పి కేసు నమోదు చేశారు.

పోలీసులు ఫాదర్ పియాటిస్ మీద నిఘావేసి వుంచారు. పాతిపెట్టిన ఆ యువకుని శవంతో పాటు బెలీసియా శవాన్ని కూడా వెలికి తీసి పోస్ట్‌మార్టంకు పంపారు. శవ పరీక్షలో వాళ్ళిద్దరూ విష ప్రయోగం వల్ల మరణించినట్లు నిర్ధారణయింది. వెంటనే పోలీసులు సెర్చ్ వారంటుతో ఫాదర్ దగ్గరికి వెళ్ళే ఏ మాత్రం అభ్యంతరం చెప్పకుండా మౌనంగా పోలీస్ వ్యాన్ ఎక్కాడు.

## సారాకారు

మద్రాసులో గిండీలోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ విద్యార్థులు కారు యజమానులకు 'నిషా' నిచ్చే పనిచేశారు.

ప్రపంచ వ్యాప్తంగా పెట్రోలు ధరలు విపరీతంగా పెరిగిపోవడంతో ప్రతి దేశం ప్రత్యామ్నాయ పద్ధతుల్ని వెతుక్కోవల్సి వస్తోంది. అమెరికా మళ్ళీ ఎథినాల్ ఆల్కహాల్‌ను, బ్రెజిల్ దేశీయులు సారాయి, పెట్రోలు మిశ్రమాన్ని ఇంధనంగా వుపయోగిస్తున్నారు. కానీ వారి ప్రయోగాలు ఇంకా ప్రాథమిక దశలోనే వున్నాయి.

మొత్తం సారాతోనే కారు నడపాలని టెక్నాలజీ విద్యార్థుల ప్రయత్నం. ప్రొఫెసర్ డాక్టర్ జగదీశన్ ఎన్నో దేశాలలో పర్యటించి ఈ అంశాల్ని కూలంకషంగా పరిశోధించాడు. అతని సహాయ సహకారాలతో గిండీ ఇన్‌స్టిట్యూట్ ముందడుగు వేసోంది.

పెద్ద మొత్తంలో దేశీయ మద్యం

దొరకాలంటే అంత తేలికైన పనికాదు గదా! అయ్యో కారు నడిపేందుకేగానీ తాగేందుకుకాదని కలెక్టరుగారికి తమ ప్రణాళికా పథకాన్ని వివరించి పర్మిషను తీసుకోవడానికి చాలా కష్టపడవల్సి వచ్చింది.

మొదట పెట్రోలుతో ఇంజన్ను స్టార్ట్‌చేసి తర్వాత ఎథినాల్‌ను పోశారు. ఇంజను అత్యద్భుతంగా పనిచేయడం ప్రారంభించింది. పూర్తి మద్యంతో పరీక్షించాలంటే కొత్త కారుండాలి కదా! మొత్తాని కెలాగైతేనేం ఓ మిత్రుని ద్వారా కొత్త ఫియట్ కారును సంపాదించి 200




రూపాయలు ఖర్చుపెట్టి కార్బరేటర్లో చిన్నచిన్న మార్పులు చేశారు. అంతే! పూర్తి దేశీయ మద్యంతో కారు నాలుగో గేర్‌లో గంటకి వంద మైళ్ళ వేగంతో నడుస్తోంది.

గిండీ టెక్నాలజీ ఇన్‌స్టిట్యూట్ విద్యార్థులు శ్రీరాం, శ్రీకాంత్, విశ్వనాథ్, ప్రొఫెసర్ జగదీశన్‌లకి దేశంలో మొట్టమొదటిసారిగా నాటుసారాతో కారు నడిపిన ఘనత దక్కింది.

నాటు సారాను కూడా కార్లవాళ్ళు కొనేసి కడుపు కొడుతున్నారని బలహీన వర్గాలవారు హర్తాల్ చేయొచ్చిక.

## ప్రాణానికి పోతే..

నేరాలు చేశాక ఆధారాలు లేవని కాలరెగరేసుకు తిరిగే నేరస్తుల్ని పట్టిచ్చే విషయాలు చాలా వున్నై. అందులో వాతావరణం ఒకటి. 1963 అక్టోబరులో ఎథెల్ కెనెడీ అనే ఆమె స్వారీ చేస్తుండగా ఎముకలు బయటపడి, కళ్ళలో ప్రాణాల్ని నిలుపుకున్న ఒక గుర్రం కనిపించిందామెకి. సహజంగా జాలిగుండెదవటం వల్ల దాన్ని యింటికి తీసుకుపోయి బాగా పోషించ సాగింది. అయినా దాని నూకలు చెల్లిపోయాయి. అప్పుడు తీరిగ్గా ఆ గుర్రం యజమాని ఆమెపై ముప్పయివేల డాలర్ల నష్టపరిహారం దావా వేశాడు. పైగా ఆరోగ్యంగా, పుష్టిగా వున్న గుర్రం ఫొటో చూపించి– "అయ్యో ఏనుగులా గుండే నా గుర్రం ఆమె దగ్గరి కెళ్ళేసరికి పీనుగులా మారిపోయింది. చూడండి యీ అన్యాయం" అని కన్నీళ్లు పెట్టుకున్నాడు.

దిక్కుతోచని ఎథెల్ చివరి ప్రయత్నంగా ఒక వాతావరణ శాస్త్రజ్ఞుని సహాయం కోరింది. అతడు ఫొటోలోని గుర్రం నీడ తాలూకు తీరు తెన్నులు, పొడవు; వెడల్పులు, సూర్యుడు ఏ స్థానంలో వున్నాడు మొదలైనవిషయాల్ని పరిశీలించి– అనుమానం లేదు ఇది చాలా కాలం క్రితం తీయబడ్డ ఫొటో' అని నిర్ధారణ చేశాడు. బ్రతుకు జీవుడా



అని ఇల్లు చేరింది ఎథెల్ మరెప్పుడూ అనవసర విషయాల జోలికి పోకూడదని నిశ్చయించుకుంటూ.

# కవర్ల రేషన్

గాలివాన వస్తే కథేలేనట్లు నాసిక్‌లోని ప్రభుత్వ ముద్రణాలయంలోని కొన్ని యంత్రాలు చెడిపోవటంతో ఉత్పత్తి కుంటుపడి దేశవ్యాప్తంగా పోస్టేజి కొరత ఏర్పడింది. దీని ప్రభావం పట్నాల్లోకంటే జిల్లాల్లోనే ఎక్కువగా వుంది.

బోల్డంత డబ్బు తగలేసి రైళ్ళల్లో, బస్సుల్లో వెళ్ళి బంధు మిత్రులను పరామర్శించడం కష్టం. కనీసం కార్డుముక్కయినా రాద్దామంటే బజార్లో కిరసనాయిల్ కరువును మించిపోయింది పోస్టేజి కొరత. ప్రజాసౌకర్యాన్ని దృష్టిలో పెట్టుకుని పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం కలకత్తా ప్రెస్‌లో పది లక్షల ఇన్లాండు కవర్లను ముద్రించడానికి కేంద్ర తంతి తపాలా శాఖవారి అనుమతి తీసుకుంది. ఇవి త్వరలోనే మార్కెట్‌లోకి వస్తాయి. కవర్లు, కార్డులు, స్టాంపులు మొదలైన వాటిని రేషన్ దుకాణాల్లో అందుబాట్లో వుంచాలని కూడా పశ్చిమబెంగాల్ ప్రభుత్వం నిశ్చయించింది.

బీహార్‌లో పోస్టేజి కొరత మరీ ఎక్కువగా వుండడం వల్ల అక్కడి ప్రజలు సరిహద్దుకు దగ్గర్లో వున్న పశ్చిమ బెంగాల్‌కి వెళ్ళి కార్డు, కవర్లు కొనుక్కుపోతున్నారు. ఉత్తర ప్రదేశ్ ప్రజలు 'భేఁంగ్' ఉత్తరాలు పంపడం తప్పనిసరౌతోంది.

కవర్ల ధర పెరగడంతో ఇన్‌లాండ్ కవర్లకు డిమాండ్ పెరిగింది. 1978-79 లో కేవలం పశ్చిమ బెంగాల్‌కే 1 కోటి 65 లక్షల 8 వేల రూపాయల ఖరీదు చేసే ఇన్లాండు కవర్లు, ఒక కోటి 52 లక్షల 17 వేల ఖరీదు చేసే కార్డులూ, రిప్లై కార్డులూ కావల్సి వుంది.



నాసిక్ ముద్రణాలయంలో పాత యంత్రాలను మార్చి కొత్త యంత్రాలను ప్రతిష్ఠించాల్సిన సమయం ఎపుడో

వచ్చింది గానీ డిమాండ్ పెరిగి వుత్పత్తి తగ్గిపోయే స్థితికి వచ్చేవరకూ ఏం పట్టించుకోలేదు. ఇన్నాండు కవర్ల ముద్ర ణకు కావల్సిన యంత్రాన్ని ప్రభుత్వం దిగుమతి చేసుకుంది గానీ, అది పని చేయడం ప్రారంభించడానికి ఎన్నాళ్ళు పడుతుందో ఏమో!

## తస్మాత్ జాగ్రత్త

జార్జి వాషింగ్టన్ బ్రిడ్జ్ మీద ఒక కారు డ్రైవరు ప్రమాదంలో చనిపోయాడు. దానికి బాధ్యులు పి. డబ్ల్యు. డి వారే అని నష్ట పరిహారం కోసం వార్ని కోర్టు కీడ్చారు సదరు కారు డ్రైవరు బంధు



వులు. ఇందులో పి. డబ్ల్యు. డి. వారి బాధ్యత ఎంతో తేల్చమని కాన్‌రాడ్ కెసెల్టి అనే వాతావరణ శాస్త్రజ్ఞుణ్ని కోరారు. అతని గ్రంథాన్వేషణలో ఆ వంతెన దగ్గర గాలి బాగా విపరీతంగా వీస్తుందని, అక్కడి వాతావరణం సరియైనది కాదు కాబట్టి, పిడబ్ల్యుడి వారు వాహనాల రాకపోకల్ని అనుమతించకుండా వుండాల్సిందని తేలింది. అంతకు ముందు ఓసారి యీ కారణం మీదే వంతెనను మూసేశారు. ఉద్యోగధర్మాన్ని నిర్లక్ష్యం చేశారు కనుక రాష్ట్ర ప్రభుత్వం కారు డ్రైవరు బంధువులకి నష్ట పరిహారం చెల్లించాల్సిందేనని కోర్టువారు తీర్మానించేరు. ఇది 1967లో జరిగింది.

## ముద్దు గుడ్డిదా?

'ము...ము ... ముద్దంటే చేద'ని ఎవడూ అనడు. కాని ముద్దుపెట్టుకొనే టప్పుడు మనుషులు కళ్ళెందుకు మూసుకుంటారన్నది సకారణంగా తెలుసుకోడానికి ఫార్మోజాలోని ఓ ప్రముఖ దిన పత్రిక ప్రశ్నావళిని తయారుచేసి పాఠకుల కందించింది.

ఈ ప్రశ్నావళి నందుకున్న పాఠకులు ఆమందానంద కందళిత హృదయారవిందులై ఎడాపెడా కారణాలు రాసి పారేస్తార్ట. కొందరు పిచ్చిపిచ్చి కారణాలు రాసినా కొందరు మాత్రం సబబైన కారణాలు రాశారు. పత్రికాధిపతులు అన్నిటినీ పరిశీలించి నాలుగు కారణాలు సరియైనవిగా నిర్ణయించేరు.

అమ్మాయిని గాని, అబ్బాయిని గాని కళ్లు తెరిచి ముద్దుపెట్టుకోవడం అన్నది నాటకం కళ్ళుమూసుకు చూడటం లాంటిదన్నది ఒకటో కారణం.

తర్వాత కారణం ప్రేమ గుడ్డిది అన్నారు కాబట్టి ముద్దు కూడా కళ్లు




మూసుకు పెట్టాలన్నది.

ముద్దు అన్నది కేవలం అనుభూతి కోసమేగాని చూడటం కోసం కాదన్నది మూడో కారణం. ఇహ నాలుగో కారణం యిది. 'తర్వాత ఏం చెయ్యాలా?' అని ఆలోచించడానికి ముద్దు పెట్టుకొనేటప్పుడు కళ్లు మూసుకుంటారు అనేది నాలుగోది. దీన్ని చాలా మంది ప్రాశారని తెలిసింది.

## కృతజ్ఞత ఖరీదు

ఓ సారి బీరూట్‌కి ప్రయాణమై వెడుతున్న ఒక అమెరికా నావికుడు ప్రమాదవశాత్తూ సముద్రంలో పడిపోయాడు. ఎలాగో తంటాలుపడి అతన్ని రక్షించాక ఆ కృతఘ్నుడు 'మీ మీద కేసు పెడ్తా' నని ఓడ అధికార్ల మీద ఎగిరాడు. వాతావరణం సరిగా లేనందున ఓడ పై భాగానికి రావాల్సి వచ్చిందని అకస్మాత్తుగా పడిపోయానని అతని వాదన. వాల్టర్ జెల్ట్‌మన్ అనే వాతావరణ శాస్త్రజ్ఞుడు ఆ ఓడ ప్రయాణం చేసిన రోజునగల వాతావరణ వివరాలనేకం సేకరించి, ఆరోజు వాతావరణం ప్రశాంతంగా వుందని నిరూపించాడు. చేసేదిలేక నోరు మూసుకొని ఇంటికి పోయాడు సదరు పెద్దమనిషి.

దీన్నిబట్టి గాలి,సముద్రం, ప్రవాహాలు వగైరాలన్నీ కూడా నేరస్తుల్ని పట్టిస్తాయని గ్రహించవచ్చు. అసలు రెండు సంవత్సరాల క్రితం వాతావరణ పరిస్థి



తుల్ని కూడా వాతావరణ శాస్త్రజ్ఞులు చెప్పగలరు.

## మోనెక్స్

కలకత్తాలో జరుగుతున్న వాతావరణ పరిశోధనల్లో భారత, అమెరికా శాస్త్రజ్ఞులతో బాటు బంగ్లాదేశ్, నేపాల్, ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్, టాంజేనియా, శ్రీలంక, చైనా దేశాలకు చెందిన వాతావరణ శాస్త్రజ్ఞులు కలిసి పనిచేయడానికి చేతులు కలిపారు.

వర్షఋతువు ఎందుకు మారుతుంది ?

కరువు కాటకాలు సంభవించడానికి కారణా లేమిటి ? మొదలైన అంశాల మీద పరిశోధనలు చేస్తున్నారు. ఇందుకుగాను అత్యంతాధునిక కంప్యూటర్ పరికరాలు అమర్చిన రెండు అమెరికా విమానాల్ని వుపయోగిస్తున్నారు. ఈ విమానాలు బంగాళాఖాతం మీద ఎగురుతూ మేఘాలనీ, తరంగాలనీ ఫొటోలు తీస్తాయి. ప్రతి నాలుగు సెకన్లకీ గాలి వీచే దిక్కును,గాలి వేగం,మేఘాల సాంద్రత, గాలిలో తేమను



కూడా కనుక్కుంటాయి. సముద్రపు అలలనే గాక నీటి ఒత్తిడిని కనుక్కునే 12 ఎలక్ట్రానిక్ పరికరాలను సముద్రపు నీటిలో వేశారు. నిర్విరామంగా ఓ సంవత్సరంపాటు ఈ లెక్కల్ని సేకరిస్తారు.

మే, జూన్ నెలల్లో, పూర్తయిన మొదటి దశ ప్రయోగాలను మోనెక్స్ అనే పేరుతో వ్యవహరిస్తున్నారు. తాత్కాలిక ఆఫీసు నిర్వాహణకోసం కలకత్తా 'డండం' విమానాశ్రయంలోని సెంటార్ హోటల్‌ని మొత్తంగా 8 లక్షల రూపాయలకి ఓనెల రోజులపాటు అద్దెకు తీసుకున్నారు.

మోనెక్స్ శాస్త్రజ్ఞులు పదేళ్ళ పరిశోధనానంతరం సిల్వర్ అయొడిన్‌ను మేఘాల్లోజల్లి భయంకర తుఫానుల సంఖ్య తగ్గించ గలుగుతారు. బంగాళాఖాతం మీద చేసే ప్రయోగాలే గాక బెర్ముడా, ప్యూరిటోరికో, ఆస్ట్రేలియాల్లో కూడా పరిశోధనలు జరుగనున్నవి.

# కలియుగ భీముడు

మహాభారతంలో నిజంగా భీముడున్నాడో లేడో గాని అతన్ని మించిన బలశాలి మాత్రం తమిళనాడులోని కారైక్కుడిలో వున్నాడు. యోగిరామరాజు అనే అతను అక్కడ ఓ పెద్ద తాటిచెట్టును వేళ్ళతో సహా పెకలించి ప్రజల్లో గొప్ప సంచలనం సృష్టించాడు, రామరాజు అసలు ఆంధ్ర ప్రదేశ్‌కు చెందిన హఠయోగి.

తాటిచెట్టును పడగొట్టి తన కండబలాన్ని ప్రదర్శిస్తానని ముందుగా ప్రకటించాడు. నిర్ణయించిన తేదీన రామనంతపురం జిల్లా కలెక్టరు శ్రీ సుబ్రమణ్యం తన సిబ్బందితో నిర్ణీత స్థలానికి వచ్చారు. చుట్టు పక్కల గ్రామాలనించి ఈ అపరభీముణ్ణి చూడ్డానికి ప్రజలు తండోపతండాలుగా వచ్చి చేరారు.

రామరాజు తాటిని తన భుజంతో బాగా కుమ్మాడు – తర్వాత రెండు చేతులతో చెట్టును బాగా వూపాడు. వేళ్లు బాగా లోతుగా వ్యాపించివుండడం వల్ల చెట్టు తొందరగా కదల్లేదు. కానీ రామరాజు నిరాశపడక లావుపాటి తాడు తీసుకుని చెట్టుకి కట్టేసి, తన వొంట్లో శక్తినంతా చేతివేళ్ళలో కేంద్రీకరించి తాడు నొక్కసారి పక్కకి గుంజాడు. ధభిల్లుమని నేల



కొరిగింది చెట్టు.

ప్రజలంతా హర్షధ్వానాలు చేశారు. కలెక్టరుగారెంతో పొగిడి 'కలియుగ భీముడని' బిరుదిచ్చారు.

# కేబరీయులు

సాధారణంగా కేబరే డాన్సుల్ని అమ్మాయిలే చేస్తారు. అందుకు పూర్తి విరుద్ధంగా ఆడవాళ్ళచేత శభాషని-పించుకునే మగ కేబరేల సంఖ్య పెరుగుతోందిప్పుడు. అమెరికాలోని మూడు నైట్‌క్లబ్బుల్లో ఇటీవల మగ కేబరే నృత్యాలు ప్రారంభమయ్యాయి. పురుషత్వం మూర్తీభవించిన ఆ మగ కేబరే కళాకారులు నేపథ్య సంగీతాని కనుగుణంగా ఒంటిమీద బట్టలు విసిరేస్తుంటే ఆడ ప్రేక్షకులు ఉత్సాహం పట్టలేక, ఆ క్షణంలో స్త్రీలమన్న మాట కూడా మర్చిపోయి హాలదిరిపోయేలా చప్పట్లు కొడుతున్నారట.

సంతానలక్ష్మి అయిన ఓ 45 ఏళ్ళావిడకి మగ కేబరేలను చూడ్డమంటే విపరీతమైన పిచ్చి - "మగవాళ్ళు స్త్రీ అణువణువూ నగ్నంగా పరిశీలిస్తున్నపుడు మేమెందుకు వాళ్ళని నగ్నంగా చూడకూడదు!" అంటుంది 21 ఏళ్ళ మార్తా అనే మరొకామె.

ప్రదర్శనల్లో ఆడపిల్లలిచ్చే ప్రత్యేక 'టిప్పులు'గాక వారానికి 400 డాలర్లు సంపాదిస్తాడొక్కొక్క మగ కేబరీయుడు.

"సెక్సీరెక్సీ"గా పేరు పొందిన ప్రఖ్యాత మగ కేబరే 'స్ట్రిప్‌టీజ్' నృత్యం చేస్తుంటే, ఉద్రేకం ఆపుకోలేక ఒకమ్మాయి స్టేజీమీదకి వచ్చి అతగాడు వేసుకున్న ఒకే ఒక లాగూను కిందకి



లాగేసింది. పూర్తి నగ్నంగా నాట్యం చేయడం ఆ క్లబ్బులో నిషిద్ధం అవడంతో మఫ్టీలో వున్న ఆడపోలీసు ఆమెను అరెస్ట్ చేసింది. ఆడపోలీసు చర్యకు వ్యతిరేకంగా ఆ మర్నాడే వందలాది అమ్మాయిలు నిరసన తెలియజేశారు. హత విధీ!

సూర్యుడు అరుణకాంతులు వెదజల్లుతున్నాడు. అమాయకుల రక్తంతో తడిసినట్లుగా ఆకాశం మరింత ఎర్రగా ఉంది.

ఆ రక్త ప్రవాహం తిన్నగా త్రిలోక ఇంటి ఆవరణలోకి వచ్చినట్లుగా అక్కడ పచ్చని బొప్పాయి ఆకులమీద ఎర్రని ఎండ ప్రతిఫలిస్తోంది. ఆ కూలిపోయిన మట్టిగోడ పక్కనే ఇంట్లోని చెత్తా చెదారం పోస్తుంటారు. ఆ చెత్త కుప్ప పక్కనే దబ్బూ కూర్చుని ఉంది. అది ఆకాశం వైపు తల ఎత్తి దీనంగా మొరుగుతోంది.

ఆ మధ్యాహ్నం గ్రామ సమితివాళ్ళు విషం కలిపిన మాంసం ముద్దల్ని సందుల్లో వేశారు. ఆ సమయంలో దబ్బూ ఆ పెద్ద బాన నీడలో చల్లని మట్టి పరిమళాన్ని ఆస్వాదిస్తూ నిద్రిస్తోంది. ఆ నీడే, ఆ నిద్రే దాని ప్రాణాన్ని కాపాడింది. లేకుంటే అది కూడా ఇతర కుక్కల్లాగే ముఖ్యంగా తన ప్రియురాలు బోరిలాగా ప్రాణం పోగొట్టుకుని ఉండేదే. కొన్ని గంటలపాటు హాయిగా నిద్రించి, ఆ తర్వాత లేచి ఒళ్ళు విరుచుకుంటూ ఆవలించింది దబ్బూ. అప్పటికే బోరి ప్రాణాలుపోయి దాని తెల్లగుడ్లు బయట పడ్డాయి. దబ్బూ ఒక్క ఉదుటున వీధిలోకి పరిగెత్తింది. దుంగల్లే మొద్దుబారిన బోరి మృతదేహం దానికంట పడింది. డబ్బూ వాసన చూసి నెమ్మదిగా తిరిగి ఇంటివైపు నడక సాగించింది.

త్రిలోక భార్య రాణో, పొరుగింటావిడ చన్నో దబ్బూ పోయిరావడాన్ని గమనించారు. చన్నో ముక్కు పుడకమీద వేలేసుకుని దీర్ఘంగా నిట్టూర్చింది. "ఎంత దారుణం! ఈ మగజాతి అంతా ఇంతే! ఈ జాతి జాతినంతటినీ ఒకే త్రాటితో కట్టిపడేయాలి" అంది.

రాణో కనురెప్పలు రెపరెప లాడాయి. అరచేతిని వెనక్కి తిప్పి కన్నీళ్ళు తుడుచుకుంది.

చన్నో మగవారిలాగా ఓ బూతుమాట విసిరి వడివడిగా ఇంట్లోకి వెళ్ళి పనులు చూసుకోవడంలో నిమగ్నం అయింది. ఆ పనులు ముగించుకునేసరికి మధ్యాహ్నం జరిగిన దుర్ఘటన గురించి మర్చిపోయింది. కాని ఇంట్లోని చెత్తని ఊడ్చి ఆ కుప్పమీదకి వేయడానికి వెళ్ళినపుడు అక్కడున్న దబ్బూ తన దుర్విధిని అమె స్మృతి పథంలోకి తీసుకువచ్చింది. చన్నో చీపురుకట్ట తీసుకుని, మోరెత్తి ఏడుస్తున్న ఆ దబ్బూని బయటకు తరిమింది. "దిక్కుమాలినదానా నువ్వు కూడా చావు! నా దొడ్లో ఎందుకేడుస్తావు? నీ కంతగా ఏడవాలని వుంటే చౌదరిగారి దొడ్లోపడి ఏడు. అక్కడ జనమూ ఉన్నారు. ధనమూ ఉంది" అంటూ శాపనార్థాలు పెట్టసాగింది.

ఇంట్లో కుక్క ఏడిస్తే అశుభం జరుగుతుందని ఆమె నమ్మకం.

రాణోకి కూడా చౌదరి అంటే పరమ అసహ్యం. ఆమె భర్తని చెడు మార్గాల్లో దింపింది అతనే. అందుకే అతనంటే ఆమెకి తగని కోపం. పల్లెపట్టున వుండే ఆడవారే అంత.. తమ భర్తలలో వున్న ప్రతి లోపానికి కారణం వేరెవరో అనే భావిస్తుంటారు. త్రిలోక చేస్తున్న వెదవ పనులను గురించి ఎందరో రాణోకి చెప్తుండేవారు. లోపల దహించుకుపోతున్నా పైకి మాత్రం తొణక్కుండా నిండు కుండల్లే మౌనంగా ఉండేది. త్రిలోక ఇంటికి వచ్చాక నోటి కొచ్చినట్లు దులిపే

సేది. గోళ్ళతో అతని ముఖం రక్కేది. పళ్ళతో కొరికేది. అవన్నీ సహించి చివరికి విసిగిపోయి అతను తిరగబడి కొట్టేదాకా అలాగే చేసేది. ఆ దెబ్బలతో ఒళ్ళు నలిగాక చల్లబడి వేదాంత ధోరణిలో 'నయమే. తన కామాన్నీ, కోరికల్నీ మరెక్కడో దులుపుకుని వసున్నాడు. లేకుంటే ఆ వెధవ్వేషాలన్నీ నేనే భరించాల్సి వచ్చేది' అనుకునేది.

ఆ పల్లెటూరిలో వినవచ్చే పుకార్లవల్లే తన భర్త 'మగ' లక్షణాలని గురించి తెలుసుకుంది రాణో. అప్పటి నుంచి తన భర్త ప్రేమానురాగాల్ని పూర్తిగా తన సొంతం చేసుకోవాలనే వాంఛ ఆమెలో ప్రబలింది. ఆ వాంఛని సఫలం చేసుకోవడం కోసం ఊరిబయట చెట్టు క్రింద మఠం వేసిన స్వాముల వారిని ఆశ్రయించింది. ఆయన గొప్ప తపస్సు చేసి ఎన్నో అతీంద్రియ శక్తులను సాధించాడుట. ఇనపగోచీ పెట్టుకున్న ఆ మహానుభావుడు స్త్రీల వంక కన్నెత్తి చూడడట. రాత్రనక పగలనక ఆయన చుట్టూ ఎంతో మంది స్త్రీలు మూగుతుంటారు. అయినా ఆయన చలించడం లేదంటే జనం అనుకునే మాటలు విశ్వసించదగ్గవే అయ్యుండవచ్చు. కొందరు ఆయన దగ్గరికి సంతానం కావాలంటూ వస్తారు. మరికొందరు మగ సంతానం కావాలంటారు. ఇంకొందరు ధరించిన గర్భం పోకుండా నిలిచేందుకు తాయెతులు అడుగుతుంటారు. వచ్చే స్త్రీలలో అత్యధిక శాతం తమ భర్తల్ని గుప్పిట్లో పెట్టుకోవాలనే కోరికతో వచ్చేవారే.

గ్రామంలో అందరూ పూజారిగారి భార్య పూరణ్ దేవిని గురించి వింతగా చెప్పుకునేవారు. స్వాముల వారిచ్చిన తాయెత్తు మహిమవల్లే ఆమె కడుపు పండిందట. అంతే కాదు ఆమె భర్తని ప్రేమతో భార్య వెంటపడి తిరిగేలా చేసిందట కూడా.

రాణో కోరిక మన్నించి స్వాముల వారు ఆమెకి ఏదో పొడి ఇచ్చారు. తిలోక ఆమెని పాలు అడిగినప్పుడు అందులో కలిపి ఇవ్వాలి. ఆ అవకాశం కోసం ఎదురు చూస్తోంది ఆమె. ఆ పాలు తాగి విజృంభించిన శక్తితో తనని పరవశింపజేసే శుభ సమయం కోసం వేచివుంది ఆమె.

"అతను తనని తాను అదుపులో ఉంచుకోలేని సమయంలో నన్ను ముట్టుకోవద్దనాలి. చేతులూ కాళ్ళూ పట్టుకొని ప్రాధేయపడితే అప్పుడు ముట్టుకోనియ్యవచ్చు" - అంటూ ఊహించుకొనేది. ఊహలు ఊహలుగా ఉండగానే రోజులు వారాలు గడిచిపోయాయి. ఈమధ్య తిలోక పాలు కావాలని అడిగింది లేదు. పాలకి బదులుగా, చౌదరి ఇచ్చిన నారింజ రంగు పానీయంతో తన దాహం తీర్చుకునేవాడతను.

రాణో ఎన్నో విషయాలని క్షమించ గలిగినా, తాగుడిని మాత్రం క్షమించలేదు. ఆమె దృష్టిలో, ఇంట్లో మందు సీసా ఉందంటే సవతి ఉందన్న మాటే. "ఆ తాగుడు దిక్కుమాలిన వాసన. రామ... రామ...దానిని తలుచుకొంటేనే జ్వరం వచ్చినంతపని అవుతుంది. ఒకసారి తాగడం మొదలెత్తే ఇంక దానికి బానిసలు అయిపోవలసిందే! అంతటితో సర్వనాశనం తప్పదు" అనుకునేది.

పగటిపూట తిలోక తన జట్కా నడిపేవాడు. అతనిలాగే నవాబ్, ఇస్మాయిల్, గురుదాస్‌లు కూడా జట్కా తోలేవాళ్ళు. అయితే తిలోక మాత్రమే సాయంకాలం

పూట జట్కా స్టాండ్ వద్ద నిలబడి చౌదరి కోసం, తీసుకుపోదగిన స్త్రీల కోసం వేచివుండేవాడు. ఎవరేనా తగిలితే తీసుకువెళ్ళి చౌదరిగారి "రెస్ట్‌హౌస్"లో జేరుస్తాడన్న మాట. ఆ ఆడవాళ్ళకు అక్కడదొరికే కమ్మటి విందు భోజనం, మెత్తటి శయ్యాసుఖాల్ని గురించి ఊరించి చెప్పుండేవాడు. ఇంతటి శ్రమకి అతనికి ముట్టే ప్రతిఫలం, కాస్త మాంసం ఒక సీసా నారింజ రంగు పానీయం. అంతే!

కోట్లా యాత్రాస్థలం. చౌదరి దొడ్డికి ఒక వైపున అమ్మవారి గుడి ఉంది. భైరవ్ అనే కామాంధుడైన రాక్షసుడు ఆమెని తరుముతుంటే ఆమె పారిపోతూ, అక్కడ ఒక్క క్షణం ఆగి ఊపిరి పీల్చుకుందట. ఆ తర్వాత ఆమె జమ్మూలోని సియాల్‌కోట్ కొండలలోకి పోయి తల దాచుకొందట. వాయువ్య దిశగా తలెత్తి చూస్తే దుమేల్ దగ్గరున్న కొండలలో, ఒంటి మూపురం ఆకారంలో వున్న శిఖరం కనిపిస్తుంది. వైష్ణవదేవి పేరిట చలామణి అవుతున్న శిఖరం అది. కోట్లా దగ్గర ఆమె క్షణకాలం ఆగింది కనుక, అది యాత్రాస్థలమయింది.

ఆ సాయంత్రం చౌదరి కోసం తిలోక తీసుకు వచ్చిన అమ్మాయి వయసు కేవలం పదమూడేళ్లు. రాక్షసుడు కామ తృష్ణతో దేవి వెంటపడితే ఆమె తన త్రిశూలంతో వాని తల నరికివేసింది. కాని పాపం ఆ పదమూడేళ్ళ చిన్నారికి, చౌదరి కబంధ హస్తాలనుండి తప్పించుకోడానికి కేవలం గులాబీ పూదళాల వంటి మెత్తని చేతులు రెండున్నాయి. అంతే! ఆ రెంటినీ జోడించి ఆ అమ్మాయి తనని వదిలిపెట్టమని దీనంగా చౌదరిని అర్థించింది. కాని అందువల్ల ఫలితం శూన్యం! ఆమె చర్మం మల్లెపువ్వంత కోమలంగా ఉంది. అందుకే చౌదరిగారి కామవాంఛకు అది సులువుగా నలిగి వాడిపోయింది.

అటువంటప్పుడు సూర్యభగవానుడు కోపంతో తన ముఖాన్ని ఎరుపు చేసుకోవడంలో ఆశ్చర్యమేముంది! ఆ కోపంలోనే ఆయన వెర్రి ఆవేశంతో తన ఏడు గుర్రాలని కొరడాతోకొట్టి తన రథాన్ని ఆ గ్రామం గుండా త్వరితంగా పరిగెత్తించి పత్తి పొలాల వెనక అదృశ్యమయ్యాడు. ఆయన తన అగ్రహారుణ కాంతిని మాత్రం కొంత ఆకాశంలో వదిలిపెట్టి వెళ్ళినట్టున్నాడు. ఆ వెలవెల బోతున్న ఆకాశంలో విదియ చంద్రుడు మరింత వెలవెల బోతున్నాడు.

గుడి పక్కనే కంట్రాక్టర్‌గారి ఇల్లుంది. ఆయన ఇంటి కప్పు బాగుచేయిస్తున్నాడు. సాయంకాలపు నీరెండ నీడలు ఆ ఇంటి గోడలపై పడుతున్నాయి. గోడలోపలవున్న ఎర్ర ఇటికలైతే కనిపించడం లేదు కాని, సున్నం బెల్లులు ఊడి పోవడంతో నవ్వుతుంటే పళ్ళు బయట పడ్డట్టుగా ఉంది. కాలవ ఒడ్డునవున్న సరుగు, నేరేడు, వేపచెట్ల మీదనుంచి గాలి వీస్తూ ఈలపాట పాడుతోంది. చెరువు గట్టునే కొంతమేరకు నరికి వేయబడ్డ పెద్ద చెట్టుకున్న ఆకులు ఆ ఈల పాటకి తాళం వేస్తున్నట్లు రెప రెప లాడుతున్నాయి. ఆ చెట్టు కిందనే బాబాహరిదాస్ ఉండేది. ఆ గ్రామంలో వున్నది ఒకటే బజారు. అక్కడవున్నవి నాలుగే నాలుగు కిరాణాదుకాణాలు. తిలోక ఆ బజారుగుండా తన జట్కా తోలుకుంటూ వెళ్తున్నాడు. ఆ కిరాణా కొట్ల దగ్గరికి వెళ్ళేసరికి, ఒంటరిగా వున్న ఒక స్త్రీ గోధుమలు కొంటూ కనిపించింది. ఆమె ఎవరో కాదు జీలం. తిలోక

ఆమెని చూసి "హేయ్ జీలం...ఏమిటి సంగతి ... బాగున్నావా ముసలిపిల్లా ?" అని గట్టిగా అరిచాడు.

జీలంని అందరూ ఏదో ఒకటి అంటూనే ఉంటారు. ఎవరేమనుకున్నా ఆమె లెక్క చేయదు. మోటుగానైనా సరే చురకిచ్చి వదుల్తుంది. తిలోక మాటలకి, ఆమె గోధుమలు సంచిలో పోసుకుంటూనే "నా గొడవ నీకెందుకు మీ అమ్మకి ఇష్టమైతే ఆమెతో పోరాదూ ?" అని మోటుగా, ఘాటుగా జవాబిచ్చింది.

తిలోక నవ్వుకుంటూ తన దారిన తాను పోయాడు.

తిలోక కవల పిల్లలు ఇద్దరూ వేప చెట్టు కింద కూర్చొని బొగ్గుతో గీసి దాడి ఆడుకుంటున్నారు. వాళ్ళిద్దరిలో ఒకడు ఒక పావుని చంపాడు. దానికి రెండోవాడు అడ్డు చెప్పాడు. దాంతో ఇద్దరూ అరుచుకుంటూ పోట్లాడుకోసాగారు. ఒకరి జుట్టు ఒకరు పీక్కుంటూ వాళ్ళ పెద్దలు ఉపయోగించే రంజయిన భాషలో తిట్టుకోసాగారు. తండ్రి అడుగుల సవ్వడి వినబడగానే విడిపోయి, పుస్తకాలు తీసుకుని, త్వరత్వరగా నూనె దీపం పక్కన కూర్చుని పాఠాలు చదువుకోసాగారు.

తిలోక వాళ్ళని పిలిచాడు.

పెద్దవాడు తన పాఠంలోని "గుడ్లగూబ నిర్జన ప్రదేశంలో చెట్లమీద కూయును" అన్న వాక్యాన్ని బిగ్గరగా చదువుతూ, ఏమీ ఎరగనట్లు నటించాడు.

తిలోకకి తన కొడుకుల సంగతి తెలుసు. "లంజకొడుకుల్లారా! మీ వేషాలు నా దగ్గర కాదురా. ఇలా రండి" అని అరిచాడు.

చిన్నవాడు చురుకైనవాడు. వాడు వెంటనే "మనం ఎప్పుడూ చెడ్డ మాటలు మాట్లాడ కూడదు. మనం ఎప్పుడూ చెడ్డ మాటలు మాట్లాడకూడదు" అంటూ తన పాఠాన్ని అందుకున్నాడు.

తిలోక ఆ మాటల వెనక ఉన్న భావాన్ని, కొడుకు సమయస్ఫూర్తిని గ్రహించాడు. అంతటితో నోరు మూసుకుని లోపలికి పోయాడు.

కవలపిల్లలు కాక మరో ఇద్దరు పిల్లలున్నారు తిలోకకి. అందరిలోకీ ముందు పుట్టింది వద్దీ. పిలిచేందుకు సులువుగా ఉంటుందనీ, అటువంటి పేరు పెడ్తే వంశం నిలబడ్తుందనీ నమ్మకంతో ఆ పిల్లకి 'వద్దీ' అని పేరు పెట్టారు. ఆ అమ్మాయి ఇంటి పనుల్లో తల్లికి చేదోడుగా ఉంటుంది. ఏడాది పసివాడు చమ్మూని ఎత్తుకుని తిప్పుతూ ఆడిస్తుంటుంది

ఆటనుంచి వచ్చాడు మా బాబు
ఆకలితో వున్నాడు మా బాబు
పిండి కలిపి రొట్టె చేస్తాను
కడుపు నిండా మెబుగు పెడ్తాను.

అని పాడుతూ వాడిని ఆడిస్తుండేది.

ఇరుగు పొరుగు పిల్లలతో చెమ్మ చెక్కలాడేటప్పుడు కూడా, వద్దీ తన తమ్ముని మీదనే పాడుతూండేది.

డాబామీదికి వచ్చాము మనమంతా
నా తమ్ముడున్నాడు. వెదురు బొంగంత
సరుకు చెట్టులాగా నా మరదలుంటుంది
ముక్కులోన బంగారు బులాకీ పెట్టుంది.

వద్దీ తనకి పరిచయమున్న వ్యక్తుల్నీ, వస్తువుల్నీ, అన్నిటినీ తన పాటల్లోకి దించేది. చెరుకు గడలు చిట్టి తమ్ముడు, మరదలు పిల్ల, ఆమె ముక్కులో బంగారు

బులాకీ...అన్నిటినీ తన పాటల్లోకి లాక్కొచ్చేది.

తిలోక తమ్ముడు మంగళ్. ఎందుకూ పనికి రాడు. పరమ బద్ధకస్థుడు. చెప్పినా అర్థం చేసుకొని, అర్థం చేసుకున్నా విని పించుకుని సరి చేసుకోని పెంకి ఘటం. అందరితో తగాదాలు పడుతూ ఇంటిమీదికి గొడవలు తెస్తుంటాడు. ఎంతసేపూ బట్టలు సర్దుకుంటుంటాడు. రాణోకి మాత్రం అతనంటే చాలా ఇష్టం. అల్లరి చేసినపుడు వాడిన్ని చివాట్లు పెడ్తూ కోపం నటించేది.

రాణో తిలోక భార్యగా ఆ ఇంట్లో అడుగు పెట్టేనాటికి మంగళ్ ఆరేళ్ళ చిన్నవాడు. రాణో తలిదండ్రులు పరమ పేదవారు. యుక్త వయస్సు వచ్చేసరికి ఆమె అవసరాలు తీర్చడం వారికి పెద్ద సమస్య అయింది. అందువల్ల ఆమెని తిలోకకి అమ్మేసి గుట్టు చప్పుడు కాకుండా గ్రామం వదిలి వెళ్ళిపోయారు. ఈ సంఘటన రాణోని ఎంతగానో కృంగ దీసింది. గతం పూరిగా అంతరించిన దైపోయింది. ప్రతి స్త్రీకి వైవాహిక జీవి తంలో కన్నవారి రక్షణ, ఆదరణ పొందవలసిన సందర్భాలు కొన్నైనా వస్తాయి. అటువంటి పుట్టిల్లు కరువైన స్త్రీకి భవిష్యత్తుపై ఆశ ఏ విధంగా ఉంటుంది ?

రాణో కోట్లాకి వచ్చిన తరువాత అత్తగారే తల్లి అయింది. మామగారే తండ్రి అయ్యాడు. మంగళ్ సోదరుడ య్యాడు. అప్పటికి మంగళ్ బహు పసి వాడు. ఒకసారి ఆమె తన తొలి కాన్పు అయిన వద్దీకి పాలిస్తోంటే చూచి మంగళ్ తనకికూడా పాలు కావాలన్నాడు. రాణో తన రవికెను పైకెత్తి రెండో రొమ్ము చూపుతూ ఆప్యాయంగా రమ్మని పిలి చింది. అయితే మంగళ్ సిగ్గుపడి బయటకి పారిపోయాడు. అప్పటినుంచి రాణో మంగళ్‌ని సొంత బిడ్డలాగా చూసుకో సాగింది.

మంగళ్ కూడా రాణోని తల్లిలా చూసుకోసాగాడు. పైగా తన సొంత తల్లిని 'పిన్నీ' అన్ని పిలిచేవాడు. రాణో అతన్ని కూడా తన సొంత పిల్లలలాగానే చూసుకునేది. అతను తప్పుచేస్తే లెంపలు వాయకొట్టేది. మొండిపట్టు పట్తే చెవులు మెలేసేది.

సంవత్సరాలు గడిచిపోయాయి. ఆ కాలగమనంలో ఎన్నో సంఘటనలు జరిగాయి. రాణోకి పెరుగుతున్న పిల్లల పట్ల చూసుకోవలసిన బాధ్యతల భారం పెరిగింది. మంగళ్ నూనూగు మీసాలతో నూత్న యవ్వనంలోకి ప్రవేశిస్తున్నాడు. తిలోక సీసా దాసుడై పోయాడు. ముసలి జిందాన్ అసలైన భారతీయ అత్తగారి లాగా సాధింపులు సణుగుడు మొదలు పెట్టింది.

వీటన్నిటినీ విషమం చేసేది వారి దారిద్ర్యం. తిలోక వారంలో రెండుమూడు రోజులకంటే ఇంటి పట్టున ఉండడం మానే శాడు. దానితో ఇంటి ఖర్చుకి అతను ఇచ్చే మొత్తం బాగా తగ్గిపోయింది. వీటికి తోడు ముసలి మామ హజూర్‌సింగ్‌కి కళ్ళలో పుష్పాలు వేశాయి. వాటిని ఆప రేట్ చేయించేదెవరు ? విధిలేక అతను మంచం మీదే కూర్చుని చెవులతో వినడానికి మసక కళ్ళతో చూడడానికి, ప్రయత్నం చేసేవాడు. ఊరి చెరువులో పావురాలు స్నానంచేసేటప్పుడు రెక్కలు టపటప లాడించినట్లు, అతని కనురెప్పలు కొట్టుకునేవి.

ఆ సాయంత్రం త్రిలోక ఇంటికి వచ్చాడు. తన పొడుగాటి అంగీలోని జేబులోనుంచి ఒక టొమాటో తీశాడు. "ఇదిగో రాణో ! దీనిని చక్రాలుచేసి, ఉల్లిపాయ చక్రాలతో కలిపి ఇయ్యి" అని అరిచాడు.

రాణో కూర చేస్తోంది. చేతిలోవున్న గరిటెను కుండమీద పెట్టి లేచి నుంచుంది. "సవతిని ఇంట్లోకే తెచ్చావా ?" అని అక్కడినుంచే గట్టిగా అరిచింది. 'మందు సీసా'కి ఆమె పెట్టిన ముద్దుపేరు సవతి.

త్రిలోక సమాధానం చెప్పడానికి తడబడ్డాడు. "నేను తరుచుగా తాగనుగా. నువ్వే చెప్పు ... తాగుతానా రాణో ?" అన్నాడు.

"అయితే కావచ్చు. కాని నువ్విక్కడ తాగడానికి మాత్రం నేను ఒప్పుకోను" అంది పదునుగా. "ఏదీ ఎక్కడుందీ ఆ సీసా ? నా దగ్గర లేనిది దాని దగ్గర ఏముందో చూస్తాను"అంది కసిగా రాణో.

త్రిలోకకి అక్కడో గొడవ తయారవడం ఇష్టంలేదు. కాని రాణోకి పోట్లాడాలనే కోరిక బాగా వున్నట్లు స్పష్టంగా తెలుస్తోంది. త్రిలోక పళ్ళు పటపటా కొరికాడు. ఆమె నోరు మూయించే ఉద్దేశంతో కోపాన్ని బుసల రూపంలోవెదజల్లసాగాడు.

"రంకుదానా ఊరుకున్నకొద్దీ నా పైన ఒంటి కాలిమీద లేస్తున్నావు" అన్నాడు త్రిలోక.

"థూ" అని ఉమ్మేసింది రాణో. "అలాగే...ఈ విషయం ఏమిటో ఇవాళ తేలిపోవాలి. ఈ ఇంట్లో నేనేనా ఉండాలి. అదేనా ఉండాలి" అంది కోపంగా.

రాణో సవతిని చూడ్డంకోసం లోనికి పరిగెత్తింది. ఆమె వెనకాలే పరిగెత్తి జుట్టు పట్టుకుని లాగి నేలమీద కుదేశాడు త్రిలోక.

ఆ అదురుకి నూనె దీపం రెపరెపలాడి ఇంచుమించు ఆరిపోబోయి, మళ్ళీ అందుకుంది. వేప చెట్టుమీద పక్షులు కీచుమని అరుస్తూ భయంతో ఎగిరిపోయాయి. దబ్బూ లేచి జరుగుతుందేమిటో అర్థం కాక మొరగ సాగింది. వద్దీ భయంతో "నాన్నా" అని అరుస్తూఏడుపు లంకించుకుంది. చిన్నపిల్లలు భయపడిపోయి చీకట్లో దాక్కోవాలని ప్రయత్నం చేశారు. ఒకడు ఇంట్లోంచి బయటకు పారిపోయాడు. వేరొకడు భయంతో వణికిపోతూ "ఆ...ఆ..." అని ఏడవ సాగాడు. హజూర్‌సింగ్ మంచం మీద నుంచి లేవబోయి దబ్బున కిందపడ్డాడు. ఆ కోపంలో "ఒరేయి...గాడిదకొడకా... ఒరేయి ముదనష్టపాడా! సిగ్గు లేనివెధవా, పశువా" అంటూ తిట్ల ప్రవర అందుకున్నాడు. మళ్ళీ లేవబోయి కుంపటిమీద పడి ఒళ్ళు కాల్చుకున్నాడు.

రాణో తక్కువ తినలేదు. గట్టిగానే పోట్లాడింది. త్రిలోక చేతుల్ని పళ్ళతో కసుక్కున కొరికింది. దాంతో త్రిలోక కోపం అవధులు దాటింది. రాణో తలని గోడకేసి కొట్టసాగాడు. తాను ఎప్పుడూ ఆఖరికి పశువుల విషయంలో కూడా ఉపయోగించని పరమ బూతు భాషలో ఆమెను తిట్టసాగాడు.

"బాబోయ్! నాన్న అమ్మని చంపేస్తున్నాడు!" అని అరిచింది వద్దీ. వాళ్ళ నాయనమ్మ వచ్చేసరికి ఆ పిల్ల భయంతో సాల్వార్‌ని తడిపేసుకుంది. ముసలి అత్త ఆ పోట్లాట చూస్తూ ఆశ్చర్య పోసాగింది. కానీ "నాకు తెలుసు ఏదో ఓ రోజు ఇలాగ జరుగుతుందని. ఒకనాడు ఈ ఆపదల

చంద్రుడు మా ఆవరణలోనే ప్రకాశిస్తాడని అనుకొంటూనే ఉన్నాను. అసలు ఎక్కడో గాలికి ఎగిరే విత్తనం మా దొడ్లో పడి మొలవడమేమిటి?" అంటూ మొదలెట్టింది. ఇవన్నీ ఆమె అన్యాపదేశంగా రాణోని గురించి అన్న మాటలే.

"ఈ వ్యవహారంలో నువ్వెందుకు వేలెట్టావు?" అంటూ తల్లిని కోప్పడ్డాడు. మంగళ్. భార్యాభర్తల పోట్లాటలో జోక్యం చేసుకోవడం సరికాదని అతని ఉద్దేశం. అందుకనే ఆ పోట్లాటకి సాధ్యమైనంత దూరంగా ఉండాలని ప్రయత్నిస్తున్నాడు.

"నా ఇష్టమొచ్చిన చోట నేను నా ముక్కోట్టాను" కీచు గొంతుతో అరిచింది ముసలి జిందాన్. "వాడు సంపాయించుకుంటున్నాడు. వాడికేం! తాగుతాడు, తంతాడు" అంది కోడలి పై విషం కక్కుతూ, తల్లి మాటలు వినేసరికి తిలోకకి మరింత ఆవేశం వచ్చింది. ఆ పిచ్చి కోపంలో రాణో ఒంటిమీది బట్టలు దాదాపుగా చించివేశాడు. "పో ఇక్కణ్ణించి. మా ఇంట్లోంచి పో" అని అరవ గలిగినంత గట్టిగా అరిచాడు.

ఏడుపుతో రాణోకి ఊపిరి ఆడ్డంలేదు. బాధతో మూలుగుతూ "ఇక్కడ నేను బతకలేను. వెళ్ళిపోతాను" అని ఏడవ సాగింది.

మట్టి ప్రహరీ గోడ పైనుంచి వరసగా కొన్ని తలలు పైకి లేచాయి. ఇరుగు పొరుగు ఇంటి కప్పుల మీద చిన్న చిన్న గుంపులు చేరాయి. "రాణోని చంపేశాడు. దుర్మార్గుడు ఆమెని హత్యచేశాడు" అంటూ మాటలు వినిపించసాగాయి. కాని ఒక్కరు కూడా ధైర్యం చేసి ముందుకు వచ్చి రాణోకి అండగా నిలవలేదు.

జీలం ఈ సందడి విని డాబా పైకి వచ్చి చూడ సాగింది. ఆమె వెనకాలే పిల్లలూ వచ్చారు. వాళ్ళతో పాటు బ్రాహ్మణ శ్రీ పూరణ్ దేవీ వచ్చింది. నవాబ్ భార్య ఆయేషా, చన్నో, సరూప కూడా వచ్చారు. అందరిలో ఒక్కచన్నో మాత్రం ధైర్యంచేసి "కాపాడండి. ఎవరైనా వెళ్ళి వాళ్ళని విడదీయండి" అని అరవ గలిగింది.

ఆ కేకలు రాణో చెవుల పడ్డాయి. "మా జోలికి రాకండి" అని ఆమె ఉన్న చోటునుంచి గట్టిగా అరిచింది. ఆవేశంతో ఆమె ఊపిరి కూడా తీసుకోలేకపోతోంది. "వెళ్ళిపొండి ఏం...మీ ఇళ్ళల్లో మాత్రం ఎప్పుడూ పోట్లాటలు రాలేదా? మీరెప్పుడూ భర్తల చేతుల్లో దెబ్బలు తినలేదా? జరగాల్సిందేదో జరుగుతుంది. ఈ రోజు ఈ మనిషి నన్ను అమ్మవారికి బలి వేస్తాడు. నేను స్వర్గానికి పోతాను. నా కోసం నా పిల్లలు ఏడుస్తారు" అంటూ ఏడవ సాగింది. ఒక పక్క వాళ్ళని పొమ్మని కోప్పడుతూనే మరో పక్క వాళ్ళని రమ్మన్నట్లుగా సంజ్ఞలు చేస్తోంది.

మంగళ్ ఇంతసేపూ జరుగుతుందంతా చూస్తూ ఎంతో సహనంతో ఓపిక పట్టి ఉన్నాడు. ఇంక తట్టుకోలేక నోటికొచ్చినట్టు బిగ్గరగా తల్లిని తిట్టూ, అన్న మీదికి ఉరికాడు. కొట్టడానికి ఎత్తిన తిలోక చేతిని పట్టుకుని గట్టిగా "చేతిని దింపు" అని గదిమాడు. "నా సత్తా ఏమిటో చూపిస్తాను. ఆడదానిమీదనా నీ ప్రతాపం! నువ్వు నీ అబ్బకి పుట్టివుంటే నా చెయ్యి విడిపించుకో. ఊ...కానీ" అని గట్టిగా అరిచాడు.

మంగళ్ ఇనప పట్టునుంచి తన

చేతిని తప్పించుకోవాలని తిలోక ఎంతగానో ప్రయత్నించాడు. కాని ఫలితం లేకపోయింది. ఆ ఉక్రోషంతో తమ్ముణ్ని నోటికొచ్చినట్టు తిట్టసాగాడు. తమ్ముని కళ్ళలో తనని చంపేయాలన్న భావం కనిపిస్తోంది. అది చూసి తగ్గాడు.

అన్న జారుకోడం చూసి మంగళ్ విజయోత్సాహంతో మరో అడుగు ముందుకేశాడు. ఆ సారాసీసాని గట్టిగా ఓ తాపు తన్నాడు. సీసా పగిలిపోయి నేలంతా సారా చిందింది. ఆ దుర్గంధం భరించలేక, అక్కడ వింత చూస్తున్న అమ్మలక్కలు మేలిముసుగులు దించుకుని ముఖాలకి అడ్డం పెట్టుకున్నారు. కసిదీరా అవమానపరిచి, అన్న చేతిని వదిలి పెట్టాడు మంగళ్. తిలోక తనలో తాను గొణుక్కుంటూ లోపలికి వెళ్ళాడు. తక్కడినుంచే పుస్తకం చూసి గడగడా చదివినట్లు బూతుల పంచాంగం అనర్గళంగా వదిలాడు. వాటి దుర్గంధం ఆ సారా కంపుని మించి పోయింది.

రాణో కూడా లోనికిపోయి తన సామాన్లన్నిటినీ ట్రంకులో సర్దుకోసాగింది. బయటికి పోడానికి సిద్ధపడింది. కాని ఎక్కడికి పోగలదు? 'ఓ దేవుడా! పగవాళ్ళకి కూడా ఆడపిల్లల్ని పుట్టించకు. ఆడపిల్ల ఎదిగీ ఎదగకుండానే కన్నవారు ఆమెని పరాయి ఇంట్లో వదిలేసి తమ బరువు తీర్చుకుంటారు. అత్తవారికి కోపం వస్తే, తిరిగి ఆమెని పుట్టింటికి తరుముతారు. చింపిరి గుడ్డలతో చుట్టిన బంతిలాగా ఆమె అటూ ఇటూ విసరబడుతుంది. తాను కూడా మోయలేనంతటి కన్నీటి బరువుతో కృంగిపోయినప్పుడు మాత్రమే, ఆమె అటూ ఇటూ కాకుండా తన దారి తాను చూసుకుంటుంది' రాణో మనసులో ఆలోచనలు గందరగోళంగా ఉన్నాయి.

రాణోకు సర్దుకోవలసిన సామాను ఎక్కువేమీలేదు. కొద్ది నిమిషాలలోనే ఆమె సామానంతా ట్రంకులోకి వచ్చింది. మునుపటికంటె బిగ్గరగా ఏడుపు మొదలు పెట్టింది. అది విని మిగిలిన స్త్రీలు కూడా కన్నీళ్ళు పెట్టుకోవాలని ఆమె ఉద్దేశం. "ఇక్కడ మీరంతా హాయిగా ఉండండి. మీ ఇల్లు నిత్యమూ కలకలలాడుతుండనీయండి. నేనే కదా ఎవరికీ అక్కరలేని పరాయిదాన్ని. మీకు నా బరువు లేకుండా చేస్తాను" అంటూ తిలోక వెళ్ళిన గది వైపు తిరిగింది. "నీకు గులామై పడివుండే మరో భార్యను తెచ్చుకో "నువ్వు ఎముకలు విరక్కొడుతుంటే ఆనందించే పెళ్ళాన్ని తెచ్చుకో" అంటూ మొదలెట్టింది. అంతలో ఆమె దృష్టి పిల్లల మీద పడింది. అంతసేపూ కోపంలో, విచారంలో వారి ఉనికినే మరిచిపోయింది ఆమె. వాళ్ళ వంక చూస్తూ "పిల్లలూ... మీరసలు పుట్టలేదనుకుంటాను. ఎవరైనా అడిగితే పుట్టగానే చచ్చారని చెప్తాను" అనసాగింది.

వద్దీ తల్లి కొంగు పుచ్చుకొని "అమ్మా" అని ఏడవసాగింది. రాణో పిల్ల చేతిలోంచి విసురుగా కొంగు లాగేసుకుంది. "అవతలికి పో... దిక్కుమాలిన దానా. నీ వంతు వచ్చేసరికి నీకు కూడా ఇటువంటి అనుభవం వస్తుందిలే" అని కసురుకుంది.

రాణో విశాల విశ్వంలోకి అడుగు వేసింది. ఎటుచూసినా కటిక చీకటి. ఆకాశంలో నక్షత్రాలు తప్ప వేరేమీ కనిపించడం లేదు. అవి ఆమె కళ్ళముందు

మినుకు మినుకు మంటున్నాయి. ఒక చిన్న మేఘం తేలుతూ వచ్చి చంద్ర వంకను రెండుగా చీల్చింది.

మంగళ్ రాణోని అనుసరించాడు. ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని "వదినా! ఎక్కడికి వెళ్తున్నావు?" అని అడిగాడు. తర్వాత తల్లి వంక తిరిగి "అమ్మా...నువ్వైనా ఆమెని ఆగమని చెప్పరాదా ?" అన్నాడు.

జిందాన్ చేతుల్ని చీర చెంగుకి తుడుచు కుంటూ "దానికి ఎవరైనా ఉన్నారు కనుకనా! ఎక్కడికి పోతుంది?" అంది.

హజూర్‌సింగ్ తానున్న చోటునుంచే "అమ్మాయి రాణో" అని అరిచాడు. తర్వాత ఆమె ఉన్నవైపు నెమ్మదిగా రాసాగాడు. ఆమె దగ్గరికి వచ్చాక చొక్కా ఎత్తి వీపుమీద వాతలు చూపుతూ "చూడమ్మా నేనెంతగా అనుభవించానో!" అన్నాడు.

మామగారి మాటలతో రాణో దుఃఖం కట్టలు తెంచుకుంది. తన దుపట్టాతో ముఖం కప్పుకుని ఏడుస్తూ ఒక్కచే ఒక్కమాట "బాపూ" అని అంది. అప్పటికి తిలోక ఆవేశం కూడా చల్లారింది. తన ఇంటి ప్రాంగణంలోనే ఎవరికీ అక్కర్లేని వ్యక్తిలాగా నిలబడిపోయాడు. "పో.. ఎక్కడికి పోతావో పో" అని అరవసాగాడు. అయితే ఆ బెదిరింపులలో మాత్రం పసలేదు.

"నా ఇష్టమైన చోటికి పోతాను. నేనేమైతే నీకేం?" అంటూ మరింత బిగ్గరగా ఏడుస్తూ జవాబు చెప్పింది రాణో.

"నేను ఎక్కడోక్కడ పనిచేసుకుంటాను. నా జానెడు పొట్టకి కావలసినంత సంపాదించుకోగలను. రెండు చపాతీల కోసం నేనెవరికీ బరువుగా ఉండదల్చుకోలేదు. ఈ ఊళ్ళో ఉండడానికి నాకు చోటెక్కడా లేకపోతే, పోయి గుళ్ళో తలదాచుకుంటాను" అంది వెక్కుతూ.

"గుళ్ళోకా!" ఉలిక్కిపడి గర్జించాడు తిలోక. ముందుకివచ్చి ఆమె చేతిలోని ట్రంకుని లాక్కుని "ముందు నాతో రా.. ఆ తర్వాత నీ ఇష్టమైన చోటికి పోదువు గాని" అన్నాడు.

గమ్యం తెలియని చోటికా.. తిరిగి ఇంట్లోకా? ఎక్కడికి పోవటం?

రాణో ఆత్మగౌరవం మరికొంతసేపు ఎదురు తిరగాలని కోరింది. "నేను రాను" అంటూ మొరాయించింది కూడా! కాని ఆమె మొరాయింపులు కూడా తిలోక తిట్లలాగానే చప్పబడిపోయాయి. ఇప్పుడు ఆమెకి కావలసింది ఆత్మగౌరవం చెడకుండా ఏదో వంకమీద తిరిగి ఇంట్లోకి వెళ్ళడం. ఇల్లు విడిచి చేయగలిగింది మాత్రం ఏముంది? సారాసీసా ఎలాగూ ఎగిరిపోయింది. ఇంకా పట్టింపు ఎందుకు?




రాణో హజూర్‌సింగ్ గాయాలకి మందు రాసి తిరిగి గదిలోకి వచ్చింది. తిలోక కాళ్ళు బార్లా సాచుకుని వెల్లికిల పడుకొని ఆలోచనల్లో మునిగిపోయున్నాడు. చంటివాడు ఏడవడం మొదలుపెడితే రాణో వాడికి పాలిచ్చి నిద్రపుచ్చింది.సాయంత్రం

జరిగిన గలాభాని గురించిన ఆలోచనలు తిలోక మస్తిష్కంలోంచి క్రమంగా దూరం కాసాగాయి. వాటి స్థానంలో కిందటి సాయంత్రం తాను చౌదరి సాహెబ్‌కి అందజేసిన 'అమ్మాయి'ని గురించిన ఆలోచనలు చోటు చేసుకున్నాయి. ఆ చీకటిలో తాను చౌదరిగానూ, రాణోను ఆ అమ్మాయిగానూ ఊహించుకుంటూ, ఆమె వైపు చేయి జాచాడు. రాణో దానిని అవతలకి నెట్టివేసింది.

"నువ్వు పసిపాప లాంటి దానివి. నీ మనసెప్పటికీ ఇంతకన్నా ఎదగదు" లాలన ప్రారంభించాడు తిలోక. "నువ్వు మరీ పన్నెండేళ్ళ పిల్లదానిలాగా ప్రవర్తిస్తావు. ఉన్నట్లుండి చిన్న పిల్లలాగా రెచ్చిపోతుంటావు" అన్నాడు మళ్ళీ తనని తాను సమర్థించుకోవాలని. దీపం ఆర్పగానే ఆత్మాభిమానంతోసహా అన్నీ మరిచిపోయే స్వభావం అతనిది.

తిలోక లేచివెళ్ళి అల్మారలోనుంచి 'గంగావతరణం' పటాన్ని తెచ్చాడు. దానిని రాణో పక్కన ఉంచి, శివుని పేరుమీదుగా సవ్యంగా వుండి తన దగ్గరకు రమ్మన్నాడు. శివుని కోసం పార్వతి చూపిన అమర ప్రేమను గుర్తు చేశాడు. కాని ఎంత చెప్పినా రాణో మాత్రం రవ్వంతకూడా చలించలేదు. తిలోక ఈసారి రాధాకృష్ణుల చిత్రాన్ని తెచ్చాడు. ఫ్రేములోంచి బొమ్మని బయటకుతీశాడు. ఆ తర్వాత ఇంకెన్నో పటాలు తెచ్చి, వాటి ఫ్రేములలోనుంచి చిత్రాల్ని బయటకి తీశాడు. కొంచెం సేపట్లోనే ఆ ప్రదేశమంతా కొయ్య ఫ్రేములతోనూ, అద్దాలతోనూ, బొమ్మలతోనూ నిండిపోయింది. ఎన్నిచేసినా రాణో మాత్రం అణువంతైనా చలించలేదు.

తెల్లవారి లేచేసరికి రాణో ఒళ్ళంతా పచ్చిపుండులాగా ఉంది. లేవడమే కష్టమయింది. ఇంటిపని చేసుకోక తప్పదు కదా! గత సాయంత్రం ఎవరూ ఎంగిలి పడింది లేదు. అందువల్ల రోజూకన్న ముందుగా, పొద్దుటి భోజనాన్ని పెట్టాలి. గుర్రానికి గుగ్గిళ్ళు ఉడకేయాలి. కళ్ళాన్నీ, కుచ్చుల్నీ సిద్ధం చేయాలి. తిలోక చూడబోతే సగం తెరుచుకున్న కళ్ళతో, గుహలాగా తెరుచుకున్న నోటితో, చచ్చిన వాడిలాగా పడి నిద్రపోతున్నాడు. రాణో గూడు దగ్గరకి వెళ్ళి దీపాన్ని బయటకు తీసింది. తిలోక మంచం పక్కన నిలబడి చంపిన పాముని చూసుకున్నట్టు, దీపం వెలుగులో అతన్ని చూసింది.

తిలోక నిద్రలేచేసరికి రాణో తన పని చాలా వరకు పూర్తి చేసుకొంది. కిందటి సాయంత్రం జరిగిన సంఘటన తాలూకు చిహ్నాలేవీ ఆమె ముఖంలో గోచరించలేదు. తిలోక ఎప్పటిలాగా మామూలుగానే ఉన్నాడు. రాణో అతనికి కళ్లెం అందిస్తుంటే కోపభావాన్ని ప్రదర్శిస్తూ కనుబొమలు ముడేసుకున్నాడు. ఆ క్షణంలో అతను కొన్ని గంటల క్రితం ఆమె ముందు చెవులు నులుముకుంటూ, సాష్టాంగపడి క్షమాపణలు కోరుకున్న విషయం మరిచిపోయినట్లు ప్రవర్తించాడు. సూర్యకిరణాలు మీదపడేసరికి, అతనిలోని మగదర్పం తల పైకెత్తింది. కళ్ళాన్ని తీసుకోగానే, దానికి వున్న మువ్వలు గలగల లాడాయి. ఈకల కుచ్చు గాలికి రెపరెపలాడింది. "నువ్వంటే భయపడుతున్నానని భ్రమపడకు–"

దర్పంగా రాణోతో అన్నాడు తిలోక.

"నేనేమైనా అంటేనా?" అంది రాణో ముభావంగా.

తిలోక అంతటితో ఊరుకోలేదు. "మగతనం లేనివాళ్ళే ఆడవాళ్ళంటే భయపడేది. ఈ రోజు మరో సీసాడు సారా తెస్తాను. చూస్తా నువ్వెలా అడ్డు పడ్తావో !" అన్నాడు కసిగా.

రాణో మౌనంగా ఉండిపోయింది. మనసులో మాత్రం తానేమేమి చేయాలో ఆలోచించుకోసాగింది. 'ఈ రోజు నిజంగా మళ్ళీ సారా తెస్తే గుక్కెడు వెల్లుల్లి పాషాణం మింగి చస్తాను. లేకపోతే దుప్పికొమ్ములతో డొక్కలు పొడుచుకొని ప్రాణం తీసుకుంటాను. లేదా వాళ్ల బోరికి పెట్టిన కుక్కల మందు మింగి చస్తాను. ఆ మగ కుక్క దబ్బూలాగానే వీడు నా శవాన్ని వాసన చూసి అవతలకి పోతాడు. నా కోసం కాకపోయినా ఆ తల్లిలేని పిల్లలని చూసైనా రెండు కన్నీటి బొట్లు కారుస్తాడేమో ! నేను చచ్చినా బతికినా ఎవరికి కావాలి? కన్నవారుంటే పిల్లల కోసం బాధపడ్తారు. నా పుట్టింటి వారెక్కడున్నారు కనుక? ఎవరి దగ్గర కని పోను! ఏం చూసి బతకను? లేదు. నేను చావకూడదు. నేను చస్తే మా అత్త గారు మహ సంతోషిస్తుంది పీడా పోయింది అనుకొని ఆనందిస్తుంది."

రాణో ఆలోచనలలో మునిగి ఉండగానే, మంగళ్ అటువైపు వచ్చాడు. అన్నదమ్ములు ఒకరివంకొకరు కొరకొరా చూసుకున్నారు.

"ఓ...తయారయ్యావా, పని పాటు లేని వెధవా !" అని నెమ్మదిగా అని తోక ముడుచుకుని వెళ్ళే కుక్కలాగా వెళ్ళిపోయాడు తిలోక. మంగళ్ ఏమీ మాట్లాడకుండా బయటకు వెళ్ళిపోయాడు.

వద్దీ తన తలిదండ్రులు మాట్లాడుకుంటుండడం చూసి, నెమ్మదిగా ముందు వాకిట్లోకి జారుకుంది. తమ్ముళ్ళని స్కూల్‌కి పంపడానికి తయారు చేయసాగింది. పక్క గదిలో రాత్రంతా మూలుగుతూండినహజూర్ సింగ్ ఒళ్ళుతెలీకుండా నిద్రపోతున్నాడు. అతని పక్కనే జిందాన్ ఉదయకాల ప్రార్థన చేస్తోంది.

మరికొంత సేపటికి ఇంటి వాకిలి దగ్గర ప్రయాణీకులతో నిండిన జట్కాబండి వచ్చి ఆగింది. మామూలుగానే రాణో తిలోకకి నాలుగు చపాతీలూ, మషాలా వేసిన కూర వున్న పొట్లం అందించింది. ఆమె ప్రయాణీకుల వంక చూసింది. వారి మధ్య పదమూడు సంవత్సరాల పిల్ల ఒకతె అపస్మారక స్థితిలో ఉంది. చౌదరిగారి నౌకర్లు ఆ పిల్లని పట్నానికి తీసుకుపోతున్నారు.

"ఎవరా అమ్మాయి ? ఏమైంది ఆ పిల్లకి ?" ఆత్రుతగా అడిగింది రాణో.

కళ్ళాన్ని బిగదీస్తూ "మూర్ఛ" అన్నాడు తిలోక.

"మూర్ఛా ! ?" నమ్మలేనట్లుగా ఆశ్చర్యంతో ముక్కుమీద వేలేసుకుని అంది రాణో.

"ఆఁ...ఆఁ చాలా మంది ఆడవాళ్ళకి మామూలుగా వస్తుండే మూర్ఛే. క్రితం రాత్రి నీకూ వచ్చిందిగా. దాన్ని పోగొట్టాలంటే చెప్పుతో కొడితేసరి" అని తెరిచివున్న తలుపువేపు చూసి తలాడించి "చెప్పుకాకపోతే కొరడా. ఈ రాత్రి నిన్ను దాంతోనే కొడ్తాను. కొరడాకి కొత్త తోలుకూడా వేయించాను" అన్నాడు తిలోక.

ఆ మాటలకి రాణోకి కాళ్ళు పట్లు తప్పి పోతున్నట్లనిపించింది. తిలోక కనుమరుగవగానే, లోపలికి వచ్చి గోడకు వేలాడుతున్న కొరడా తీసి సామాన్ల గదిలో గోధుమ బస్తాలో దాచింది.

ఆ సాయంత్రం కొంతమంది గ్రామ ప్రజలు గుంపులుగా పరుగెత్తుకుంటూ వచ్చారు. వారిలో ఇద్దరు జట్కాతోలే వాళ్ళు కూడా ఉన్నారు.

వార్ పూరణ్‌దేవి ఖ ర గ్యాన్‌చంద్ దగ్గరకి, మిల్లు ఓనర్ దీవానా దగ్గరకి వచ్చి "పంతులుగారూ...ఇది విన్నారా?!" అని అడిగారు. తర్వాత వాళ్లు గ్యాన్ చంద్ చెవిలో ఏదో గుస గుసలాడారు. ఆ తర్వాత వారంతా ఒకరికొకరు దగ్గరగా వచ్చారు. ఈలోగా జీలం అల్లుడు తన దుకాణం నుంచి వస్తూ కనిపించాడు. అతనికి ఒక చేతిలో త్రాసు, ఇంకోచేతిలో రెండు శేర్ల రాయి ఉన్నాయి. అతను ఒక రైతు అటు పోతుంటే నిలిపి అతనికేదో చెప్పాడు. వాళ్ళుకూడా గుంపులో కలిసి తిలోక ఇంటివైపు చూడసాగారు. రాణో తన ఇంటి ముంగిట నిలబడి సంగతేమిటో అర్థంకాక నోరుతెరుచుకు చూస్తుండి పోయింది.

కిందటి సాయంత్రం రాణోని రక్షించాలని ప్రయత్నించిన చన్నో వచ్చి రాణో భుజం కుదుపుతూ "ఏం జరిగింది?" అని అడిగింది.

రాణో జనం వంక చూస్తూ తల తిప్పుతూ "వీళ్ళ కేమైందో తెలీదు. వాళ్ళంతా నా వంకే చూస్తున్నారు" అంది ఆశ్చర్యపోతూ.

"ఎందుకో నీకు తెలీదూ ?" ఆశ్చర్యంగా అడిగింది చన్నో.

"ఉహుఁ...ఎందుకని ?"

"క్రిందటి రాత్రి దెబ్బలు నీకిళ్ళు ఊడపీకనట్లున్నాయి."

"నోర్ముయ్" రాణో చన్నో జుట్టు పట్టుకుని లాగి మరీ అంది. వాళ్ళిద్దరూ ఒకరినొకరు డొక్కల్లో పొడుచుకున్నారు. చంకల కింద చక్కిలిగింతలు పెట్టుకున్నారు. ఇహ ఓపిక లేక పగలబడి నవ్వుకోసాగారు. తర్వాత ఇద్దరూ గుంపు వంక చూశారు. రాణోకి కనిపించిన దృశ్యం ఆమెకి అమితమైన ఆనందాన్ని కలిగించింది. చౌదరిని, అతని తమ్ముడిని చేతులకి సంకెళ్ళువేసి బజారు వెంట తీసుకు వస్తున్నారు. వారితో ఒక పద్దెనిమిదేళ్ళ యువకుడు కూడా వస్తున్నాడు. అతని బట్టలు రక్తసిక్తమై ఉన్నాయి. ముఖం మీదా, ఒంటిమీదా రక్తపు మరకలున్నాయి. అతన్ని పోలీసు సార్జెంట్, గ్రామ పెద్ద కలిసి నడిపించుకు వస్తున్నారు. చౌదరి ఎప్పటికంటే మరింత నల్లగా కనిపిస్తున్నాడు. దానితో అతని చెవుల కమ్మలు మరింత ప్రకాశవంతంగా ఉన్నాయి. తమ్ముడి నుదుటిమీద గాయాలున్నాయి. అతని తలపాగా వదులై పోయి మెడమీదికి జారిపోయింది.

"హాయ్ దేవుడా! చన్నో నా కెంతో సంతోషంగా ఉంది. అందరికీ పటిక బెల్లం పంచిపెట్టి నా ఆనందాన్ని తెలియజేసాను. వీళ్ళు ఇతరుల ఆడ పిల్లల్ని చెరుస్తున్నారు. ఇప్పుడు ప్రభుత్వానికి అల్లుళ్ళవుతున్నారు" సంతోషం పట్టలేక రాణో చప్పట్లు కొడుతూ డాన్స్ చేయసాగింది. గుడి శిఖరం వైపు చూస్తూ చేతులు జోడించి "మాతా...పరాశ క్తి... నువ్వు నా ప్రార్థనని విన్నావు. నీకు కృతజ్ఞురాలిని తల్లీ. ఇది ఎంతో మంచి

రోజు" అని ప్రార్థించింది.

ఆ తర్వాత జనం వెనకాల త్రిలోక జట్కా కూడా కనిపించింది. అయితే దానిని త్రిలోక బదులు గురుదాస్ తోలుతున్నాడు.

"హాయ్ !" ఆశ్చర్యంతో, భయంతో అరిచింది రాణో. జట్కాలో పడుకొని వున్న ఆకారం ఒకటి కనిపిస్తోంది. "అది ఆ మూర్ఖపిల్ల కాదు కదా !"

జట్కా రాణో ఇంటిముందు ఆగింది. అందులో వచ్చిన వారు అందులోని 'అమ్మాయి'ని బయటకి తీశారు. ఆ శవాన్ని కిందికి దింపి, ముఖంమీది గుడ్డ తొలగించారు.

"కాదు...కాదు" అంటూ వెర్రిగా అరుస్తూ ఇంట్లోకి పరుగులు తీసింది రాణో. చన్నో గుండెలు బాదుకుంటూ, తన ఇంటివైపు పరుగెత్తింది.

త్రిలోక చచ్చిపోయాడు, కాదు హత్య చేయ బడ్డాడు. ఊరి బావి దగ్గర ఆ యువతి అన్న అతన్ని చూశాడుట. త్రిలోక పీక కోరికేసి చివరి రక్తం బొట్టు కూడా బయటకి పోయేదాకా వదలలేదుట.

గ్రామస్థులు అతన్ని పట్టుకున్నప్పుడు అతను పూనకం పూని నట్లున్నాడు. అతని చూపులు గుడి గోపురంమీద లగ్నమై ఉన్నాయి. చేతులు గాలిలోకి సాచి "అమ్మా....దైవమాతా ! నీ పగతీర్చాను. ఇది నీ కోసం చేశాను" అని అరుస్తున్నాడు. గ్రామస్థులు అతన్ని పట్టుకుని కొట్టి వీధుల్లోంచి ఈడ్చుకు వస్తూంటే, అతను అమ్మవారి మీద పాట పాడ సాగాడు.

"అది దైవమాత దర్బారు
అక్కడున్నది అమ్మవారు
అదిగో జ్యోతులు వెలిగాయి
అమ్మవారి దర్బారులో
నిత్య దీపాలు వెలిశాయి"

నిజానికి ఆ సమయంలో అమ్మవారి గుడిలో కాగడాలు వెలుగుతున్నాయి. వాటి కాంతి అతని నయనాల్లో ప్రతిఫలిస్తోంది. అతని చర్మం అంతలో పచ్చగా పాలిపోతూ, అంతలో కోపంతో ఎరుపెక్కుతూ ఉంది. జనంలోంచి అతను పడుతూ లేస్తూ గుడి దగ్గరకి వెళ్ళాడు. తర్వాత అతను గెంతుతూ, నాట్యం చేస్తూ, గట్టిగా అరుస్తూ పాటలు పాడసాగాడు.

"ఓ దివ్యమాతా
అందమైన వారు ఏడుగురు
ఉన్నారు నీకు తోబుట్టువులు
ఉన్నాయి నీ సిగలో రెండు పగడాలు పూలు
నా తల్లి దర్బారులో వెలిగాయి నిత్యదీపాలు"

ఆ యువకుడు తన బట్టలమీద పడిన రక్తాన్ని జుట్టుకి రాసుకున్నాడు. అమ్మవారి అంశ అతని ఆత్మలో ప్రవేశించినట్లుంది. త్రిలోక శవం వంక నిప్పులు కక్కే చూపులతో చూస్తున్నాడు. గుడి వాకిట సాష్టాంగపడి ప్రణామం చేసి, లేచి నిలబడ్డాడు. ఆ భయంకర దృశ్యాన్ని చూడడానికి గ్రామస్థులు జంకారు.

వారిలో కొందరు భయంతో వణికిపోయారు కూడా వారు ఆ యువకుని దరిదాపులకు పోవడానికి కూడా జంకారు. కావాలనుకుంటే అతడు అక్కడే ఉండి ఇంకా గర్జిస్తూ, పాడుతూ, పిచ్చిగా అరుస్తూ గంతులు వేసేవాడే. కాదనుకుంటే జనాన్ని తప్పించుకుని పారి

పోగలిగేవాడే. కాని కొంత సేపటి తర్వాత స్వచ్ఛందంగా గ్రామ పెద్దకి లొంగి పోయాడు. అది కూడా పిచ్చిలో చేసిన చర్యేనేమో!

ఈ దారుణ వార్త పొరుగు గ్రామాలకి కూడా వ్యాపించింది. కోట్లాలో గొప్ప సంచలనం కలిగించింది. అకాల మేఘాలు సూర్యుని మసక పరిచాయి. సమయానికి ముందే ఉషః కాంతులు వెలిశాయి. వైష్ణవ దేవి ఆలయ శిఖరం తిలోక ప్రాంగణం లోకి నిశితంగా చూస్తున్నట్లనిపిస్తోంది. ఆకు రాలు కాలం రాకుండానే వేప చెట్టు ఆకులు రాలిపోయాయి. ఎప్పటిలాగా మొరగకుండా దబ్బూ తోకని కాళ్ళ మధ్య ముడుచుకుని గడ్డివాము వెనక్కిపోయి పడుకుంది.

హజూర్ సింగ్ కళ్ళలో, తన కొడుకు శవాన్ని చూసుకోటానికి కాంతి తిరిగి వచ్చింది. జిందాన్ కుమారుని శవాన్ని చూసి అచేతనంగా పడిపోయింది. స్పృహ కోల్పోవడం వల్ల పిల్లల ఏడుపులు, పెడ బొబ్బలు వినే అవకాశం ఆమెకి లేక పోయింది. రాణో పిచ్చెత్తినట్లుగా ఇంట్లోంచి బయటకూ, బయటనుంచి ఇంట్లోకి పరుగులు తీయసాగింది. జరిగిన దేమిటో ఆమెకి అర్థం కాలేదు. ఆ మతి పోయిన స్థితిలో ఆమెకి ఉన్నవాటిలో మంచి బట్టలని వేసుకోవాలనీ, అందెలు పెట్టుకోవాలనీ కోరిక కలిగింది. ఆమె ఆ పని చేసేలోగా, చన్నో ఆమెని గట్టిగా పట్టుకుని ఆమె చేతి గాజుల్ని గోడకేసి పగల కొట్టింది. పూరణ్ దేవి గుప్పెడు మట్టి తీసి రాణో తలమీద పోసింది.

ఇంత జరుగుతున్నా అసలు జరిగిందేమిటో రాణోకి అర్థం కాలేదు. మళ్ళీ ఆమె ఇంటి లోపలికి వెళ్ళింది. పడుకోడానికి కుక్క నేలని త్రవ్వినట్లు ధాన్యం బస్తాలోంచి ధాన్యాన్ని చేత్తో త్రవ్వడం మొదలు పెట్టింది. అందులోంచి కొత్త పటకాలు వేసిన కొరడాని బయటకు తీసింది. పిచ్చి కోపంలో దానిని భర్త శవం ముందు ఝళిపిస్తూ జనం చూస్తూండగా దానిని రెండు ముక్కలు చేసింది. "చూశావా! నీ కొరడాని నేనేం చేశానో! దీనిని నావీపుమీద విరగకొట్టానని డంబాలు పోయావుగా! ఇప్పుడేమైంది ?" అంటూ అరవసాగింది.

రాణోని చూసి అక్కడి జనం విస్తుపోయారు. "ఆమెకి పిచ్చెక్కలేదు కదా?" అని అనుకోసాగారు. రాణో మనసు బెదిరి పోయింది కాని, పిచ్చి మాత్రం ఎక్కలేదు. వద్దీ తన తలని గోడకి ఆనించి బిగ్గరగా ఏడవ సాగింది. రాణో ఆమె దగ్గరకి వెళ్ళి ఎడాపెడా చెంపల మీద కొట్టూ "వడగళ్ళు పడితే పంటలు నాశనం అవుతాయి. మశూచి వచ్చి పిల్లలు చని పోతారు. నువ్వు తప్ప అందరూ చస్తారు. నీకేమీ కాదేమే ?" అంటూ తిట్టసాగింది.

ఒక స్త్రీ పరుగెత్తుకెళ్ళి రాణో పట్టు నుంచి వద్దీని విడిపించింది. "పాపం ఆ అమ్మాయి ఏం చేసింది ?" అంటూ రాణోని నిగ్గదీసింది.

"ఇదంతా దానితప్పే" గట్టిగా అరిచింది రాణో. "చచ్చేలోగా కూతురికి పెళ్ళి చేయలేని తండ్రి ఇంట ఇది ఎందుకు పుట్టాలి ?" అంది మళ్ళీ.

గుమ్మం దగ్గర నిల్చున్న రాణో మస్తిష్కంలో ఒక ఆలోచన వచ్చింది. 'పిచ్చిదానా! ఇప్పుడు కనక నువ్వేడవక పోతే, నలుగురూ నవ్వుతారు' అని

తనలో తానే అనుకుంది. ఏమనుకున్నా కన్నీళ్లు మాత్రం రాలేదు. ఆ క్షణంలో ఆమెకి తన ఇల్లే పరాయి ఇల్లుగా, తన పిల్లలే అపరిచితులుగా అనిపించింది.

రాణో ఇంట్లోకి వెళ్ళింది. ఉల్లిపాయ కోసి కళ్ళముందు పెట్టుకుని నీళ్ళు తెప్పించుకుందామనుకుందేమో! కాని అటువంటి అవసరం లేకపోయింది. ఎదురుగా తిలోక తినదలుచుకున్నట్టూ మాటో వున్న పళ్ళెం, సారా సీసా కనిపించాయి. వాటిని చూడగానే ఆమె దుఃఖం కట్టలు తెంచుకుంది. ఆపుకోలేక పెద్ద పెట్టున ఏడుస్తూ రెండు చేతులతో తల మోదుకో సాగింది. ఊరిలోని ఆడవారు ఆమెతో పాటు ఏడుస్తూ మరోవంక ఓదార్చ సాగారు. వాళ్లు ఓదారుస్తున్న కొద్దీ రాణో ఆకాశానికి అంటేటట్లుగా ఏడవ సాగింది. తలని పదేపదే గోడకేసి కొట్టుకోసాగింది. చెక్కిళ్ళవెంట కన్నీళ్ళు ధారగా కారుతున్నాయి. ఆమె నోటి వెంట పిచ్చి పిచ్చిగా మాటలు రాసాగాయి. "రాణో నా బిడ్డా! నీకు తల్లీ దండ్రీ లేరు. ఇప్పుడు భర్తకూడా లేడు. బజార్లో ఏ పనేనా చేసుకుందామన్నా నీకు వయసు మీరిపోయింది. చివరకి నువ్వు వేశ్యగా కూడా పనికిరావు" అంటూ ఏమేమో మాట్లాడసాగింది.

* * *

చౌదరి, అతని తమ్ముడికి, బాబాహరిదాస్‌కి, తలో ఏడేళ్ళు కఠిన కారాగార శిక్ష పడింది. మానభంగం మూలంగా మరణించిన ఆ అమ్మాయి సోదరునికి తిలోకని హత్య చేసినందుకు గాను అంతే జైలు శిక్ష పడింది.

ఆ యువకుడు ఉద్దేశపూర్వకంగా హత్య చేయలేదనీ అకస్మాత్తుగా వచ్చిన కోపావేశాలవల్ల అది జరిగిందనీ, డిఫెన్స్ కౌన్సిల్ నిరూపించగలడంతో తక్కువ శిక్ష పడింది.

మరి బాబా హరిదాస్‌కు శిక్షపడిందెందుకు? ఆయన ధరించే గోచీ ఇనుముతో కాకుండా పట్టుతో చేయబడిందని తెలిసి రావడమే అందుకు కారణం.

బాబా హరిదాస్‌కు శిక్ష పడటం కోట్లా గ్రామంలోని స్త్రీలకు విశ్రాంతిని కల్పించింది. వారు మౌనంగా ఒకరివంక మరొకరు చూసుకోసాగారు. పూరణ్‌దేవి ఆ గ్రామం అంతటినీ సుడిగాలిలా తిరుగుతూ వార్తలు మోసుకువస్తుంటుంది. అందువల్ల ఆ బ్రాహ్మణావిడని కదిపితే సంగతి తెలియవచ్చు.

ఆ వార్త వినగానే ఆమె "అవును మరి" అని ఆ సంగతి ముందే తెలిసినట్లుగా చప్పరించేసింది. దాంతో అమ్మలక్కలు ఆమెని చుట్టుముట్టారు. ఆమె ఏమీ చెప్పలేక కళ్ళనీరు పెట్టుకుంది.

వైష్ణవదేవికొండ అక్కడ నుంచి ఏభై మైళ్ళ దూరంలో ఉంది. అయినా ఆ తల్లి తన చల్లని చూపులతో కోట్లా గ్రామాన్ని రక్షిస్తుంటుందని ప్రజలు చెప్పుకుంటుంటారు. ఆమె మీద భక్తి విశ్వాసాలు కలవారినీ, దయాపరులనీ, ఊరి చెరువువద్ద పావురాలకి మేత వేసే వారినీ, ఇంకా అటువంటి మంచి పనులు చేసేవారినీ ఆమె రక్షిసుందట. ఆమె రక్షణలో వున్న కోట్లా గ్రామంలో పాపం జరగదట. ఎవరైనా ఒకవేళ పాపకార్యం చేసే వైష్ణవదేవిని బలవంతం చేయబోయిన భైరన్ రాక్షసునికి జరిగినట్లుగానే తగిన శిక్ష పడుందట.

కోర్టులచుట్టూ తిరగవలసి రావడంతో

చౌదరికి చిలుం వదిలి పోయింది. ఆస్తి, ఇళ్ళతోపాటు ఆఖరికి వంట పాత్రలు కూడా అమ్ముకోవలసి వచ్చింది. గ్రామంలో వున్న ఆలయ నిర్వహణ బాధ్యతని పంచాయతీ తీసుకుంది.

తిలోక హత్య ఆ గ్రామస్థు లందరికీ మంచి గుణపాఠం నేర్పింది. అటుతర్వాత ఏ పురుషుడూ కూడా పరాయి స్త్రీ వంక కన్నెత్తి చూడడానికి ధైర్యం చేయలేదు. ఊరి స్త్రీలు సీతాకోక చిలుకల్లాగా సింగారించుకుని బయటకువస్తే, మగవారు నోళ్ళు వెళ్ళబెట్టి మౌన దృక్కులతోనే వారి కదలికలని చూసి మురిసిపోయేవారు. చాలామందికైతే వారి ముందు నోరు తెరవడానికే ధైర్యం చాలేదికాదు.

హజూర్‌సింగ్ ఎముకలకి నీరు పట్టింది. తన మంచం మీదే కూర్చుని ముసలి జిందాన్ చెప్పే ఊసులు వింటుండేవాడు. జిందాన్ గతంలో తాను ఆ ఇంటి యజమానురాలుగా ఎలా సంచరించిందీ, హజూర్‌సింగ్ ప్రేమాభిమానాలని ఎలా చూరగొందీ తలుచుకుంటుండేది. అతను ఆమెను పెద్ద పెద్ద పట్నాలకు తీసుకువెళ్ళాడు. ఎన్నో జూలు చూశారు. అదే హజూర్‌సింగ్ ఈనాడు మంచమీద కూర్చుని, వచ్చిన కొద్ది శ్లోకాలనూ విసుగుపుట్టించేటట్లుగా వల్లెవేయ వలసిన వాడయ్యాడు. అయితే అతనికి ఈ శ్లోకాలు మానసికశాంతినీ, చిత్తస్థైర్యాన్ని ప్రసాదిస్తూండేవి.

జిందాన్ సణుగుడు, సతాయింపు ఎక్కువయి పోయాయి. రాణో కనిపిస్తే చాలు—ఆమెకి అరికాలి మంట నెత్తికెక్కి, తిట్లవర్షం కురిపించేది. "మాయదారి ముండా! నా బిడ్డణ్ని పొట్టన పెట్టుకున్నావు. మా అందర్నీ కూడా మింగాలని నోరు తెరుచుకు కూర్చున్నావు..పో. నీ ఇష్టం వచ్చిన చోటికిపో... ఈ ఇంట్లో నీకు చోటులేదు." అంటూ దులిపేది.

రాణోకి అక్కడ అవసరాన్ని మించి ఒక్కక్షణం కూడా ఉండాలని లేదు. కాని పిల్లలు ఆమెని చుట్టుకోవడంతో, సాలెగూట్లో చిక్కుకున్న ఈగలాగా అయింది ఆమె పని. జిందాన్ ఆమెని పొమ్మని చీదరించు కుంటున్నకొద్దీ, ఆమె అక్కడే ఉంటానని మరింత ప్రాధేయ పడసాగింది. ఆ ఇంట్లో తానెవ్వరికీ కాక పోయాననే విచారం ఆమె ఆరోగ్యంపై దెబ్బతీయ సాగింది. రాణో శారీరకంగా, మానసికంగా కుంచించుకు పోతుంటే వయసులో వున్న వద్దీలో జీవనసారం పుష్పించసాగింది. ఆ అమ్మాయిని చూసి ఇతరులు మోజుపడ్తారనే భయంతో రాణో ఆమెకి చింకి బట్టలు కట్టబెట్టేది. వారి పేదరికం కూడా ఇందుకు కొంత దోహదం చేసేది. ఆ పిల్లకి తలకూడా దువ్వేది కాదు. జుట్టు ముఖంమీద నుంచి వ్రేలాడుతుండేది. అలావుంటే దిష్టి తగలదని ఆమె నమ్మకం.

వద్దీది మంచి తెలుపు ఛాయ చాలా ఆకర్షణీయంగా ఉండేది. అందువల్లే పూరణ్‌దేవి "ఈ పిల్ల ఒంట్లో ఇంగ్లీషు వాళ్ళ రక్తం ఉన్నట్టుంది" అంటూ ఉంటుంది. అందువల్ల ఆ పిల్ల ఎలాగున్నా కూడా చాలా అందంగా ఉండేది. ఎవరైనా ఆ అమ్మాయి వంక తేరి పారజూస్తే, రాణో వాళ్ళమీద యుద్ధానికి లేచేది. వాళ్ళు వెళ్ళిపోయాక తనలో తానే "ఓ భగవంతుడా! వద్దీని మరీ అంత తెల్లగా ఉంచవద్దు, ఈ కారణంగా గ్రామమంతా నాకు శత్రువు అవుతోంది" అని ప్రార్థిం

చేది. వద్దీ ఆకర్షణీయంగా కన్పించ కూడ దని రాణో ఎంత ప్రయత్నించినా, ఆమెని నలుగురు కంటా పడకుండా దాచివుంచినా, చింపిరి గుడ్డలు కట్టించినా, పొంగి వస్తున్న ఆమె యవ్వనం దాగేది కాదు. ఆ పెద్ద పెద్ద కళ్ళలో పసిపిల్లల అమాయకత్వం గోచరించేది. ఆమె ప్రవర్తన అతిసామాన్యంగా వుండడంతోనూ, దేన్నీ అనుమానించక పోవడంతోనూ, రాణో కుమార్తెపట్ల నిరాశ చెందింది. తండ్రి సంరక్షణ కరువైన తిరుగుడు వద్దీ జీవితం విషాదాంతం అవుతుందేమో నని ఆమె భయం. కిట్టని వాళ్ళెవరైనా ఆమె జీవితాన్ని నాశనం చేయవచ్చు. ఈ దిగులు ఎక్కువై పోవడంతో రాణో చిక్కిపోసాగింది. పైగా మధ్య మధ్య ఫిట్లు వచ్చి మూర్ఛపోతుండేది.

రాణోవన్నీ అర్థంలేని భయాలు, ఆలోచనలు. ఆమె అంచనా ప్రకారం వద్దీ రోజురోజుకీ తన అంతాన్ని సమీపిస్తోంది. డిశంబర్ నుంచి ఆమె వద్దీ రుతుక్రమాన్ని జాగ్రత్తగా లెక్కపెట్టడం మొదలు పెట్టింది. ఎప్పుడైనా ఒకటి రెండురోజులు ఆలస్యమైతే, అర్థంలేని అసహ్యమైన ప్రశ్నలని పదేపదే వేసి విసిగించేది.

"సాయంత్రం నువ్వెక్కడికి పోయావే? ఈశ్వరుని గుడి వదిలాక ఎక్కడికి పోయావు? గుళ్ళోకి ఎవరెవరు వచ్చారు? మంత్రం చెప్పమని పూజారిని ఎందుకడిగావు? అటువంటి మంత్రాలు ఏం చేస్తాయో నీకు తెలుసునా ? బాబా హరిదాస్ సంగతి మరిచి పోయావా ?" ఇలా వుండేవి ఆమె ప్రశ్నలు.

కూతురి పెళ్ళి కట్నం కోసం రాణో ఒక్కొక్క వస్తువునీ అమర్చ సాగింది. వద్దీని సాధ్యమైనంత త్వరలో పెళ్ళాడి వెంట తీసుకుపోయే యువకుని కోసం ఆమె వేయి కన్నులతో ఎదురు చూడ సాగింది. రాణోకి తన గతం గుర్తుకి వచ్చింది. ఆమెకి కూడా కట్నం ఇచ్చే షరతుమీద తిలోకకి ఇచ్చేశారు తల్లి తండ్రులు. వేరేమీ లేదు. తన కుమార్తె విషయంలో విధి ఇంకా క్రూరంగా ఉందేమో ! ఆ పిల్లకి సరియైన తిండీ, బట్ట ఉండడం లేదు.

రాణో మనో వ్యాకులానికి ముఖ్య కారణం ఊరిలోని కుర్రకారు. పట్నం పోయి సినిమాలు చూసి వచ్చే ఈ దగుల్బాజీలకి తల్లులకి, సోదరులకీ, ఇతర స్త్రీలకీ మధ్య వున్న తేడా తెలియదు. ఆ ఊరి కుర్రవాళ్ళలో, కోట్లాలోని స్త్రీలను గౌరవించగల బుద్ధిమంతుడొకడైనా వుంటే, వాడికి వద్దీనిచ్చి కట్టపెట్టడానికి ఆలోచించవచ్చు. అది జరిగినట్లయితే ఆమెకింకే దిగులూ ఉండదు. కాని ఊరిలో వున్న కుర్రకారంతా రౌడీ రకం. తరుచుగా వాళ్ళు చౌదరీగారి నిమ్మతోటమీద దాడి చేసేవారు. కొద్దిగా పళ్ళని తిని మిగిలిన వాటిని ఎక్కువగా పారవేసేవారు. ఈ అల్లరి కుర్రకార్నుని దారికి తీసుకువచ్చే వారెవరూ కనిపించలేదు.

వద్దీ గీత ఎలా రాసి ఉందో! రాణో తీరిగ్గా కూర్చున్నప్పుడల్లా పగటి కలలు కంటుండేది. వద్దీ అత్తవారింటికి వెళ్ళే రోజుకి మధ్యగల కాలం సాగుతూ, కుంచించుకు పోతూన్నట్లు అనిపించేది. ఈ పగటి కలలతో ఆమెకి తల తిరుగుడు మొదలైంది. వద్దీ పెళ్ళి కట్నం కోసం ఇయ్యాబోయే బట్టల మీద ఎంబ్రాయిడరీ కుట్టేటప్పుడు కూనిరాగాలు తీస్తుండేది.

ఆడపిల్లలందరికీ ప్రధానం కావాలి.
పెళ్ళాడి వాళ్ళు అత్తిళ్ళకెళ్ళాలి.

మరి తన వివాహం సంగతేమిటి? తనకి కొత్తగా తల్లిదండ్రులుగా మారిన అత్తమామల సంగతేమిటి? పగటి కలలకీ, ఎంబ్రాయిడరీ పనికీ మధ్య తాను పాడుతుండే పాటలో జీవం బదులు మృత్యువే ఉంటుందన్న విషయం ఆమె మరిచిపోయేది. మధ్య మధ్య తన భర్త దగ్గరికి పోవాలనే కోరిక బలంగా కలుగుతుండేది. రాణో కోట్లాకి వచ్చినప్పుడు తిలోక ఆమెకి అత్తమామల గురించి ఆలోచించే వ్యవధి ఎక్కువగా ఇయ్యలేదు.

రాణో అత్తవారింటికి వచ్చినప్పుడు కొత్త పెళ్ళికూతురు విషయంలో పాటించే ఆచారాలన్నీ పాటించబడ్డాయి. మేలిముసుగుతో వచ్చిన ఆ కొత్త పెళ్ళికూతురికి సాంప్రదాయ సిద్ధంగా స్వాగతం పలికారు. ఆపసూనెతో తలంటారు. అందరూ ఆమెతో సరదాగా హాస్యాలాడారు. అత్తమామలు ఆమెని చూసి మురిసిపోయారు. ఆమె కోసం ఆనందంగా పాటలు, క్రీడలతో గడిపారు. ఆచారం ప్రకారం పాత్రలు మార్చుకున్నారు. మేలి ముసుగు తొలగించటానికి బహుమతులు ఇచ్చారు. మొదటి రాత్రి కోసం చక్కని మల్లెపూల దండ తల్లో పెట్టారు. నూనె దీపం ఇచ్చే మసక వెలుతురులో ఆమె మొదటి రాత్రి సిగ్గూ, శృంగారాల కలయికలో మధురంగా గడిచింది. అయితే తిలోక ఇల్లు వయసులో వున్న యువతులు కోరుకునేటట్లుగా వుండదు. అత్తవారింటికి వెళ్ళాలనుకునే అమ్మాయిలు ఎన్నెన్నో తీయని కలలు కంటుంటారు. వాటికి అది అనుగుణంగా ఉండదు.

ఆకస్మికంగా రాణోకి తగిన ఇల్లు ఉండాల్సిన అవసరం వున్నట్లుగా గుర్తుకి వచ్చింది. ఇన్నాళ్ళ తన ఆలోచనలు కూతురి కోసమా? తన కోసమా?? ఒక్క క్షణంపాటు ఎటూ సమాధానం చెప్పుకోలేకపోయింది. జిందాన్ సూటిపోటి మాటలతో, సతాయింపులతో తరచుగా తాను పాడుకుంటుండే పాట మరింత అర్థవంతంగా అనిపించింది.

శ్రమించలేని దేహం ఉండేమి లేకేమి?
స్నేహితునితో పంచుకోని జీవితం
ఉండేమి లేకేమి?

తిలోక చనిపోయాక మంగళ్ టాంగా తోలడం మొదలు పెట్టాడు. గుర్రానికి కళ్ళెం వేయడం నేర్చాడే కాని, బాధ్యతలకు కళ్ళెం వేయడాన్ని తప్పించుకు తిరగ సాగాడు. ఇంట్లో ఇదివరకటికన్నా బాగా తక్కువగా డబ్బొంటోంది. మంగళ్ యవ్వనంలో అడుగు పెట్టడంతో, కోర్కెల అరణ్యంలో చిక్కుకున్నాడు. తన చర్యలవల్ల కలిగే లాభనష్టాల గురించి అంచనా వేసుకోలేకపోయినా, జీవితానికి కావలసిన ప్రాథమిక అవసరాలను బాగానే అర్థం చేసుకున్నాడు. గ్రామంలోని పడుచుపిల్ల ఎవరైనా కంటపడితే పదాలు అందుకునేవాడు.

ఎర్రవైన్‌తో నిండి సీలు విప్పని ఓ
సీసా!
అదృష్టవంతుడు నీ బిరడా తీసి నీ
తేనెను త్రాగుతాడు తెలుసా?

మంగళ్ జట్కా తోలుతూ నాలుగు డబ్బులు సంపాదిస్తున్నా, తానుంటున్న ఇంటిపట్ల తనకి కొంత బాధ్యత ఉందన్న విషయాన్నే గుర్తించేవాడు కాదు. ఆ ఇంట్లోవాళ్ళు రోజుకోపూట పస్తుండాల్సి వస్తున్నా చలించేవాడు కాదు.

జీలం కడసారి కూతురు సలామత్‌తో ప్రేమ వ్యవహారం మొదలు పెట్టాడు మంగళ్. ఒక రోజున అతను జట్కా తోలుతుంటే ఆమె ఎదురైంది. "మంగళ్! ఏమిటి విశేషాలు ?" అంటూ మాట కదిపింది.

గుర్రం కళ్ళాన్ని లాగిపట్టి ఆమెవంక తల తిప్పాడు మంగళ్.

సలామత్ అతని దృష్టిని ఆకర్షించేటట్లుగా ముందుకి వచ్చి "ఏం అబ్బాయి! మమ్మల్నోసారి నీ బండిమీద తీసుకెళ్ళవూ?" అంది కవ్విస్తూ.

"అలాగే...మరి నా జట్కా ఉందెందుకూ ?"

"మరి ఎప్పుడూ?" అర్ధనిమీలిత నేత్రాలతో గోముగా అడిగింది.

"నువ్వు ఎప్పుడంటే అప్పుడే"

చుట్టుపక్కల ఎవరేనా వున్నారేమోనని సలామత్ ఒకసారి నాలుగు వైపులా కలయ చూసింది. అటు తర్వాత గుసగుసలాడుతున్నట్లుగా "ఈ రాత్రి కయితేనో?" అంది.

"రాత్రి పూట వీలు కాదు. చీకట్లో నా జట్కాను బయటకు తీయను" అని కొరడాతో గుర్రాన్ని కొట్టి ముందుకు సాగాడు మంగళ్. రోడ్డుమీద కొంచెందూరం వెళ్ళాక కాని సలామత్ మాటల్లోని అంతరార్థం అర్థం కాలేదు మంగళ్‌కి. వెంటనే వెనుదిరిగి ఊళ్ళోకి వెళ్ళాలనుకున్నాడు. కాని బేరం రావడంతో ఆ ఆలోచన మానుకున్నాడు. పట్టరాని ఉత్సాహంతో గుర్రాన్ని కొరడాతో కొడ్తూ 'చల్ బేటా చల్, పట్నానికి చల్' అంటూ తోలడం మొదలు పెట్టాడు. సాయంత్రం మంగళ్ ఇంటికి తిరిగి వచ్చాడు. ఇంట్లో ఆకలికి కొట్టుకుపోయిన ముఖాలు చూస్తూంటే అతని శృంగారపు ఆకలి నశించిపోయింది.

ప్రొద్దుటినుంచి ఎవరూ ఒక్క ముద్దకూడా తినలేదు. అసలు వండితేగా ఎవరేనా తినడానికి? ఓ గుప్పెడు బియ్యం వుంటే వద్దీ ఉడకేసింది. రాణో ఆకలికి తట్టుకోలేక ఆ కాస్తనీ ఉప్పూ, మిరియం కూడా కలుపుకోకుండా తినేసింది. ఆ సమయంలో ఆమెకి ముసలి అత్త మామల విషయంకాని, పిల్లల సంగతికాని గుర్తు రాలేదు. ఈ సంగతి తెలిసి జిందాన్ నోటికొచ్చినట్లు కోడల్ని చీవాట్లు పెడ్తోంది.

రాణోకి అత్తగారి పీక పిసికి చంపేయాలన్నంత కోపం వచ్చింది. కాని తెలియని భయం ఏదో ఆవరించడంతో ఏమీ చేయలేక అసహాయంగా అస్పష్టంగా ఏడవసాగింది. ఈ దృశ్యం చూసి వేప చెట్టు కిందే నిలబడి పోయాడు మంగళ్. ఆ రోజు కేవలం పధ్నాలుగు అణాలే సంపాదించాడతను. అది ఉప్పూ, నూనె కొనడానికి బొటాబొటిగా సరిపోతుంది. మరికాస్త ఎక్కువే సంపాదించ గలిగేవాడే కాని ఆ రోజు ప్రయాణీకులు ఎదురు దిశలో బండి కట్టమన్నారు. సలామత్ కోసం త్వరగా తిరిగి వచ్చేయాలన్న ఆత్రుతతో అందుకు ఒప్పుకోక ఖాళీగానే వచ్చేశాడు మంగళ్.

మంగళ్ తల్లి దగ్గరకి పోయి ఆమె చెయ్యి పట్టుకుని "పిన్నీ! పాపం ఎందుకు రాణోని సతాయిస్తావు? ఎందుకు ఎప్పుడూ బయటకు పొమ్మంటావు? ఎక్కడికి పోగలదు చెప్పు?" అన్నాడు. మంగళ్ పసితనం నుంచీ కూడా రాణో దగ్గరే పెరగడంతో తల్లిని పిన్నీ అని పిలిచేవాడు.

రాణో భర్త పోయినప్పుడు కూడా

ఏడవనంతగా దిగ్గరగా వెక్కి వెక్కి ఏడవ సాగింది. "ఇక్కడినుంచి నేనెందుకు పోవాలి.? ఈ ఇంటి కోసం నేను చెయ్యని దేముంది ? నేనే కొడుకుని కనలేదా ? కూతుర్ని కనలేదా? నేను చెయ్యంది...?" అంటూ ఏడుస్తూనే అనసాగింది.

"అది రాణో తప్పు కాదు, తప్పంతా నాది" అన్నాడు మంగళ్.

"ఇందులో నీదేం ఉంది ?" అని మాట తుంచేసింది జిందాన్ "పిల్లల పట్లే తల్లిగా ప్రవర్తించలేనిది ఎవరికి ఉపయోగ పడుంది ?" అంటూ రాణో వంక తిరి గింది. ప్రార్థన చేస్తున్నట్లుగా రెండు చేతులూ జోడించి వ్యంగ్యం ధ్వనించే స్వరంతో "దేవుడికోసం, నానక్ గురు కోసం, వైష్ణవదేవి కోసం మాకు కనిపించ కుండా పో వెళ్ళి ఎవడినైనా కట్టుకో. ఎవడైనా గుడ్డి వాడైనా, ఒంటి కంటి వాడైనాసరే.నిన్ను తీసుకునే వాడెవడైనా సరే, వాడితో పో.ఇక్కడి నుంచిపోతే అంతే చాలు" అంది.

రాణో అత్తగారి వంక కోపంగా చూసింది. అంతలోనే ఆ దృక్కులు దీనంగా మారాయి. ఆమె ఏమీ మాట్లాడ లేదు కాని ఆ చూపుల్లో భావం ఇలాఉంది.

"నువ్వు తల్లిలాంటి దానివి. నన్ను వదిలించుకోవాలని చూడడం మీకు తగదు. ఎంత ఇబ్బంది అయినా నన్ను భరించా ల్సిందే. ఈ ప్రపంచంలో నాకు నా అన్న వాళ్ళెవరూ లేరు" ఆ ఇంట్లో తనకి భద్రత లేదనే భావం బలంగా వుండడం వల్లే, ఆ వండిన అన్నాన్ని తినేసింది. ఇంత రాద్ధాంతం జరిగాక ఇంక ఆ ఇంట్లో ఎలా ఉండగలనా అని భయపడ సాగింది.

పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు. చట్ట ప్రకారమైతే, వాళ్ళు త్రిలోక పిల్లలనే చెప్పాలి. అత్త మామలు, గ్రామ పెద్దలు పిల్లల్ని తనతో ఉండనిచ్చినా తాను వాళ్ళ నెక్కడికి తీసుకువెళ్ళగలదు ? తాను ముష్టెత్తుతూ వాళ్ళకీ ముష్టెత్తడం నేర్పాలి. రాణోకి తన నలుగురు పిల్లల మీదా సమానమైన ప్రేమే ఉంది. వాళ్ళందరూ తల్లిమీద ఆధారపడ్డవాళ్ళే. వాళ్ళలో ఏ ఒక్కరినీ వదలాలనే ఆలోచన వచ్చినా ఆమె హృదయం బాధతో ఆక్రోశించేది. వాళ్ళు తనవెంట తీసుకుపోదగ్గంతటి చిన్నవారు కాదు. అలాగని వాళ్ళ కాళ్ళ మీద వాళ్ళని వదలగలిగిన వాళ్ళూకారు. అత్తగారు రాణోని వేధించని క్షణం లేదు. నిలుచుంటే మోచేతిపోటు, కూర్చుంటే మోకాలి తాపు. భర్త చనిపోయాక స్త్రీల గతి ఇంతే అని రాణో సరిపెట్టుకునేది. ఆ ఇంట్లో వుండడానికి ఆమె కించెంత మాత్రం హక్కులేదు. అసలు ఈ ప్రపం చంలోనే ఎక్కడా బతికే హక్కులేదు.

ఒకరోజు చన్నో వచ్చి రాణో నడుం చుట్టూ చెయ్యి వేసి తన ఇంటికి తీసుకు వెళ్ళింది. వేడి వేడి గోధుమ చపాతీలు, ఆకుకూర పెట్టింది. కడుపు మండు తున్నా మొహమాటపడి కడుపునిండా తిన లేదు రాణో. వాపిరి గొట్టుగా తింటే మళ్ళీ ఎప్పుడూ చన్నో పిలవదేమోనని భయపడింది.

చన్నో తన పీటని రాణోకి దగ్గరగా లాక్కుంది. "చెల్లెమ్మా విను. నా మాట వింటానంటే నీకోటి చెప్తాను" అంది.

రాణో ఏమీ బదులు చెప్పకుండా చన్నోవంక చూస్తుండి పోయింది. చన్నో చెప్పసాగింది. "ఈ ముసలి పీనుగు జిందాన్ ఉందే అదే మీ అత్త నిన్ను శాంతంగా బతకనీయదు. ఈ ఇంటికి

యజమానురాలివి కావడానికి ఒప్పుకోదు. ఇవి తప్పాలంటే ఒకే ఒక మార్గం ఉంది"

"ఎలా ?"

"నువ్వు మంగళ్‌ని పెళ్ళాడాలి. అతని నీడలో నువ్వుంటే ఏ బాధా ఉండదు"

"వీల్లేదు" అంటూ చెంగున లేచి నుంచుంది రాణో. "నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలీదు" అంది కోపంగా.

"నేను సరైన మాటే చెప్తున్నాను. అన్నగారు చనిపోయినప్పుడు..."

"వీల్లేదు. ఎప్పటికీ వీల్లేదు" పదే పదే అనసాగింది రాణో. కోపంతో ఆమె ఒళ్ళు వణికిపోతోంది. "మంగళ్ పసివాడు. వాడిని నా చేతులతో కన్న బిడ్డలా పెంచాను. నా కంటె అతను కనీసం పది, పన్నెండేళ్ళు చిన్నవాడు. అటువంటి ఆలోచనే నేను చేయలేను" అంటూ తన ఇంట్లోకి పరిగెత్తుకుంటూ వెళ్ళిపోయింది రాణో.

రాణో ఇంట్లోకి వచ్చేసరికి మంగళ్ గుర్రానికి గడ్డి తెస్తున్నాడు. అతని వంక చూసి "వీల్లేదు వీల్లేదు" అంటూ గదిలోకి పరుగెత్తుకు వెళ్ళిపోయింది. మంచంమీద పడి గుడ్డతో ముఖం కప్పుకొని ఏడవడం మొదలు పెట్టింది.

కొంచెం సేపటి తర్వాత, కళ్ళెం చేతితో పుచ్చుకుని మంగళ్ లోపలికి వచ్చాడు. మరింత డబ్బు సంపాదించడానికి ఇంట్లోంచి పెందరాళే వెళ్ళాలన్న ఆలోచనలో ఉన్నాడతను. ఇంట్లో బియ్యం బొత్తిగా లేవు. వెనకటి రోజుల్లో చేసుకుడినట్లు మందమైన చపాతీలను చేయడానికి పిండి కొనాలసి అనుకున్నాడు. కడుపు నిండాలంటే, అటువంటి చపాతీలే కావాలి. బియ్యమైతే ఎందుకూ కావు. వాటిని తిన్నా తిననట్టే ఉంటుంది. ఆకలి తీరనే తీరదు. ఆ చపాతీలలో నంచుకోడానికి కూరకూడా ఉంటేనో! వా...ఇక చెప్పేదేముంది ! ఆ ఆలోచన వచ్చేసరికి మంగళ్ నోట్లో నీరూరసాగింది. కూర దొరక్కపోతే కనీసం ఉల్లిపాయ కాని, వెల్లుల్లి కాని ఉండాలి. కబురు పంపితే విద్య కొంత మజ్జిగ పంపకపోదు. ఆ మజ్జిగలో కొంచెం ఉప్పు,మిరియం పొడివేసి చపాతీలు తిన్నాక తాగితేనో...ఊహలో వున్న ఆ విందును తలుచుకుంటూ పెదవులు తడుపుకోసాగాడు మంగళ్. కళ్ళెం కొసలు చేతిలో వుంచుకొని "రాణో...గుర్రం కుచ్చు ఎక్కడుంది ?" అని అడిగాడు.

ఉలిక్కిపడి లేచింది రాణో మంగళ్ వంక ఒక్కసారి పరకాయించి చూసి ముఖం తిప్పుకుంది. "పిల్లలు బడికి వెళ్ళారు" అని సమాధానం చెప్పింది.

ఆ సమాధానానికి మంగళ్ విస్తుపోయాడు. "ఇది మరీ బాగుంది! నేను గుర్రం తలమీద పెట్టే ఈకల కుచ్చు గురించి అడిగాను. నువ్వేమో పిల్లల గురించి చెప్తున్నావు." అని వదినగారి ఒంట్లో బాగాలేదేమోనని దగ్గరికి వచ్చి ఆమె ఒంటిమీద చేయి వేశాడు.

రాణో వెనక్కి ముడుచుకుపోయి "నన్ను ముట్టుకోడానికి నీకెంత ధైర్యం?" అని అరిచింది.

మంగళ్ వెంటనే తన చేతిని వెనక్కి లాక్కుని తన వేళ్ళవంక పరీక్షగా చూసుకున్నాడు. కుచ్చు ఆ గదిలోనే కనిపించడంతో, దానిని తీసుకొని కళ్ళానికి తగిలించాడు. "నీలాంటి వివేచనగల మనిషి రాత్రి జరిగిన రాద్ధాంతాన్ని ఇంకా మరచిపోలేదంటే ఆశ్చర్యమే మరి" అంటూ బయటకు వెళ్ళిపోయాడు.

రాణో తలుపు దగ్గరికివెళ్ళి వెళ్ళిపోతున్న మంగళ్ విగ్రహాన్ని అతను సందు మొగలో కనుమరుగయ్యే దాకా చూస్తుండిపోయింది. మంగళ్ వెళ్తూ 'హీర్ రంజా' లోని ద్విపదని పాడుకుంటుంటే ఆమె చెవిలో మ్రోగసాగింది.

"నీవు చెప్పిన మాటలన్నీ నీటిపై రాతలు
పోరాడిన ప్రేమికులను కలిపేవి ఎవరి చేతలు ?
ఎంతగానో వెదకి వెదకి పోయాను వేసారి
మా ప్రేమ జంటను కలిపే వారెవరో ఈసారి"




చన్నో వెళ్ళి పూరణ్‌దేవితో మాట్లాడింది. పూరణ్‌దేవి తన భర్త గ్యాన్‌చంద్‌తో ఈ విషయం కదిపింది. గ్యాన్‌చంద్ ఆ గ్రామానికి సర్పంచ్ కూడాను! ఆ సమయంలో అతను గ్రామానికి సంబంధించిన ఓ తగాదాని పరిష్కారం చేయడంలో నిమగ్నమై ఉన్నాడు. అక్కడ నేలను చదును చేయిస్తున్నాడు. పూరణ్‌దేవి చెప్పిన మాట విని "నువ్వు చెప్పింది బాగానే ఉంది. అది అలా జరగాల్సిందే! లేకపోతే పాపం రాణో ఎక్కడికి పోతుంది!" అన్నాడు. ఒక్క క్షణం ఆలోచించి, "మంగళ్ ఆమెకంటె బాగా చిన్నవాడు కదూ!" అన్నాడు మళ్ళీ.

"అయితే మాత్రమే?" సూటిగా ప్రశ్నించింది ఆమె. "ఏం. మంగళ్ కోసం ఏ అప్సరస అయినా కాచుకొని ఉందా ? వాళ్ళకి పూట గడవడమే కష్టంగా ఉంది. కట్టుకోడానికి సరిగ్గా బట్టలు కూడా లేవు. ఈ పెళ్ళి జరిగితే ఒక్క దెబ్బతో రెండు సమస్యలు పరిష్కార మవుతాయి. నన్నడిగితే వాళ్ళిద్దరికీ కూడా ఇది మంచిది" అంది ఏకబిగిన. తనభర్తని ఆశ్చర్యంతో ముంచెత్తె ఉద్దేశంతో ప్రక్కకొచ్చి నిలబడి "మంగళ్‌కీ, సలామత్‌కీ మధ్య జరుగుతున్న వ్యవహారాలు విన్నారా ?" అని అడిగింది.

"ఊహుఁ... వినలేదు. ఏం జరుగుతోందేమిటి ?"

"నాకే కనక శక్తి వుంటేనా ఈ క్షణంలో వున్న తురక నేతగాళ్ళ నందర్నీ బయటికి పంపి ఉండేదాన్ని. జీలం, దాని ముగ్గురు కూతుళ్లు పట్టపగ్గాలు లేకుండా ఉన్నారు. ఆ పెళ్ళయిన దానికీ, పెళ్లి కాని వాళ్ళకీ కూడా ఏమీ తేడాలేదు. వాళ్ళంతా చిత్తకార్తెలో కుక్కల్లాగ తిరుగుతారు"

"నువ్వేమిటేమిటో చెప్పుకుపోతావు. ఇంతకీ అసలేం జరిగిందో చెప్తావా? వాళ్ళేమైనా కూడని పనిచేశారా?" అసహనంగా అడిగాడు గ్యాన్‌చంద్.

'ఇప్పటికింకా అంతవరకు రాలేదు. రేపో మాపో అంతపనీ అవుతుంది."

గ్యాన్‌చంద్, భార్య ఇంకేదో మరింత ఉత్సుకత కలిగించే విషయం చెప్తుందేమోనని ఆశించాడు. అది లేకపోయేసరికి అతని ముఖంలో ఆశాభంగం ప్రస్ఫుటంగా కనిపించింది. అది కప్పెట్టుకుంటూ ఒక హెచ్చరిక చేశాడు. "ఆ చౌదరీకీ, ఇనప

గోచీ పెట్టుకునే యోగికీ, పట్టిన గతి గుర్తుందిగా ! ఏమైనా తప్పుడు పని చేస్తే వీళ్ళకీ అదేగతి పడుంది".

పూరణ్‌దేవి తన చూపులను నేలవైపు సారించింది. గ్యాన్‌చంద్ మాటల్లో బెదిరింపు స్పష్టంగా గోచరిస్తోంది. "అటువంటిదే కనుక జరిగితే మూల్యం చెల్లించాల్సింది మగవారొక్కరే కారని ఆడవారు తెల్సుకోవాలి. సమానత్వం కావాలని ఆడవాళ్ళు అర్రులు చాచనంతవరకు వారిని క్షమించి వదిలేయవచ్చు. ఇటువంటి విషయంలో మాత్రం కాదు'' అన్నాడు మళ్ళీ.

"మిమ్మల్నో విషయం అడగాలి"అంది పూరణ్‌దేవి. కొంచెం ఆగి "జీలంని గుడికి రమ్మనమని మీరెందుకు కబురు పెట్టారు?" ఆపుకోలేక అడిగింది.

గ్యాన్‌చంద్ కొంచెం కంగు తిన్నాడు. "ఆమెని గుడికి రమ్మనమని మేమెప్పుడూ అడగలేదు. అయినా మహమ్మదీయ స్త్రీ మన గుళ్ళోకి ఎలా వస్తుందీ" అన్నాడు నెమ్మదిగా.

"అలాగా... గుళ్ళో కాకపోతే తోటలో నన్నమాట" అంది పూరణ్‌దేవి వెటకారంగా.

"పిచ్చిగా మాట్లాడకు. తోటలో అరటి కాయలన్నీ దొంగిలించుకు పోయింది".

"మరి నీ తోటలోని అరటికాయో!" గూఢార్థంతో అడిగింది.

"నాదాని చుట్టూ మంచి కంచె ఉంది. లేకుంటే దాని కోసం కూడా ప్రయత్నించి ఉండేది" మీసాలు మెలేసుకుంటూ చిరునవ్వుతో అన్నాడు గ్యాన్‌చంద్.

"నిజంగా మంచి కంచే ఉందా! బంజరు గొడ్లు ఎప్పుడూ జొరబడలేదూ?" గ్యాన్‌చంద్ ముఖం పాలిపోయింది. ఆమె వృక్కుల్ని తట్టుకోలేక విషయం మార్చాలని చూశాడు. "సరే... మంగళ్ వ్యవహారమేదో మాట్లాడాలన్నావు!" అన్నాడు.

"మంగళ్ విషయం కాదు. రాణో గురించి" సరిదిద్దింది.

"సరే రాణోని గురించేననుకో. రాణో మంగళ్ నీడలో వుంటేనే బాగుంటుందని, నా అభిప్రాయం. మన ఊరికి తీసుకు వచ్చిన స్త్రీ మరో చోటికి ఎందుకు పోవాలి? ఇతర పురుషుల కోసం ఎందుకు వెతకాలి? అటువంటిదైతే, మన గ్రామానికీ, ఇక్కడి మగ వారికీ కూడా చెడ్డ పేరు వస్తుంది."

ఆ మాటలు అని తల పైకెత్తి పనివారి వంక తిరిగి "ఏయ్ నేలని చక్కగా మట్టంగా చేయండి. కన్నాలన్నీ పూడ్చండి" అని అరిచాడు.

పని వాళ్ళు పారలు భుజాన వేసుకుని బయలు దేరారు. నూనెతో బాగా మర్దన చేసిన వాళ్ళ కండరాలు ఎండలో నిగనిగా మెరుస్తున్నాయి. వాళ్ళని చూస్తుంటే గ్యాన్‌చంద్ మనస్సులో ఒక ఆలోచన మెదిలింది. పంజాబ్‌లో ఆడవాళ్ళు తక్కువ. అటువంటప్పుడు ఉన్న కొద్ది మందినీ ఎక్కువ మంది మగవాళ్ళు కట్టుకుంటే పోలా? వాళ్ళకా అవకాశం ఎందుకు లేకుండా చేయాలి? ఏ స్త్రీ మాత్రం వాడిపోయిన స్త్రీగా ఎందుకుండాలి? అలా ఆలోచించుకుంటూ గ్రామస్థులని కలుసుకొని ఈ విషయం చర్చించడానికి బయలుదేరాడు. ముందుగా పెద్దలని, ఆ తర్వాత మంగళ్ కులంవారైన భాదియాలను కలుసుకుని మాట్లాడాలని అనుకున్నాడు.

మంగళ్ ఇంట్లో లేనిసమయంలో వద్దీని

చూడడానికి ఎవరో పరాయివారు వచ్చారు. వాళ్ళెవరో, ఎందుకు వచ్చారో ఆ అమ్మాయికి తెలియదు. కాని నాయనమ్మ చెప్పిన ప్రకారం, చన్నో ఇంటికి వెళ్ళి వచ్చిన వారికోసం కొంచెం పంచదార మిఠాయిని తెచ్చింది. ఆ వచ్చిన వాళ్ళు ముగ్గురు ఉన్నారు. వాళ్ళలో ఒకడు మధ్య వయస్కుడు. ఇద్దరు యువకులు. వారిద్దరిలో ఒకడు ఆ పెద్దాయన కొడుకులాగ ఉన్నాడు. గదిలోంచి బయటకు రాగానే వద్దీ వంకచూసి తలాడించింది జిందాన్. వాళ్ళు వద్దీవంక సంతలో అమ్మకానికి పెట్టిన గుర్రంపంక చూసినట్లు చూశారు. వద్దీవంక చూడడానికి ఆ యువకులు కొంచెం సిగ్గుపడ్డారు. కాని ఆ ముసలాయన మాత్రం తన కళ్ళని జలగిలాగా ఆమెకే అంటించి వేశాడు. జగ్గులోంచి నీళ్ళు పోయడానికి వద్దీ వంగినప్పుడు ఆ ముసలాయన ఆమె విశాలమైన జఘనాలని నిశితంగా పరిశీలించి "ఆఁ... ఈమె బాగానే పనికి వస్తుంది. చక్కగా పని చేస్తుంది" అన్నాడు నెమ్మదిగా.

వద్దీ మస్తిష్కంలో ఆకస్మికంగా ఒక ఆలోచన వచ్చి, ముఖం ముడుచుకు పోయింది. ఆమె నాయనమ్మ సంజ్ఞలూ చేసేలోపునే ఇంట్లోంచి బయటకు పరిగెత్తుకు పోయింది. ఆమె వెళ్ళుంటే ఆమె యవ్వన పరిమళం గుప్పుమంది.

ముసలి జిందాన్ వెయ్యి రూపాయల నుంచి బేరం పెట్టింది. చివరికి ఆ బేరం 550 రూపాయలకి ఖాయం అయింది. ఆ వచ్చిన వారికి పిల్ల నచ్చింది. జిందాన్‌ను మరోసారి ఆలోచించుకోమని చెప్పి వాళ్ళు వెళ్ళిపోయారు. ముసిలిది రాణో పత్తి ఏరడానికి బయటికి పోయిన సమయం చూసి పెళ్ళి వారిని రప్పించింది. ఇప్పుడు ఎలాగైనా ఆ డబ్బు చేతిలో వేసుకుని. వద్దీని వాళ్ళకి అప్పచెప్పడానికి పథకం ఆలోచించ సాగింది. రాణోని ఆ కుటుంబ సభ్యురాలు కానిదిగానే చూసినా, వద్దీ విషయంలో ఆమె అనుమతితీసుకోవాలన్న విషయం జిందాన్‌కి బాగా తెలుసు.

రాణో ఇంటికి తిరిగి రాగానే, జిందాన్ ఆమెమీద ఎక్కడలేని ఆపేక్షనీ ఒలకపోయ సాగింది. తడిసిపోయిన తన చేతుల్ని ఆమె నడుం చుట్టూ వేసి తన పక్కనే కూర్చోబెట్టుకుంది. "నా కోడలుగా వుండాలని దేవుడు నీ ముఖాన రాశాడే" అంటూ మొదలెట్టింది.

అత్తగారు ఏదో నాటకం ఆడుతోందని గ్రహించింది రాణో. వద్దీ అవతలికి వచ్చి తల్లిని గదిలోకి రమ్మని సంజ్ఞ చేసింది. ముసలి జిందాన్ బలహీనపు కళ్ళు తల్లీ కూతుళ్ళ సంజ్ఞలను గమనించలేక పోయాయి. రాణో కుమార్తె దగ్గరికి వెళ్ళింది. వద్దీ చాటుగా విన్నదంతా, కుదిరిన బేరం మొత్తంతో సహా చెప్పేసింది.

ఆ మాటలు విని రాణో అగ్గిబుగ్గయింది. ఆమె కూతుర్ని పక్కకి తోసేసి జిందాన్ దగ్గరికి పరుగున వెళ్ళింది. ఆ కోపంలో తన స్థానాన్నీ, స్థాయినీ మరిచిపోయింది. భయాన్ని గాలికి వదిలేసింది. పిల్లల్ని తీసుకుపోడానికి రాబందు వస్తే కోడిపెట్ట పట్టరాని కోపంతో చచ్చేదాకా పోట్లాడినట్లుగా ఉంది ఆమె పరిస్థితి. "మనింటికొచ్చిన మనుషులెవరు? నా ఇంట్లోకి వచ్చి నా కూతురిని కొనడానికి బేరమాడే ధైర్యం ఎవరికుంది'' అంటూ పులిలాగా గర్జించింది.

యుద్ధం మొదలవకుండానే జిందాన్

ఓడిపోయింది. "బిడ్డా! రాణో. వాళ్ళు ఊరికే మాట్లాడడానికి వచ్చారు. లోకం నోటిని మూయలేంకదా! నువ్వే చెప్పు" అంటూ అనునయ వాక్యాలు మొదలు పెట్టింది.

"ఆ నువ్వు మూయగలవు. వాళ్ళ నోటినిండా కుక్కి, నాలికలకి నిప్పంటించ గలవు"

అత్తగారు ఏమి చెప్పినా వినేస్థితిలో లేదు రాణో. "వాళ్ళడిగితే మాత్రం నువ్వు మాట్లాడతావా? ఆ లంజకొడుకుల నాలుకలు కోసి పంపాల్సింది. కాలే ఇనప కడ్డీని వాళ్ళ నోళ్ళలో కుక్కాల్సింది. నా కూతురు-దాని ప్రతి చెయ్యి చేతికున్న ప్రతివేలు లక్షరూపాయల విలువచేస్తుంది" అంటూ విరుచుకు పడింది.

"నీ కూతురు నాకూ బంధువే. అది నా మనుమరాలు" -జిందాన్ సర్ది చెప్పాలని చూసింది.

"నీకు కోడలంటూ వుంటే మనుమ రాలు ఉండేది. నీకు కోడలే లేదు" కీచు గొంతుతో అరిచింది రాణో. "ఇంకెప్పుడూ ఇటువంటి పనిచేయకు" అని అరుచుకుంటూ గదిలోకి పరుగెత్తింది. మంచం మీద విసురుగా పడి హుః...నా కూతుర్ని అమ్ముకుంటుంటే చూడాల్సిన గతి నాముఖాన రాసుందా? నేనేమి వెంట తీసుకురాలేదనే నన్ను ఈసడించారు. నా కూతురు కూడా డబ్బుకి అమ్ముడుపోతే.. దాని ఎముకలు విరక్కొడతారు. దాని మాంసం కుక్క పీకినట్లు పీకుతారు. దానిని సూటిపోటి మాటలతో బాధిస్తారు. 'అందరూ భార్యలని తెచ్చుకున్నట్లు నిన్ను మేం తెచ్చుకోలేదు. డబ్బుపోసి కొనుక్కున్నాం' అని సాధిస్తారు.

ఆమె భర్త త్రిలోక బ్రతికివున్న రోజుల్లో రాణో భర్తతో "నేను నావెంట ఏమీ తేనప్పుడు నువ్వు నన్ను కొనుక్కో డానికి ఏమీ ఇయ్యక పోయుండవల్సింది. జ్ఞాపకం ఉంచుకో నువ్వు నన్ను పెళ్ళాడావు కాని కొనుక్కోలేదు" అంటుండేది.

మళ్ళీ కూతురి సంగతి జ్ఞాపకం వచ్చి దిగులు పట్టుకుంది. "వాళ్ళు ఎలాగూ నా పిల్లని అమ్మేస్తారు. పూట గడవడమే కష్టమౌతోంది.అటువంటప్పుడు పెళ్ళి ఎలా చేస్తారు?" ఉన్నట్లుండి ఆమె మనస్సులో ఒక ఆలోచన మెరిసింది. "చౌదరి కనుక ఊళ్ళో ఉండినట్లయితే కట్నానికి కావలసిన డబ్బు ఒక్కరోజులో సమకూర్చుకోగలిగి ఉండేదాన్ని. అప్పుడు మగ పెళ్ళివారిని శహనాయి సంగీతం తోనూ, డాన్సులతోనూ, గానాబజానా తోనూ ఆనందింపజేయగలిగి ఉండేదాన్ని. నా బిడ్డని 'సెహరా'తో కప్పిన మంచి పెళ్ళి కొడుకుకు అప్పజెప్పగలిగేదాన్ని. దానిని పల్లకీలో కూర్చుండబెట్టి అది అత్తవారింటికి వెళ్తుంటే కన్నీటితో సాగనంపేదాన్ని. పైకి చెప్పకపోయినా "అమ్మా...నీ సంతోషకరమైన భవిష్యత్ కోసం నీ తల్లి తన శీలాన్ని ఒక రాత్రికి అమ్ముకోవలసి వచ్చింది" అని లోలోపలే కుమిలేదాన్ని.

ముసలిది కనక నా బిడ్డని 500కో 550కో అమ్మేస్తే, అందులో నాకు పైసా కూడా ఇయ్యరు. పిల్లని అమ్మక తప్పని స్థితి అయితే కేవలం 550కి ఎందుకు అమ్ముకోవడం! దానిని బజార్ కి తీసుకెళ్ళి ముక్కలు ముక్కలుగా అమ్ముకో వచ్చుగా! లాహోరు బజార్లో వందల కొద్దీ పెద్ద మనుషులు క్షణకాలం సుఖం

కోసం పాతిక రూపాయల వరకూ ఇయ్యడానికి సిద్ధంగా ఉన్నారు. అందులోకి దిగితే మాకు కడుపునిండా తిండి, కట్టుకోడానికి పట్టుబట్టలు...కొద్ది రోజుల్లోనే ట్రంకు పెట్టెలు డబ్బుతోనూ బట్టలతోనూ ఉబ్బిపోతాయి.

రాణో తన ఆలోచనా ప్రపంచంలోంచి ఉలిక్కిపడి లేచింది. ఫెళ్ళున దెబ్బకొట్టిన శబ్దం వినవచ్చింది. పరధ్యానంలో ఆమె తన ముఖంమీద తనే గట్టిగా కొట్టుకుంది. ఆ తర్వాత ఎప్పటిలాగే ఆమెను తెలియని భయం ఆవరించి, వణికి పోసాగింది.

రాణో అన్న మాటల అర్థం గురించే ఆలోచిస్తోంది ముసలి జిందాన్. "నీకు కోడలంటూ వుంటే మనుమరాలు ఉండేది" అంది. ఆమె ఆ ఆలోచనలోనే వుండగా గ్యాన్‌చంద్, మరి కొందరు గ్రామ పెద్దలు కలిసి వచ్చి హజూర్‌సింగ్ మంచం చుట్టూ కూర్చున్నారు. జిందాన్ వైపు చూసి రమ్మన్నట్లుగా చెయ్యి ఊపారు. వాళ్ళు ఆమాటా ఈమాటా మాట్లాడి రాణోని మంగళ్‌కి ఇచ్చి పెళ్ళి చేస్తే బాగుంటుందంటూ మాట కదిపారు. గ్రామంలో గోతులు పూడ్పించే విషయాన్ని పంచాయతి మీటింగ్‌లో చర్చించినంత సులువుగా వాళ్ళు ఆ విషయాన్ని ఎత్తారు.

వారి మాటలు హజూర్‌సింగ్ హృదయాన్ని గాయపరిచాయి. తన అంతిమ దినాలలో పంచాయతి వాళ్ళూ, తన సాటి కులస్థులూ వచ్చి అవమానపరుస్తున్నారని బాధపడ్డాడు. అయితే చురుకుగా అర్థంచేసుకునే జిందాన్ వుండడం వల్ల, వ్యవహారం సులువుగా పరిష్కారం అయింది.



జిందాన్- రాణోని మంగళ్‌కి ఇచ్చి పెళ్ళి చేయవచ్చునన్న విషయం తనకెందుకు తట్టలేదా? అని ఆశ్చర్యపోసాగింది.

పాపం హజూర్‌సింగ్ నీళ్ళు నిండిన అరమోడ్పు కన్నులతో గ్రామస్థుల వంక చూస్తూ ఏదో అనబోయేసరికి, జిందాన్ పళ్ళు కొరుకుతూ "ఉష్! ఈ విషయంలో నువ్వేమీ కల్పించుకోకు. మంచంమీంచి లేవనూ లేవు. చావనూ చావవు. ప్రపంచంలో ఎన్ని ఘోరాలు జరుగుతున్నాయో నీకేమైనా తెలుసా? జీవితమంతా గుడ్డి వాడివిగానే ఉన్నావు. వచ్చే జన్మలో గుడ్డి వాడివిగానే ఉంటావు. ముసలివాడివి. నువ్వు మాట్లాడకుండా ఊరుకో" అని కసిరి కొట్టింది.

ముసలి దంపతులకి తాము చెప్పదలుచుకున్న నాలుగు మాటలూ చెప్పి గ్రామ పెద్దలు వెళ్ళిపోయారు. వారందరి కంటే జిందాన్ వయసులో పెద్దది కావడంతో, వెళ్ళేముందు వాళ్ళని ఆశీర్వదించింది. ఊరి పెద్దలు వెనుదిరిగారో లేదో పిడుగులాగా వచ్చి పడింది రాణో.

"ముసలిదానా! నువ్వు సంబంధం చూడాల్సింది వద్దికి కాని నాకు కాదు. నా శవాన్ని మళ్ళీ గోతిలోంచి పైకెందుకు తీస్తావు? నీకు ఏ మాత్రం సిగ్గు మిగిలి వున్నా ఇంత విషం తీసుకుని చావు. ఓ దేవుడా...ఈ ముసలి ముండని ఊరి చెరువులో ముంచు. దీని ఎముకల్ని పిండి మరలోవేసివిసురు. ఏయ్ ముసలి పీనుగా! నువ్వు నా చిట్టి చమ్మూతో పడుకోరాదూ? నువ్వు నా బంటాని పెళ్ళి చేసుకో కూడదూ? సంటాచేత నీ తలమీద మేలి ముసుగు వేయించుకో కూడదూ? నా చనుపాలతో పెంచిన వాడిని నేను పెళ్ళాడుతాననుకుంటున్నావా?" అంటూ

నిప్పులు కురుస్తున్న కళ్ళతో దులిపేసింది.

ఎవరిదో చెయ్యి బలంగా రాణో తల మీద పడింది. దాంతో గోడ పక్కనే వున్న చెత్తమీద కుప్పకూలి పోయింది. తెలివి వచ్చి చూసేసరికి చన్నో పక్కగా నిలబడి వుంది.

"మాయదారిదానా! మొగుణ్ని తిన్నది చాలక ఇంకా మాట్లాడుతావూ? చావ రాదూ?" అంటూ పళ్లు పటపటా కొరుకుతూ బుసలు కొట్టసాగింది. ఆమె రాణో జుట్టు పట్టుకుని ఇంటి వెనకాల ఖాళీ స్థలంలోకి ఈడ్చుకు వెళ్ళింది. ఆ స్థలంలో రాత్రుళ్లు చీకటి వ్యవహారాలు సాగించే ఊరిలోని అబ్బాయిలూ, అమ్మాయిలూ కలుసుకుంటుంటారు. "ఛీ... కుక్కా నీకేదో ఉపకారం చేయాలని మేము చూస్తూంటే, మా చెయ్యే కొరుకుతావు?" అంటూ చీదరించింది.

రాణో చన్నో కాళ్ళను చుట్టేసుకుంది. "లేదు చన్నో...లేదు. మంగళ్ పసివాడు. అతన్ని నేనెప్పుడూ కామదృష్టితో చూడలేదు" అంటూ వెక్కి వెక్కి ఏడవ సాగింది.

చన్నో గొంతు మృదువుగా మారింది. "చూడు, నువ్వు ఈ ఊళ్ళో ఉండదలుచుకున్నావా లేదా? ఈ ప్రపంచంలో నీకు కడుపు నిండా కూడెవరు పెడ్తారు? నీ సిగ్గు దాచుకోవాలని అనిపించదూ? పెద్ద మహాత్మురాలిలాగా కామదృష్టి గురించి మాట్లాడుతున్నావు? పెద్దలు ఏమన్నారు? "ఓ బులే!"

మొక్కని ఒకచోట నుంచి పీకి మరో చోట పాతిచూడు.

భగవంతుడేమీ పట్టించుకోడు- అని. ఇది కూడా అంతే! ఇంతకు ముందు ఒకరికిచ్చిన హృదయాన్ని ఇప్పుడు వేరొకరి కియ్యి. ఇంతకు ముందు నువ్వతన్ని కామదృష్టితో చూడకుండా వుంటే, ఇప్పుడు చూడు. పోయిందేమిటి?" అంది.

రాణో ఏమీ మాట్లాడలేదు.

చన్నో ధారాపాతంగా చెప్పుకుపోసాగింది. "జీవితంలో ఇద్దరు భర్తలను పొందినవారిని ఎంత మందిని చూడడం లేదు? వివాహం అయ్యాక ఒక్క భర్తతోనే ఉండాలి. ఒకరుండగా మరొకరితో వ్యవహారం నడిపితేనే చిక్కుల్లో పడేది. చాటుమాటు వ్యవహారాలు నడుపుతుంటే ప్రతిసారి జరగబోయే పరిణామాల గురించి విపరీతంగా భయపడాల్సి వస్తుంది. మగవాడికైతే ఈ బాధలు లేవు. ఇదంతా పురుషుల ప్రపంచం. వాళ్ళేం చేసినా ఎవరూ పట్టించుకోరు. పరాయిస్త్రీ మంగళ్‌ని పొందుతున్నప్పుడునువ్వెందుకు పొందకూడదు?సలామత్ సంగతివిన్నావా? దాని గురించి ఇప్పుడెందుకులే? నీ కూతురు గోరింటాకు పెట్టుకోవాలనీ, పెళ్లాడాలనీ, నువ్వనుకోడం లేదూ? ఈ బాధ్యత ఎలా తీరుతుందనుకుంటున్నావు?"

రాణోలో ఉలికిపాటు కనిపించింది 'ఈమె తన పెళ్ళి గురించి మాట్లాడుతోందా? తన కూతురి పెళ్ళి గురించి మాట్లాడుతోందా? తన పెళ్ళి సంగతే అందులో అనుమానం లేదు. చన్నో ఎంత చెప్పినా రాణో చిన్న పిల్లలాగ తనపట్టు విడవలేదు. "వీల్లేదు. వీల్లేదు. అలా జరగడానికి వీల్లేదు" అని పదేపదే అంది. చెప్పి చెప్పి విసుగెత్తి వెళ్ళిపోయింది చన్నో.

ఆ రోజంతా రాణో ఆలోచనలలో మునిగిపోయింది. హృదయాంతరాళంలో

కొత్త అగ్ని ప్రజ్వరిల్లుతోంది. వద్దీకి కాని, కవలలకి కాని, పసివాడికి కాని ఇందులో సంబంధమేమీ లేదు. కడుపులో కొత్త శిశువు కదులుతున్నట్లుగా ఉంది.

ఆ సాయంత్రం పూరణ్‌దేవి రాణోని చూడడానికి వచ్చింది. రాణోకి జ్వరం వచ్చింది. తలకి గుడ్డ కట్టుకుని పడుకుని ఉంది. చన్నో మూలికలతో గంధం అరగదీసి నుదుటిమీద పక్షుల ఆకారంలో పట్టు వేసింది. ఆ "పక్షులు" వాటి ముక్కుతో ఆమె కష్టాల్ని పొడుస్తున్నట్లున్నాయి. ఆమె ముందుగా రాణో ఆరోగ్యం గురించి ప్రశ్నించింది. ఆ తర్వాత గూఢార్థం వచ్చే చిరునవ్వుతో- "ఇది ఏ రకం జ్వరమేమిటి" అని అడిగింది. రాణో కూడా చిరునవ్వు నవ్వి వీపు పూరణ్‌దేవి వైపు తిప్పి పడుకుంది.

ఆ విధంగా రాణో దేహంలో కోరిక తిరిగి జ్వలింపజేయబడింది. పూరణ్‌దేవి మనస్ఫూర్తిగా నవ్వింది. వద్దీకి జరుగుతున్నదేమిటో అర్థం కాలేదు. అయినా అక్కడేదో సరదా కల్పించే సన్నివేశం ఉందని అర్థం చేసుకుని తానుకూడా వారితోకలిసి హాయిగా నవ్వాలనే ఉద్దేశంతో వచ్చి కలిసింది.

కీచు కంఠంతో చన్నో నవ్విన నవ్వుకి వేపచెట్టు మీదున్న పక్షులు భయపడి ఎగిరిపోయాయి. సూర్యుడు తన చివరి అరుణరేఖలని గుడి శిఖరం మీద ప్రసరించాడు. సాయంకాలం పూజల కోసం, గుళ్లో గంటలు మ్రోగసాగాయి.

మంగళ్ అకస్మాత్తుగా అటొచ్చి గుమ్మం దగ్గరే ఆగిపోయాడు. ఆ రోజు అతను ఏడు రూపాయలు సంపాదించాడు. దాంతో అతనికి తనపట్ల, జీవితం పట్ల నమ్మకం, సంతోషం పెరిగాయి. ఎప్పటిలాగా ఆ డబ్బుని తీసుకొచ్చి రాణో చేతిలో పోశాడు.

పూరణ్‌దేవి సంతోషం పట్టలేక అనేసింది. "ఆ...అదీ సంగతి. తన మొదటి సంపాదనన్నమాట. తాను నిత్యమూ సంపాదిస్తూ నీచేత ఖర్చు చేయించుగాక"

రాణో ఆ పైసల్ని జారవిడిచింది. గాలికి నోట్లు చెల్లాచెదరై పోయాయి. నాణాలు గచ్చు నేలమీద దొర్లిపోయాయి. ఆశ్చర్యపూరిత స్వరంతో "ఇదేమి హాస్యం పిన్నీ" అన్నాడు మంగళ్.

"నీకు చెందిన ఈవిడని అడుగు" అంటూ వద్దీని లాక్కుంటూ, రాణోని, మంగళ్‌నీ అక్కడే వదిలేసి బయటకు వెళ్ళిపోయింది పూరణ్‌దేవి.

మంగళ్ వెర్రిగా నవ్వుతూ "కోట్లాలోని ఆడవాళ్ళందరికీ కావలసింది..."

"ఏం మొగవాళ్ల వేరుగా ఉంటారా ?" అంటూ అతని మాటని తుంచేసింది రాణో.

మంగళ్ విభ్రాంతి చెందాడు. ఏమీ మాట్లాడకుండా లోపలికి వెళ్ళి ట్రంకు పెట్టిలోంచి కొత్త చొక్కాని తీసుకొచ్చాడు. దానిని అతను పెషావర్‌లో కొన్నాడు. ఆ చొక్కాకి కాలర్‌చుట్టూ అప్రికాట్ పూలతో ఎంబ్రాయిడరీకుట్టి ఉంది. దానిని విప్పుతూ "మగవారు చెప్పే దాంట్లోనూ, చేసేదాంట్లోనూ కాస్తో కూస్తో అర్థం ఉంటుంది" అన్నాడు.

"మగవారు మగవారిని, ఆడవారు ఆడవారిని బాగా అర్థం చేసుకుంటారు" అని జవాబిచ్చింది రాణో కళ్ళలో కొంటెతనం కనిపించే కాంతితో. ఆదం కాలం నుంచి కూడా ఆడవారు అటువంటి చూపులతోనే ప్రపంచాన్ని గుప్పిట్లో పెట్టు

కుంటున్నారు.

ఆమె మాటలని గురించి కొంచెం సేపు ఆలోచించాడు మంగళ్. వాటిలో సత్యం ఉన్నట్లనిపించింది. చౌదరి గృహ నిర్మాణపు సామాను దాచివుంచిన చోట ఆ ఖాళీ ప్రదేశంలో, చీకటి చాటున తాన్పూ, సలామత్ త్వరలోనే కొత్త జీవితం ప్రారంభించబోతున్న విషయం రాణో మనసులో అనిపించిందేమో! వెళ్ళబోతూ గుమ్మం దగ్గర ఆగి "ఈ ఆడా – మగ వాదనని అందుకున్నావెందుకు" అని అడిగాడు.

"అసలు సమస్య అంతా దాని చుట్టూనే ఉందాయె"

మంగళ్ అడుగులని నెమ్మదిగా వేస్తూ రాణో అన్నమాటల వెనకవున్న అర్థాన్ని గ్రహించడానికి ప్రయత్నించాడు. నిజానికి ఆ ఇద్దరిలో ఎవరికీ ఆ మాటల అర్థం సరిగా తెలియదు. జీవితంలో కొన్ని అరుదైన సందర్భాలలో మామూలుగా ఏమీ అర్థం లేని మాటలు ఎంతో అర్థంతో నిండుతాయి. అటువంటప్పుడు ఎంతో అర్థం వున్న మాటలు కూడా వట్టి చెత్తగా ధ్వనిస్తాయి.

ఇంతకీ వాళ్ళ సంభాషణలో ఏమైనా అర్థం వున్నా లేకపోయినా, వారిద్దరిలో ఎవరికీ ఆ మాటల్లోని అర్థం తీసే ఓపికకాని తీరిక కాని లేదు. రాణోకి ముప్ఫయి ఏళ్లనిండి ఎక్కువ కాలం కాలేదు. విశాలమైన ఆమె దేహంలో కోరిక తిరిగి జనించింది. కన్యలకు ఉండే సిగ్గు ఆమెకి లేకపోయినా, తాను స్త్రీ అయినందుకు గర్వం, కాంక్షలు తీర్చుకోవాలనే తపన ఉన్నాయి. చాలా కాలంగా ఆమెలోని కోరికలు అణగారి పోయాయి. చైతన్యంలేని జీవితంలో అవి కృంగిపోయాయి. ఇప్పుడవి వివేకపు హద్దులని ఛేదించుకుంటూ బయటకు తన్నుకు వస్తున్నాయి. అవతల పక్క 24 యేళ్ళ పదునైన వయసులో, ప్రపంచాన్ని తన పాదాలముందు ఉంచుకోగల యువకుడు ఉన్నాడు.

రాణో దొడ్డి వాకిట్లోకి వెళ్ళి పాత్ర సామానుని చప్పుడు చేయసాగింది.

ఆమె పాచిక పారింది. మంగళ్ సలామత్‌ని కలుసుకోడానికి వెళ్ళ లేదు. జిందాన్ కొడుకుని పిల్చింది. మంగళ్ ఆమె దగ్గరికి వెళ్ళాడు. ఆమె వద్దీని, పిల్లల్ని ఆడుకోడానికి బయటకి పంపించేసింది. ఆమె మంగళ్‌ని తన పక్కనే కూర్చోపెట్టుకొని పరిస్థితి వివరించి చెప్పసాగింది. రాణో నెమ్మదిగా జారుకుని తలుపు వెనకాల నక్కి వాళ్ళ మాటలు వినసాగింది.

జిందాన్ విషయం కదిపిందో లేదో, ఆమె చెప్పదలచుకున్నదేమిటో మంగళ్‌కి అర్థమయింది. తలపాగని తన్నుకుని జుట్టు బయటకు వచ్చేస్తున్నట్లనిపించింది. ఒక చేత్తో తలపాగని పైకెత్తి రెండో చేతి చూపుడు వ్రేలితో జుట్టుని పైకి తోసుకోసాగాడు. అస్తమిస్తున్న సూర్యకాంతిలో అతని ముఖం ఎర్రగా జేవురించింది.

రాణో గోడని ఆనుకుని తన గుండెని చేతితో అదుముకుంది. గుండె చప్పుడు దడదడా వినిపిస్తోంది. హత్య చేసిన తర్వాత హంతకుడు కంగారుగా చెక్క మెట్లమీదనుంచి దిగుతుంటే అయ్యే శబ్దం లాగా ఆమె గుండె కొట్టుకుంటోంది. ఆ సమయంలో ఎవరైనా ఆమెని చూస్తుంటే, పుష్పం విచ్చుకోకుండానే పూర్తి వర్ణం పొంది అంతలో పాలిపోయి, వాడిపోయినట్లుగా అనిపిస్తుంది. ఆమె పెదవులు

ఎండు ద్రాక్షల్లాగా నలుపెక్కిపోయాయి. ఆమె మోకాళ్లు వణుకుతూ కొట్టుకోసాగాయి. ఆమె భయంతో, ప్రేమతో కొట్టుమిట్టాడసాగింది.

మంగళ్ లేచి రాణో వెళ్ళిన దిశ వైపుగా చూస్తూ "వీల్లేదు. ఇది ఎప్పటికీ జరగదు" అన్నాడు. గుర్రాన్ని పరుగెత్తించడానికి కొరడాతో గట్టిగా కొట్టినట్లు విసురుగా గాలిని చీల్చుకుంటూ కదిలాడు. "నేను తల్లితో పోయిన వాడినని నలుగురూ అనుకొనేటట్లు చేయను. ఈ ఊరి పెద్దల తల్లుల్ని చెరుస్తాను. వాళ్ళేం కూస్తే నాకేమిటి ? పెద్దలు స్వయంగా వచ్చి అడిగినా కాదనే చెప్తాను. ఆమె నా తల్లి వయసుది. ఆమె పాదాల దగ్గర తల ఉంచవలసిన వాడినేకాని, పక్కలో పడుకోవాల్సిన వాడినికాదు" అంటూ గర్జించాడు. సంధిలో ప్రలాపించినట్లు తిడ్తూ, పరుగెడుతున్నట్లుగా బయటకి వెళ్ళిపోయాడు.

గోడ దగ్గరనుంచి ఒక నీడ కదిలింది. జిందాన్ అటుచూసి "రాణో! వాడేం తెలివితక్కువ పని చేస్తాడో ఏమో !" అంది కంగారుగా.

రాణో ముందు ద్వారంవైపు గెంతింది. కిందపడి లేచి మళ్ళీ ముందుకి పరుగెత్తింది. చన్నో, పూరణ్‌దేవి, విద్య అందరూ ఆమెని పట్టి వెనక్కిలాగారు. రాణో విడిపించుకోవాలని ప్రయత్నం చేసింది. శూన్యంలోకి చూస్తూ ఆవేదనతో మూలగసాగింది.

"భయపడకు. అతనేం చేయడు" అంది చన్నో నిబ్బరంగా.

"అతను ఎవరికైనా అపకారం చేస్తే, నన్ను నేనే చంపుకుంటాను. అందర్నీ చంపిన పాపం నా నెత్తిన వేసుకోలేను" వెక్కి వెక్కి ఏడవసాగింది రాణో.

"పిచ్చిగా మాట్లాడకు. నిన్ను నిందించే వాళ్ళెవరున్నారు మేం తప్ప" విద్య ముందుకి వచ్చి గట్టిగా అంది.

చన్నో రాణో చేతుల్ని రుద్దుతూ "ఈ గందరగోళమంతా నీకు వేడెక్కించడానికి చేశాం. ఇంతయ్యాక నువ్వు మమ్మల్ని చల్లబరుస్తావేమిటి?" అంది.

"పిన్నీ...నన్ను రక్షించు" అంటూ చన్నో కాళ్ళను చుట్టుకుంది రాణో. పూరణ్‌దేవి ఆమెను పట్టుకుని కుదుపుతూ "ఆత్మహత్య చేసుకోవాలని ఎందుకనుకుంటావు ? నీకేమీ కాదు. మగవాళ్లు గుర్రాలవంటి వాళ్ళు. వాళ్ళమీద సవారీ చేయడానికి ఎక్కితే వెనక కాళ్ళతో తంతారు. మనం ఆడవాళ్ళలాగ ప్రవర్తించకుంటే, ఇంకా మనమంతా కన్యలుగానే ఉండేవాళ్ళం. ఆ విషయం నీకు మాత్రం తెలీదా" అంది.

రాణో కొంచెం ధైర్యం తెచ్చుకుంది. అరచేతులతో ముఖం కప్పుకుంది. వణుకుతున్న స్వరంతో "అతను ఏం చేస్తాడు" అంది చన్నోతో.

"నీలాగే తన ఆలోచన మార్చుకుని తిరిగి వస్తాడు"

"అతను ఏమని ఆలోచిస్తాడు"

"నీలాగనే! నీలాగనే అతనూ తన ఆలోచనలను మార్చుకుంటాడు."

ఆ సంభాషణ వింటూ వద్దీ సమీపంలో నిలబడింది. వ్యవహారమేమిటో ఆమెకి కొంచెం అవగతమయింది. "అమ్మ కనక అటువంటి పనేదైనా చేస్తే నేను విషం తీసుకొని చస్తాను" అంది.

ఆ స్త్రీలు తమ నుదుటిమీద చేత్తో

కొట్టుకున్నారు. చన్నో, పద్దీ జుట్టు పుచ్చుకొని ఈడ్చుకు వెళ్ళి లోపల పడేసింది. పద్దీ ముఖంలో అసహ్యం, సిగ్గు, అవమానం ప్రస్ఫుటంగా కనిపించాయి.

సలామత్ అటువైపు పోతూ అక్కడ జరుగుతున్న గందరగోళం వినింది. అయితే సంగతేమిటో ఆమెకి అర్థం కాలేదు. మంగళ్‌కి మాట యిచ్చిన విధంగా కలుసుకోవాలనుకున్న చోటికి వచ్చింది. మంగళ్ వచ్చినప్పుడు ఈ ద్విపద పాడాలనుకుంది.

"ఆనందంతో ప్రియురాలు చంద్రునికై
వేచింది.
కాని వేచి వేచి ప్రియుడు రాక కన్నీరు
కార్చింది."

మంగళ్ అటువస్తూ కనిపించాడు. అతను చాలా కోపంతోనూ, చెదిరిన మనస్సుతో ఉన్నట్లుగానూ ఉన్నాడు. సలామత్‌కి దగ్గరగా వచ్చినట్లే వచ్చి అకస్మాత్తుగా పక్కకి జరిగాడు. ఆమె అతనికి సమీపంగా వెళ్ళి ఆ దిగులుకి కారణమేమిటో తెలుసుకోవాలని ప్రయత్నించింది. అతని కోసం సలామత్ ఎంతో అందమైన బట్టలూ, ఆభరణాలతో సింగారించుకుని వచ్చింది. ఆమె పెద్దక్క పెళ్ళికి కొన్న పట్టు దుపట్టాను వేసుకుంది. దానిమీద కూర్చిన అభ్రకం వెండిలాగా మెరుస్తోంది. ఆ సాయంత్రపు గాలికి మిఠాయిమీద అంటించిన వెండి కాగితం లాగా, ఆ దుపట్టా రెపరెప లాడుతోంది.

చీకట్లో కూడా మంగళ్ కళ్ళు టార్చిలాగా మెరుస్తున్నాయి. వంటచెరుకు కోసం కొట్టుకుపోగా మిగిలిన కొయ్యదుంగ మీద ఒక కాలూన్చి బరువైన గొంతుతో "సలామతే!" అన్నాడు.

"ఊఁ"

"ఇలారా"

సలామత్ కూర్చున చోటునుంచి లేచి అతనికి దగ్గరగా వెళ్ళింది.

"పైనున్న దుపట్టా తీసెయి"— ఆజ్ఞాపించాడు.

సలామత్ దుపట్టా తీసి పక్కన పెట్టింది.

"నీ చొక్కా కూడా తీసేయి."

సలామత్ చొక్కాని కూడా తీసేసింది. ఎటువంటి యువతికైనా ఆ పని ఎంతో కఠినమైనది. అయినా ఆమె అతని ఆజ్ఞని పాటించింది. ఆ సమయంలో ఆమెకి సొంత ఇష్టం అంటూ లేదు. తన గుండెల్ని దాచుకుంటూ చేతులు అడ్డంగా పెట్టుకుని సిగ్గుతో తల దించుకుంది. దూరంగావున్న నూనె దీపపు మసక వెలుతుర్లో, మంగళ్ ఆమెలో తాను చూడదలుచు కున్నది చూశాడు. సలామత్ ఏమైనా అనేలోగానే అదే బరువైన స్వరంతో "నీ వాహ్యాళి అయింది, ఇంక నువ్వు ఇంటికి వెళ్ళవచ్చు" అన్నాడు మంగళ్.

అతని ప్రవర్తనకి శిలగా మారిపోయిన సలామత్ చొక్కాలోంచి కంగారుగా తలని దూర్చి, దుపట్టా తీసుకుని, భుజంమీద నుంచి కంగారుగా మాటిమాటికీ చూస్తూ ఇంటికి పరుగెత్తుకు వెళ్ళిపోయింది.

అటువైపు పోతున్న వ్యక్తి ఒకడు, నిశ్శబ్దాన్ని భంగపరచడానికా అన్నట్లు "ఎవరక్కడ?" అని గట్టిగా అన్నాడు.

సహనం కోల్పోయిన మంగళ్ "కుక్కల కొడుకా! నీ దారిన నువ్వు పో" అని గట్టిగా అరిచాడు. ఆ వ్యక్తి ప్రమాదాన్ని పసికట్టి, గ్రామంవైపు పరిగెత్తాడు. ఆలోచనల్లో మునిగిపోయి, అక్కడే కొంచెంసేపు తచ్చాడాడు మంగళ్.

కొంచెంసేపాగి, ఎడమ చేతిని కొరడా ఝుళిపించినట్లు గాలిలో ఝాడించి ఊరి చివరగావున్న సలామత్ ఇంటి వైపు బయలు దేరాడు. అక్కడ చెప్పులు కుట్టేవాళ్ళు, చాకల వాళ్ళు, తక్కువ వృత్తుల వాళ్ళు పేడకుప్పల మధ్య, మురికి కాలవల మధ్య నివసిస్తుంటారు.



ఊరి పెద్దలు పెట్టిన ముహూర్తపు రోజు రానే వచ్చింది. పూరూ, చన్నో, విద్య కలసి రాణో అరచేతులకు గోరింటాకు పెట్టడం మొదలు పెట్టారు. ఆమె తల దువ్వి పాపిటతీసి జుట్టుని బన్‌గా చుట్టారు. వాళ్ళంతా ఎన్నో హామీలిచ్చి ఎంతో లాలించినా, రాణో భయంతో నిరంతరాయంగా ఏడవసాగింది.

జరుగుతున్న దేమిటో కవల పిల్లలకు అర్థం కాలేదు. వాళ్ళమ్మకి ఏమి చేస్తున్నారాని ఆశ్చర్యపోసాగారు. వద్ది తన చేతిని చిట్టి తమ్ముళ్ళమీద వేసింది. కాని వాళ్ళని లాలించే ప్రయత్నంలో మరింత కంగారు పెట్టింది. కొంతసేపు తర్వాత, ముందు అనుకున్నట్లుగా పిల్లలందర్నీ చన్నో పిన్ని ఇంటికి పంపించేశారు.

ఇంటిముందు ఆవరణలో కొన్ని కుండలుంచారు. వాటిపైన కొద్దిగా మాసిన తెల్లని గుడ్డని ఎత్తుగా కట్టారు. దాని కొసలని వేపచెట్టుకి, ఫాన్‌లైట్‌కి వున్న ఇనప కడ్డీలకి మధ్య సాగదీసి కట్టారు. కుండల పక్కనే ఒక పాత రాచిప్పలో కుంకుమని నిండుగా పోశారు. ఆ తెల్లని గుడ్డ కింద రాణోని కూర్చుండ బెట్టారు. ఆమెను తీసుకునిపోయి పీటమీద కూర్చోబెట్టగానే, ఆమె పైకి చూస్తూ "ఓ... చనిపోయిన పెద్దల్లారా! మీ రాణోకి ఏం చేస్తున్నారో చూడండి" అంటూ ఎలుగెత్తి ఏడవసాగింది.

"పెండ్లి కుమారుడు ఎక్కడ?"— పురోహితుడు గట్టిగా అడిగాడు. పండిట్ గ్యాన్‌చంద్, కేసర్‌సింగ్, మిగిలినవారూ మంగళ్ కోసం నలువైపులా చూశారు. వాళ్ళు అంతకుముందు మంగళ్‌ని ఈడ్చుకొచ్చి, అతని చేతుల్ని మంచం కాళ్ళకేసి కట్టారు. అతన్ని చూడడానికి వెళ్ళిన కరందీన్ కంగారుగా తిరిగివచ్చి "మంగళ్ అక్కడ లేడు" అని చెప్పాడు.

ఉత్తర దిశనుంచి గాలి గట్టిగా వీచింది. ఆ గాలికి కట్టిన గుడ్డ విపరీతంగా రెపరెప లాడింది. ఆ గుడ్డకి ప్రేలాడదీసిన కొయ్య చిలుకలు కిరకిర లాడాయి.

"ఆ వెధవ సంగతి నాకు తెలుసు. వాడి జాతే అటువంటిది" బాధగా నిట్టూరుస్తూ అన్నాడు హజూర్‌సింగ్.

"ముదనష్టపు వెధవ-ఈ ముసిలిదానికి ఇతరుల వ్యవహారాల్లో తల దూర్చడం తప్ప వేరే పనేమీ లేదనుకున్నాడు కాబోలు" అంటూ బుసలు కొట్టింది జిందాన్. ఆవరణలో జేరిన జనం వంక నీళ్ళు నిండిన కళ్ళతో చూసింది. ఈ విపత్తు జరుగుతుందని ఆమె ఊహించలేదు. చూపు తగ్గిన ఆమె మసక కళ్ళ ముందు హత్య కావించబడిన ఆమె కుమారుని ఆకారం కనిపించింది.

"పంతులు గారూ... ఒక్క నిమిషం ఆగండి. ఆ గాడిద కొడుకును లాక్కొని వస్తాను" అని గ్రామ పెద్ద బయలుదేర బోయాడు.

"నేను కూడా నీతో వస్తాను"- కేసర్ సింగ్ ముందుకు వచ్చాడు.

"మనందరం కలిసి వెతుకుదాం పదండి"- జగ్గూ సూచించాడు.

"ఏం మనిషని. మనం చావకొట్టి ఒప్పించిన తరువాత మళ్ళీ పారిపోడానికి వీడి కెంత ధైర్యం"

గ్రామస్థులు అంతకుముందు మంగళ్ బుర్ర చెడకొట్టి దారికి తేవడానికి చాలా శ్రమపడ్డారు. అవసరమైతే అతని ఎముకలు కూడా విరక్కొట్టి కదలకుండా కూర్చో పెట్టాలని వాళ్ళు నిశ్చయించుకున్నారు. అరడజను మంది వెదురు బొంగులు, కత్తులు పుచ్చుకుని అతన్ని వెతకడానికి బయలుదేరారు. న్యాయాన్ని రక్షిస్తున్న వాడిలాగా నటిస్తూ గ్యాన్‌చంద్ వాళ్ళని వద్దని అంటూ తాను వెనకగా నిలుచుండిపోయాడు. ఆడవాళ్ళు మాత్రం ఆవరణలో ఉండిపోయారు. వాళ్ళలో మంగళ్ పుట్టినప్పుడు పురుడుపోసిన వాళ్లు కూడా ఉన్నారు.

ఆయుధాలు పుచ్చుకుని మగవారు బయటకు పోతూంటే, రాణో గుండెలు బాదుకుంటూ ఏడవసాగింది. "నన్ను పోనివ్వండి. దేవుడి ముఖం చూసి నన్ను విడిచిపెట్టండి. ఈ పెళ్లి నా ప్రాణం తీస్తుంది" అంటూ రోదిస్తూ మూర్ఛపోయింది. పెళ్ళికి వచ్చిన అమ్మలక్కలు కుండల లోని నీళ్ల దోసిళ్ళలో తీసుకుని, రాణో నోట్లో కొన్ని పోసి, ముఖం మీద చల్లసాగారు. కొద్ది రోజుల క్రితం రాణో తన వైధవ్యాన్ని చూసుకున్నట్లే ఇప్పుడు పునర్వివాహాన్ని కూడా చూసుకోవాలని ఆమెకి తెలివి తెప్పించే ప్రయత్నం గట్టిగా చేయసాగారు వాళ్ళు.

ప్రత్తి పొలంలో దాక్కొని వున్న మంగళ్ అతన్ని వెతకడానికి వచ్చిన వారి కంటపడ్డాడు. అంతకుముందు వాళ్ళ చేతుల్లో తిన్న దెబ్బల్తో అతని చిత్తస్థైర్యం పోయింది. మళ్ళీ రెండోసారి చావు దెబ్బలు తినవలసి వస్తుందేమోనన్న ఆలోచనతో అతని ముఖం పాలిపోయింది.

నిజానికి పారిపోదలుచుకున్నవాడు తన జట్కా తీసుకుని రోడ్డెక్కి వెళ్ళిపోయుంటే సరిపోయేది. అటువంటిది తన గ్రామంలోనే, నలుగురి కంటా పడేచోట దాక్కోవటం తెలివితక్కువే అనాలి.

మంగళ్ తన స్నేహితులు తనని ఆదుకోడానికి వస్తారని ఆశించాడు. కాని వాళ్ళుకూడా నిర్దయులై ఆ గ్రామ పెద్దలతో చేతులు కలుపుతారని ఊహించలేదు. పైగా వాళ్ళొచ్చి అతనికి నీతులు చెప్పడం మొదలుపెట్టారు-"జరిగిందేదో జరిగింది. ఇదేదో చావు బ్రతుకుల సమస్యలాగ బాధపడ్తావెందుకు ? నువ్వు ఎదుర్కోవలసింది కేవలం ఒక్క ఆడదాన్ని" అంటూ.

మంగళ్ దాక్కున్న ప్రదేశానికి కొంచెం దూరంలో ఒక బావి ఉంది. దాని సమీపంలోనే తిలోక హత్య కావింపబడ్డాడు. ఆ సాయంత్రం సూర్యుని అరుణ కిరణాలు వేప ఆకుల మీద నెత్తురు కురిపిస్తున్నట్టుగా అనిపిస్తోంది. అక్కడి నేల ఇంకా నెత్తుటి వాసన కొడ్తున్నట్లనిపిస్తోంది.

ఆ ప్రత్తి పొలంలో మంగళ్ బాగా చీకటిగా వున్న మూలలో నక్కాడు. గ్రామస్థుల్ని చూసేసరికి భయంతో వివ

ర్ణమై పోయిన ముఖంతో తొంగి తొంగి చూడసాగాడు. చలికాలంలో పొలాల్లోకి తోడేళ్ళు, అడివి పందులు తరుచు వస్తుం టాయి. గ్రామస్థులు వాటిని చుట్టుముట్టి కర్రలతోనూ, బల్లాలతోనూ కొట్టి చంపు తారు.

గ్రామస్థులు వచ్చి మంగళ్ ముందు లైన్‌గా నిలబడ్డారు. మంగళ్ రెండు చేతుల్నీ నేలకానించి, వాటి మధ్య తల వుంచి భయం భయంగా వారి వంక చూడ సాగాడు. అతన్ని చూస్తూంటే ఏటి ఒడ్డున అడవి ఎలుగు కూర్చున్నట్లనిపిస్తోంది. అతని దగ్గర ఏ ఆయుధాలూ లేవు. వాళ్ళ కయితే చేతుల్లో కర్రలున్నాయి. మొదటి సారి వాళ్ళు అతన్ని చావకొట్టినపుడు, ఆ గందరగోళం పొరుగూరికి కూడా వినిపిం చింది. ఇప్పుడు వాళ్ల నిశ్శబ్దంగా అతన్ని కొట్టడానికి ఆయత్త మవు తున్నారు. ఒకరివంక ఒకరు, మొదలు పెట్టమని చెప్పే సంజ్ఞ కోసం ఎదురు చూస్తున్నారు. వాళ్లు అతని వంక కోపంగా చూస్తూ, ఎవరు ముందుగా దెబ్బ వేస్తారా అని చూస్తున్నారు. దాడి మొదలైతే మంగళ్ ఎటునుంచి పారిపోతాడా అని ఆలోచిస్తున్నారు.

మంగళ్ నాడి వేగంగా కొట్టుకో సాగింది. ఆవేశంతో గ్రామస్థుల గుండెలు కూడా వేగంగా కొట్టుకో సాగాయి. మంగళ్‌కి తొడ పట్టినట్లయి పక్కకు తిర గాలనుకున్నాడు. అతను కదిలాడో లేదో, జనం మూకుమ్మడిగా అతని మీద పడ్డారు. ఏ మాత్రం ఆలోచన లేకుండా అతని ముందున్న నేల మీద కర్రలతో మోదడం మొదలుపెట్టారు. దాంతో మేఘాల లాగా దుమ్ము పైకి లేచింది. అంతలో మొదలెట్టినంత ఆకస్మికంగానూ నేలని బాదడం ఆపేశారు. వేటగాళ్ళు, వేటాడబడుతున్నవాడూ పరస్పరం మౌనంగా చూసుకున్నారు. మంగళ్ స్నేహితుడు, గురుదాస్ ముందుకు వచ్చి "వీడు ఏపాటి గట్టివాడో నేను చూస్తాను" అన్నాడు. మంగళ్ లేచి నుంచొని ఆ వలయాన్ని ఛేదించుకుని బయటకు పోవా లని ప్రయత్నం చేశాడు. దాంతో వెంటనే వాళ్ళంతా అతని మీద పడ్డారు. కర్రలు ఉన్నవాళ్ళు కర్రలని ఉపయోగించారు. అవి లేనివాళ్ళు చెప్పులను వాడసాగారు. మంగళ్, తాను గట్టిగా ఎదురు తిరిగితే, అక్కడివాళ్ళు కత్తులు కూడా తీస్తారని భయపడ్డాడు.

మంగళ్ స్తబ్ధంగా ఉండడంతో, వాళ్ళు పొడవాటి అతని జుట్టుని పట్టుకుని ఈడ్చు కుంటూ, తన్నుకుంటూ, తోసుకుంటూ పొలాలలో నుంచి కాలిబాట మీదుగా లాక్కుపోసాగారు. సిక్కులు తమ తల నీలాలని చాలా పవిత్రంగా చూస్తారు. గ్రామంలోని ఏసిక్కు జుట్టుకి అవమానం కలగకుండా చూసే బాధ్యత గ్రామ పెద్దలమీద ఉంది. అటువంటిది ఈరోజున మంగళ్‌కి జరుగుతున్న అవమానాలికి నాయకత్వం వహించడమేకాక, ఆ దృశ్యాన్ని చూసి ఆనందించింది ఈ పెద్దలే. ఇంక లాభం లేదనుకుని తన జుట్టు పట్టుకుని ఈడ్చుకుపోవడం నుంచి తప్పించుకోడానికిగాను, తనకి తానుగా రావడానికి ఒప్పుకున్నాడు మంగళ్. నీళ్ళ తొట్టి దగ్గరికి రావడానికి మొరాయించే గాడిదవలె మంగళ్ ఉన్నచోటే పాతుకు పోయాడు. దాంతో మళ్ళీ కొట్టడం, తన్నడం, తోయడం మొదలయ్యాయి. ఆ కుమ్ములాటలో అతని బట్టలు చిరిగి

పోయాయి. పొడుగైన జుట్టు, గడ్డం చూదిపింజలతో చుట్టుకుపోయాయి.

ఊరి చెరువు పక్కన వున్న గుడి దగ్గరికి వచ్చేసరికి మంగళ్ వెంట వస్తున్న గుంపు ఒక చిన్నపాటి ఊరేగింపుగా మారింది. దారివెంట పోయేవారంతా ఈ వింత చూడడానికి అందులో జేరసాగారు.

మసకగా వున్న ఆ సంధ్యాకాంతులలో నైనాదేవి గుడి శిఖరం ఇంకా కనిపిస్తూనే ఉంది. అది నైనాదేవికి అంకితమైన పౌర్ణమి రాత్రి. అమ్మవారి గుడికి ప్రదక్షిణంచేస్తున్న భక్తులు మృదంగాలతోనూ, తాళాలతోనూ సంకీర్తనం చేస్తున్నారు.

పాపులము కాపాడు అంబ మాయమ్మ
ముక్తి మాకియ్య సమయ మిదేనమ్మా

ఆ భక్తులు ఊరిలో ఊరేగింపు వల్ల లేచిన దుమ్ముని గమనించే ఉంటారు. అది చూసి తిరిగి తమ సంకీర్తనంలో మునిగిపోయుంటారు. ఊరి రోడ్లమీదున్న గోతుల్ని పూడ్చి మట్టం చేస్తున్నారు. ఒక్కగుంట తప్ప గోతులన్నీ పూడాయి. అయోమయంగా నడుస్తున్న మంగళ్ ఆ గోతిలో పడి స్పృహ కోల్పోయాడు.

రోడ్డుకి వారగా వున్న ఆ గోతిని నీటిని నిలువ చేయడం కోసం జీలం కుటుంబం త్రవ్వింది. ఆ నీటితో వాళ్లు కాయగూరలు పండించేవారు. ఆ కారణం చేతనే జీలం ఆకుమళ్లు వేసవిలో కూడా పచ్చగా వుండి, కాయగూరలు తాజాగా ఉండేవి. ఆ గోతి పక్కనే వున్న సరుగు చెట్టు, మందమైన నీడ క్రింద ఎందరో బాటసారులు అలసట తీర్చుకుంటారు. దాని ఆకుల నుంచి వచ్చే ఈలపాట అలిసి పోయిన మనసులకి జోల పాడుతున్నట్లుంటుంది. ఆ అరైన్ కుటుంబం వాళ్లు గోతిలోని నీరు పొర్లిపోకుండా అడ్డు కట్ట వేశారు. మంగళ్ ఆ గోతిలో పడడంతో అడ్డుకట్టకి గండిపడి నీళ్ళు పొర్లిపోసాగాయి. గోతిలోంచి మంగళ్‌ని పైకి లేవదీసేలోగానే అతని బట్టలు పూర్తిగా తడిసిపోయి, ఒంటిమీద బురద, పెంట పొరలాగా అంటుకుపోయాయి. మంగళ్ వాళ్ళనుంచి విడిపించుకు పోవాలని చూశాడు. కాని అతను ఒక్కడూ పదిమంది బలిష్ఠ యువకుల పట్టునుంచి ఎలా తప్పించుకోగలడు? మంగళ్ చేసేదిలేక వాళ్ళవెంట తూలుతూ పేలుతూ నడిచే త్రాగుబోతులాగ వెళ్ళాడు.

మంగళ్ నిజంగా అపురూపమైన పెళ్ళికొడుకు. తలమీద పాగా లేదు. జుట్టంతా రేగిపోయి ముఖంమీద పడింది. అతని పిడికిలిలోకి వాళ్ళు సిక్కుల ఆచారం ప్రకారం బలవంతాన కత్తిని దోపారు. పూల కుచ్చుతో చేసే 'సెహ్రా' బదులు తలమీద చూదిపింజలూ, ముళ్లూ ఉన్నాయి. ముఖానికి కుంకుమకు బదులు బురద ఉంది. అతని కళ్ళలో ప్రేమకి బదులు కసి, నిరాశ, ఓటమి కనిపిస్తున్నాయి. ఇంకా పరివారం చూసుకుంటే పార్వతిని పెళ్ళాడడానికి పరమశివుడు తరలివెళ్తున్నట్లుగా, రకరకాల గ్రామీణులు అతని వెంట ఉన్నారు. శివునికైతే మెళ్ళో రుద్రాక్షమాలతో పాటు పాము, నోటి దగ్గర గంజాయి పాత్ర, నడుముకి బిగించిన గోచీ, కూర్చోడానికి లేడితోలు, చేతిలో త్రిశూలం, ఇంక వెంట కోతులు, పెద్దపులులు, చిరుత పులులు, ఏనుగులు ఇవన్నీ పరివారం. పాపం మంగళ్‌కి? మంగళకరమైన షహనాయి వాయిద్యానికి బదులు ఈగల, దోమల మోత. చెవులు చిల్లులు చేసే పిండిమర రొద.

మంగళ్‌ని పెళ్ళిపీటమీద కూర్చోపెట్టి

నప్పుడు, అతని ఒంటిమీది గాయాల
నుంచి రక్తం కారుతోంది. రాణో అప
స్మారకంలోనే ఉంది. అయితే ఊరి అమ్మ
లక్కలకి మాత్రం అంతా సవ్యంగానే
జరుగుతుందనే నమ్మకం ఉంది. తెల్లబట్ట
కింద చేసే పెళ్ళితంతు ఏమంత ఎక్కువ
కాలం తీసుకునేదికాదు- పెద్దగా హడావుడి
ఉన్నదీకాదు. పెళ్ళి పెద్దలు అంతా యథా
విధిగా జరిపించారు. మామూలుగా అయితే
పెళ్ళికొడుకు. పెండ్లికుమార్తె ఇంటికివెళ్ళి
పెళ్లి చేసుకుంటాడు. కాని ఇక్కడ పెళ్లి
కూతురి ఇల్లూ, పెండ్లికుమారుని ఇల్లూ
ఒకటే కావడంతో, అక్కడ జేరిన ఆడ
వారు రెండువర్గాలుగా ఏర్పడడానికి నిశ్చ
యించుకున్నారు. పూరణ్ దేవి, విద్య మరి
కొందరు రాణో పుట్టింటి తరఫు వార
య్యారు. జిందాన్, చన్నో, సరూపో,
చండీ, సుర్మా పెండ్లికుమారుని తరఫు
వారయ్యారు.

ఉభయ వర్గాలూ ఎదురు బదురుగా
వరుసల్లో కూర్చున్నారు. పెళ్ళికొడుకు
తరఫున జిందాన్ ముందుగా పాట అందు
కుంది.

చిట్టి చిట్టి చినుకులు
పెద్ద వానను కురుస్తాయి
కొడుకు పెళ్లి చూసుకునే
తల్లి కళ్లు మెరుస్తాయి.

జిందాన్ భావయుక్తంగా చన్నో,
సరూపో, సుర్మాల వైపు చూసింది. వాళ్లు
బృందంగా పాట పాడారు.

వధువు ఇంటికి వెళ్తోంది నీ వెక్కిన
గుర్రం
దాని ముందున్న నీ అక్క ధన్యు
రాలు
నీ కళ్ళకి కాటుక పెట్టిన
నీ వదిన మరీ ధన్యురాలు
నీ తండ్రి తేవాలి గోనెడు బంగారం

వద్దీ ఏం జరుగుతుందో చూడడానికి
ఇంటిపైకి వచ్చింది. ఆమె వెంట చిట్టి
తమ్ముళ్ళు కూడా వచ్చారు. వమ్ముకూడా
పెళ్లి చూడాలనుకునేసరికి వద్దీ వాడి లెంప
మీద సాచికొట్టింది. తానుమాత్రం ఆ
తంతుని చూడాలనే కోరికని ఆపుకోలేక
పోయింది. చన్నో ఇంటిపైకి బాగా
ముందుకి వచ్చి పెళ్లి చూడసాగింది. వెన
కాలే తమ్ములుకూడా వచ్చారు. పిల్లలంతా
తమ తల్లి పెళ్లి చూశారు.

మొదట్లో వద్దీ బాధతో కన్నీరు
కార్చింది. అంతలోనే ఆమె ఆవేదనని
ఆమెలోని కుర్రతనపు కుతూహలం అధిగ
మించింది. ఆమె తన విచారాన్ని మరిచి
పోయి క్రిందికి దిగివచ్చి పెళ్లివారిలో
కలిసిపోయింది.

విద్య మిగతావారిని చూసి "అమ్మా
యిలూ! మీరుకూడా పాడండి" అని అరి
చింది. వాళ్లు మెడలు సాచుకుని తమకి
వచ్చిన విధంగా పాట మొదలుపెట్టారు.

గ్రామ పెద్దలు కూడా "పాడండి
అమ్మాయిలూ, పాడండి" అంటూ ఉత్సాహ
పర్చారు.

రాణో అసహాయంగా తనచుట్టూవున్న
ఆడవారి వంకా, మగవారివంకాచూస్తూండి
పోయింది. విద్య, సంప్రదాయంగా వచ్చే
ఒక పాటలోని చరణాన్ని అందుకుని,
అందులోని మాటలను సందర్భానికి సరి
పోయేటట్లు మార్చింది.

నీ గుర్రం తినాలి బంగారు గుగిళ్లు
చిట్టి నా తండ్రీ,
బంగారు నిండాలి నీ తండ్రి గోనెల్లు
చిట్టి నా తండ్రీ
నీ అక్కరావాలి నీ పెళ్లి గుర్రం

ముందు
నీ పెళ్ళినాడు చేయాలి అందరికీ
కనుల విందు.

ఇప్పుడు పాటతో సమాధానం చెప్పడం ఆడపెళ్లి వారి వంతు

ప్రియమైన మా నాన్న నిదుర
పోకయ్యా
నీ కూతురి కోరిక తీర్చరావయ్యా
కోరింది ఆ పిల్ల మారాజువంటి పెళ్లి
కుమారుని
కోరింది ఆ పిల్ల అపర స్వర్గమైన
చక్కని ఇంటిని
లేవయ్యా, లేచి నీ కూతురి భర్తని
వెతకవయ్యా.

అక్కడున్నవాళ్ళలో ఎవరో నోటికి చేతిని అడ్డం పెట్టుకుని డప్పు వాయిస్తున్న శబ్దాన్ని చేయసాగారు. దాని అర్థం మగ పెళ్ళివారు వచ్చారన్నమాట. ఇక వివాహ తంతులో అతి ముఖ్యమైనఘట్టం వచ్చింది. ఆడ కాని, మగ కాని ముసలివారు కాని, పడుచువారు కాని, ఎవరెవరు ఎక్కడున్నా, ప్రాంగణంలో వున్నా, పిట్ట గోడమీదున్నా డాబామీదున్నా, చెట్టు కొమ్మల్లో కూర్చున్నా ఏకాగ్ర చిత్తంతో వుండిపోయారు. పూరణ్‌దేవి, ఆమె నోటి దూల స్నేహితురాలు విద్య మగపెళ్లి వారికి ఎదురెళ్లి "కోతులు, పందులు లంజకొడుకులు" అంటూ తిట్లవర్షం కురిపించ మొదలుపెట్టారు. ఆ స్త్రీలు ఈ తిట్లు తిట్టేటప్పుడు మధ్య మధ్య వారి భర్తల వంక వ్రేలితో చూపసాగారు. ఇదంతా సరదాకోసమే. ఆ తిట్లు వింటూ అందరూ పగలబడి నవ్వసాగారు. కొంచెంసేపటికి ఆ స్త్రీలు నృత్యం మొదలు పెట్టారు. ఆమె, విద్య పోటాపోటీగా బూతు పాటలు పాడారు. మిగతా వారందరూ కూడా ఆట, పాటల్లో కలిశారు.

మగవారుకూడా వయోభేదం లేకుండా అందరూ నవ్వుల్లో, ఆటల్లో కలిశారు. మగవారు ఆడపిల్లల జడలు పుచ్చుకు లాగారు. పరిచయం లేని అమ్మాయిలకి కూడా నడుంచుట్టూ చేతులు వేశారు. వాటిని ఎవరూ తప్పుపట్టుకున్నది లేదు. బ్రాహ్మణస్త్రీ పూరణ్‌దేవి, మహమ్మదీయుడైన జమాల్ చేతుల్లోపడి, మూర్ఛపోయినట్లు నటించింది. విద్యా, సరూపో ఒకరినొకరు చుట్టేసుకున్నారు. ఎవరోకాని పద్దని గట్టిగా ఓ తోపు తోసేసరికి. ఆమె వెళ్ళి గ్యాన్‌చంద్ ఒళ్ళో పడింది. ఆయన ఆ అమ్మాయిని ఆపేక్షగా తన కౌగిట్లోకి తీసుకున్నాడు.

వివాహవేదిక వద్దనున్న తెల్ల బట్టని తీసేశారు. పెళ్ళితంతు పూర్తి అయింది. అందరూ మౌనంగా లేచి నుంచున్నారు. ఇంక పెళ్ళికూతురు పల్లకీ ఎక్కి అత్తవారింటికి వెళ్ళాలి.

అటుతర్వాత పెళ్ళికూతురు ముఖం చూపించే తంతు పూర్తి అయింది. ఆపైన వాళ్ళు రాణోని, మంగళ్‌నీ గదిలోకి తోసి బయట గొళ్ళెం పెట్టారు.

ఆ ప్రథమ రాత్రి రాణో మంగళ్ గాయాలకు మందురాస్తూ గడిపింది. ఆ సమయంలో ఆమె అతని సోదరిగా, తల్లిగా, భార్యగా అన్నీ ఒకరిలోనే వున్నట్లు ప్రవర్తించింది. ఆమె గది బయటకిపోయి వంటింట్లోకి వెళ్ళే అవకాశం లేనందువల్ల, తన దుపట్టాని నోటి ఆవిరితో వెచ్చజేసి అతని గాయాలకు కాపు వేయడం మొదలు పెట్టింది. మంగళ్ మూలుగుతూనే ఉన్నాడు. నెప్పి తగ్గినప్పుడు తనని ఆప్యాయంగా నిమురు

తూన్న మృదువైన హస్తాల స్పర్శని గురించి ఆలోచించసాగాడు. రాణో అర చేతులకున్న గోరింట ఎరుపు చీకట్లో కూడా మెరుస్తోంది. చలికాల ప్రారంభంలో నిమ్మపూల మీద నుంచి వచ్చే సుగంధ పరిమళం వంటి పరిమళం అతని నాసికా పుటాలకు తగిలింది.

రాణో తన పిల్లల ఉనికిని గురించి పూర్తిగా మరిచి పోయిందా? వాళ్ళని ఎవరు పడుకోబెట్టారు? వాళ్ళు నిద్రపోయే ముందు, ఎవరైనా వాళ్ళకి ఏమైనా పెట్టారా? మంగళ్ మస్తిష్కంలో చిన్నారి చమ్మో ముఖం మెదిలింది. వెను వెంటనే అది మాయం అయింది. ఏది ఏమైనా ఆ రోజు జరిగినది ఆ పసివాని ఊహకి అందనటువంటిది. అలాంటప్పుడు దానిని గురించి దిగులు పడడం ఎందుకు?

మంగళ్ పక్కకి ఒరిగాడు. అతనికి వీలుగా ఉండడం కోసం రాణో లేచి నుంచుంది. ఉన్నట్లుండి ఆమెకి బాగా దాహం వేసింది. కిటికీ తెరిచి మంచినీళ్ల ఇమ్మని తాను అడగలేదు. మంగళ్ కూడా లేచి చీకట్లో తచ్చాడసాగాడు. పట్టరాని కోపంతో, ఒంటిమీద మిగిలిన చొక్కా పీలికల్ని పూర్తిగా చింపేశాడు.

"నేను చచ్చిపోయుంటే బాగుండేది" రాణో, మంగళ్ వెనగ్గా కూర్చుని అంది.

"ఫో... పోయి చావు" - విసురుగా ఒక్కతోపు తోశాడు మంగళ్ ఆమెని.

ఇంక రాత్రి గడవడానికి నాలుగు ఝాములే ఉంది.

రాణో తన తలని మంగళ్ పాదాల మధ్య పెట్టి "ఇందులో నాకేమీ సంబంధం లేదన్న విషయం నీకు తెలుసు" అంటూ ఏడవసాగింది.

"అవును నాకు తెలుసు" అన్నాడు మంగళ్. అతనిలో పోట్లాడే ఓపిక కూడా లేదు. రాణో చేతిని తన చేతిలోకి తీసు కున్నాడు మంగళ్. చీకటిలో చూడడం అలవాటయిన అతని కళ్ళు ఆమెని చూడ గలిగాయి. రాణో తన చేతిని వెనక్కి తీసుకోలేదు. విధి తనకి ముడివేసిన ఈ వ్యక్తి, గుర్రం మీద కొరడా ఝుళిపించి నప్పుడు గుర్రాన్ని చేతితో లాగినట్లే తనని కూడా లాక్కోడు కదా అని ఆలో చించ సాగింది రాణో. బిగపట్టిన ఊపి రితో ఆమె అతని తదుపరి చర్యను గమ నించ సాగింది. మంగళ్ చేతులు వదు లయ్యాయి. ఇద్దరి చేతులూ విడిపోయాయి. తర్వాత ఇద్దరూ వేర్వేరు మంచాల మీద పడి నిద్రపోయారు.

జనం దృష్టిలో వివాహం అంటే ఒక సుదీర్ఘమైన ఆనంద రాత్రి. అంతకు మించి చాలామందికి వేరే అర్థం తెలీదు. ఎంతోమంది తమ అనుభవాలను మరచి పోతారు. దంపతుల హృదయాంతరా ళాల్లో, నిజమైన వివాహం కల్పించే ఆవేశం, సంతృప్తుల వల్ల కలిగే వెచ్చ దనంతో పోలిస్తే, ప్రథమ రాత్రి శయ్యా సుఖంలో కలిగే వెచ్చదనం తక్కువే. శారీరక సంభోగం నకిలీ సరుకు వంటిది. ఒక వ్యక్తిని దానశీలత గల లక్షాధి కారిగా భావించి, ఆత్మగౌరవం చంపుకుని చేయిచాచి దానం అడిగితే, ఆ వ్యక్తి చిల్లర డబ్బులు విసిరేస్తే, ఎంత అసం తృప్తి కలుగుతుందో, అలాగే మనసులో ఎంతో కోరిక వుండగా శారీరక సుఖం కల్పించే తృప్తి దాని ముందు ఎంతో తక్కువగా ఉండడంతో తీవ్రమైన అసం తృప్తి కలుగుతుంది.

వాళ్ళిద్దరూ తెల్లవారి నిద్ర లేచేసరికి, తలుపు బయట గడియ తీసేసి ఉంది.

మంగళ్ లేచి ముందుకు అడుగులు వేయబోయాడు. కాళ్లు పట్టేశాయి. ఒళ్ళంతా తగని నెప్పులు. లేవలేక తిరిగి మంచం మీద పడిపోయాడు. రాణో బయటకి పోయి, దొడ్డి వాకిట్లో వున్న జిందాన్ దగ్గరికి వెళ్ళింది.

"బిడ్డా... ఏం కావాలి ?" జిందాన్ ప్రేమగా అడిగింది.

"సామాను గది తాళంచెవి ఇయ్యి"

"ఎందుకూ ?"

"పసుపు కావాలి. అతని ఒంటికి బాగా గాయాలు అయ్యాయి."

జిందాన్ తన దుపట్టా కొంగుకి కట్టి వున్న తాళం చెవుల గుత్తిని తీసి రాణోకి ఇచ్చింది. సామాన్ల గదికి వెళ్ళడానికి ముందు, వరండాలో నిద్రపోతున్న పిల్లల్ని చూడటానికి వెళ్ళింది ఆమె. అక్కడ చలి చలిగా ఉంది. ఒంటి మీద బట్ట సరిగ్గాలేని పిల్లలు, వెచ్చదనం కోసం ఒకరి డొక్కలో ఒకరు ముడుచుకుని పడుకున్నారు. రాణో వారిని వరుసగా ముద్దాడింది. వాళ్ళ ఒంటి మీద బట్టలు సరిచేసి, దుప్పటి కప్పింది. దాంతో పిల్లలు నిద్రలోనే కదిలి మళ్ళీ పడుకున్నారు. వద్దీ మాత్రం నిద్రపోలేదు. కళ్లు మూసుకుని ఉంది. ఆ అమ్మాయిని ముద్దాడటానికి రాణో ముందుకి వంగేసరికి, గోళ్ళతో, తల్లి ముఖాన్ని రక్కింది వద్దీ. "ఫో ఇక్కడినుంచి. పోయి ఆ వెధవతో నీ ముఖం మసి చేసుకో" అని కోపం కక్కుతూ తల్లి ముఖం మీద ఉమ్మేసింది.

అసలే రాణో మానసికంగా చిత్రవధని అనుభవిస్తోంది. అటువంటిది కూతురి ప్రవర్తన పుండుకి కారం రాచినట్లయింది. పైగా అసలు పిల్లల కోసమే తాను, మంగళ్‌ని వివాహమాడటానికి అయిష్టంగా ఒప్పుకుంది. తన అభిమానాన్ని, అవమానాన్ని, బాధని మనసులోనే దిగ్రమింగుకుని ఒక్కమాటేనా అనకుండా అక్కడి నుంచి వెళ్ళిపోయింది రాణో. పసుపుతో గంధం అరగదీసి వేడి పెనం మీద వేసింది. దానిని తీసుకుని మంగళ్‌కి రాయడానికి గదిలోకి వెళ్ళింది. కాని అప్పటికే అతను బయటకి వెళ్ళిపోయాడు. రాణో అతని కోసం బయటకి వచ్చింది. దొడ్లో కూడా లేడతను. దబ్బూ కుంయి కుంయి మంటూ, తోకాడించుకుంటూ ఆమె దగ్గరకి వచ్చింది. ఆమెకి సంతోషం కలిగించడానికన్నట్లు, తన ముందు కాళ్లు ఎత్తి ఆమెకి ఆనించింది. దానిని చూస్తుంటే "నీవు పడుతున్న బాధ నాకు తెలుసు. ఇదిపోయి మళ్ళీ అంతా సవ్యంగానే జరుగుతుంది" అని ఓదారుస్తున్నట్లుంది.

చన్నో ప్రతిరోజూ ఉదయాన్నే గుడికి వెళుంది. చలికాలంలో వణికే గొంతుతో బిగ్గరగా ఆమె చేసే ప్రార్థన దూరానికి కూడా వినిపిస్తుంది. ఆ ప్రొద్దున మాత్రం ఆమె గుడికి పోవడానికి బదులుగా, రాణోని చూడటానికి వచ్చింది. రాణో తలుపు దగ్గర నిలబడి ఉంది.

"రాణో... బాగున్నావుగా ? అంతా సవ్యంగానే జరిగిందనుకుంటున్నాను"

రాణో ఏమీ సమాధానం చెప్పలేదు.

"నేను నీ స్నేహితురాలిని. నాకు చెప్పడానికి జంకెందుకు ?"

అప్పటికీ రాణో మాట్లాడలేదు.

"ఏమిటిది ? నా కోసం ఏదో ఒకటి చెప్పు" చన్నో గట్టిగా అంది.

"రాత్రి ఏమైనా జరిగిందా ? అయ్...

పెదవులు అతికించేసుకున్నావా ఏమిటి ?"

రాణో నేల చూపులు చూసింది. ఆమె పెదవులు తడబడ్డాయి.

"లేదు. ఏమీలేదు" అంది అతి కష్టం మీద.

చన్నో రాణో ముఖంలోకి నిశితంగా చూసింది.

"నువ్వు అబద్ధం ఆడుతున్నావు. మరి ముఖం మీద ఆ గోటి రక్కులేమిటి ?"





రాణో చెక్కిలి మీంచి పెద్ద పెద్ద భాష్పాలు రాలసాగాయి. సిగ్గు, విచారం ఆమని బరువుగా నొక్కి వేశాయి. ఉన్న ట్లుండి చన్నో మీద విరుచుకు పడింది.

"నువ్వు దేన్ని గురించి మాట్లాడుతు న్నావో, అది నాకు అవసరం లేదు. అక్కా! నాక్కావలసిందల్లా నా మానాన్ని దాచుకునేందుకు కాస్తంత గుడ్డముక్క, నా ఆకలి తీరడానికి కాసిని చపాతీలు. దేవుడేం చేయదలిచాడో ఎవరికి తెలుసు ? మంగళ్ మళ్ళీ కనిపించకుండా పోయాడు" అంది.

"హాయ్ రామ్" అని ఆశ్చర్యపోయి చన్నో అప్పుడే వస్తున్న మసక వెలుతు లోకి కలయజూసింది.

"ఈ దౌర్భాగ్యుడు ఎక్కడికి పోయా డబ్బా ?" అని వెంటనే తాను అటువంటి భాష ఉపయోగించకూడదని గుర్తు తెచ్చు కుంది చన్నో. "నా నోరు మండిపోనూ. నీ యెదుట ఇటువంటి మాటలు మాట్లాడ కూడదమ్మా" అంది.

రాణో చిరునవ్వు నవ్వింది.

"అతని గురించి దిగులుపడకు రాణో. ఇప్పుడు ఎలా వెళ్ళాడో అలానే తిరిగి వస్తాడు" అంటూ ధైర్యం చెప్పింది చన్నో.

మధ్యాహ్నానికి మంగళ్ తిరిగి ఇంటికి వచ్చాడు. ఒక చొక్కా, తలపాగా, ఒక జత షోకు చెప్పులూ ఎనువు తెచ్చు కున్నాడు. గాయాలకి కట్లు కట్టించు కున్నాడు. ఇంటి వైద్యంలో అతనికి నమ్మకం లేదు. అందువల్ల జనరల్ హాస్పిటల్‌లో వైద్యం చేయించుకున్నాడు. ప్రొద్దుటి నుంచీ ఏమైనా ఎంగిలి పడ్డాడో లేదో దేవుడికే తెలియాలి. క్రితం రోజు తిన్నదైతే చావుదెబ్బలు.

రోజంతా మంగళ్ మంచం మీద పడుకుని వేళ్ళమధ్య పుల్లలు విరుస్తూ గడిపాడు. మధ్య మధ్య అతనికి ఈకంత తేలిక అయిపోయినట్లనిపిస్తోంది. అంతలోనే ప్రపంచం యొక్క బరువంతా తన భుజాలమీదనే పడినట్లనిపిస్తోంది. అసహనంగా లేచి కూర్చొని నేలమీదపిచ్చి గీతలు గీయడం, చెరిపివేయడం మొద లెట్టాడు. వేప చెట్టుమీద నల్లకాకి కర్ణ కఠోరంగా కూస్తోంది. కోపంతో చెయ్యెత్తి దాన్ని "ఉష్" అని తరిమాడు. చెట్టు కిందనుంచి బొచ్చుఊడిపోయిన చీడకుక్క అటు వచ్చేసరికి దానిని కొట్టినంత పని చేశాడు. ఆ మూల నుంచి అరడజను కుక్కలు ఒకదానితో ఒకటి పోట్లాడు కుంటూ వచ్చాయి. వాటిని తరిమి వచ్చాడు మంగళ్. కోపంతో, కసితో పళ్ళు పటపట కొరుకుతూ "ఈ ఊరిజనం చచ్చిపోయాక కుక్కలుగా పుట్టారంటే ఆశ్చర్యంలేదు" అన్నాడు.

దూరాన హిమాలయ పంక్తులు, ధవళ ధరంగా మెరుస్తూ కనిపిస్తున్నాయి. అవి కొన్నిచోట్ల కలుసుకుని మళ్ళీ చీలిపోతు న్నాయి. వాటికి అవతలి వైపున చరిత్ర కందని కాలం నుంచీ "నిరాశా ప్రదేశం" అని పిలువబడుతున్న ప్రాంతం వుంది. అక్కడ నదివల్ల వేరుచేయబడ్డ ఎదురు బదురు కొండలమీద ప్రేమికులు పరస్పరం చూసుకోగలగడమే కాని, కలుసుకోడం ఉండదుట. అందువల్లే జానపదులు ఈ విధంగా పాడుకుంటుంటారు.

కొండల్లో తిరిగేవారు పాపులు
వారి హృదయాలు కఠిన శిలలు
కనులు రోజూ కలుసుకుంటున్నా
దేహాలు మాత్రం వేరుగానే ఉంటాయి.

జరిగిన సంఘటనలన్నింటినీ నెమరు వేసుకోసాగాడు మంగళ్. భారంగా నిట్టూర్చి కూనిరాగాలు తీయసాగాడు.

నువు నాకు తీరని అపకారం చేశావు.
నా బాణాల్ని, అంబుల పొది నీ
దాచేశావు.
నేనే కనక స్వేచ్ఛగా ఉండిఉంటే
మీ అన్నల దేహాల్ని
ఒక్క బాణంతో చీల్చేవాడిని
మరొక్క బాణంతో
నీ ప్రియుని గుండెలో గుచ్చేవాడిని.

ఈ పాట మంగళ్ ఆవేదన్ని చల్లార్చ

లేకపోయింది. అందువల్ల మరో విషాద గీతాన్ని అందుకున్నాడు,

ఓ రాజా !

నువ్వు నా భర్తని ఎగరేసుకుపోతే
నీ గోరీ దగ్గర మేకని బలివేస్తాను
నా పొరిగింటివారి భార్యల్లో కొందర్ని చంపేయి
మిగిలిన వారికి రోగాలూ, రొష్టులూ రప్పించు
రక్షక భటులకి ఫిర్యాదు చేసే
గ్రామ పెద్దని ఓ గట్టిదెబ్బ కొట్టు
నిత్యం దీపం వెలిగే కోమటికొట్టుని
నిలువునా బూడిద చెయ్యి
రాత్రీ పగలూ కాపలాకాసే
ఫకీరు కుక్క గుటుక్కుమని చావనీ
నా ఇంటికి వచ్చే సందుల్ని ఖాళీకానీ
నా ప్రియుడు మీర్జాని నా ఇంటికి రానీ
భర్తలూ, భార్యలూ, గ్రామ పెద్దలూ
వ్యాపారస్థులూ, కుక్కలూ మొత్తంగా చావనీ
వారి బెడద లేకుండా నా ప్రియుడు నాదగ్గరకు రానీ.

మనస్సులోని ఆవేదనని పాటల రూపంలో బయట పెట్టేసరికి మంగళ్ మనసు కాస్తంత తేలిక పడింది. లేచివెళ్ళి తన మంచం మీద పడుకున్నాడు. చికాకు తగ్గడంతో మనస్సు కొంచెం శాంత పడింది.

రాణో త్వరత్వరగా వంట చేసింది చన్నో ఇంటినుంచి నెయ్యి తెచ్చింది. విధేయురాలైన భార్యలాగ చపాతీలకి నెయ్యిరాసి భర్తకి పెట్టింది. వెల్లుల్లిపాయ తీసి చపాతీలపైన రుద్ద బోతోంటే ఆమెకో ఆలోచన వచ్చింది. ఆ ఆలోచనతో ఆమె బుగ్గలు ఎరుపెక్కాయి. వెంటనే వెల్లుల్లిని పక్కకి పెట్టేసింది. వెల్లుల్లి కామోద్దీపనం చేస్తుందని ప్రతీతి.

ఇత్తడి పళ్ళెంలో చపాతీలని, కూరని పెట్టి వద్దీని పిలిచి మంగళ్ ముందు పెట్టి రమ్మంది.

వద్దీ ముక్కుపుటాలు విశాలమయ్యాయి. ఆమె భుజాలు ఎగరేస్తూ "చెప్పుల జతతో వడ్డిస్తాను" అంది.

రాణో వస్తున్న కన్నీటిని పట్టుబలవంతాన్న ఆపుకుంది. అదృష్టవశాత్తూ ఆ సమయానికి చమ్మూ అక్కడే ఉండడంతో కల్పించుకుని "ఆ పళ్ళెం ఇలా ఇయ్యి. నేను తీసుకు వెళ్తాను" అన్నాడు.

రాణో కొడుకువంక చూసింది. తన దీనావస్థని వాడు అర్థం చేసుకున్నాడా? లేదా అమాయకంగానే అడిగాడా? రాణోకి వాడిని తన కౌగిట్లో బిగించాలనే కోరిక బలంగా కలిగింది. ఆ బిగి కౌగిట్లో వాడిని తన దేహంలో భాగమయ్యేటట్లుగా గట్టిగా అదుముకోవాలని అనిపించింది. వాడు తనలో కరిగిపోతే ప్రపంచంలో నిత్యం కలుగుతుండే అవమానాలు తప్పుతాయని ఆశించింది. ఆ ఇత్తడి పళ్ళాన్ని చమ్మూముందు తోసి, వాడు దానిని తీసుకుని వెళ్ళాక కొంగు పళ్ళమధ్య కుక్కుకుని ఏడవసాగింది.

ఆ విధంగా ఎన్నో రోజులూ, నెలలూ గడిచాయి. మంగళ్ తన సంసార బాధ్యతలను గుర్తించాడు. ఎప్పుడో తప్ప రోజుకి ఐదు రూపాయలుపైనే ఇంటికి తెస్తున్నాడు. రాణోతో శారీరక సంబంధం కల్పించుకోక పోయినా, తన సంపాదనని తల్లికి బదులు ఆమెకే ఇస్తున్నాడు. దీని వల్ల రాణోకి ఒక పక్కన సంతోషం,

మరోపక్కన విచారం కలగసాగాయి. ఊరి అమ్మలక్కలు నిత్యమూ వారి వైవాహిక జీవితం గురించే ప్రశ్నిస్తుండడంతో, ఆమెలో భౌతిక వాంఛలు తలెత్తేవి. చన్నో, పూరణ్‌దేవి, విద్య, సరూపో అందరూ వేసేది ఒకటే ప్రశ్న. "అతనేమైనా చేశాడా?" అని.

ఈ ప్రశ్న వినీ వినీ విసుగెత్తిపోయింది రాణో. ఆమె చెయ్యగలిగిందల్లా ఒక్క ఘాటైన సమాధానం చెప్పడమే. "ఏదో నాకింత నీడ దొరికింది చాలు! ఇప్పుడు నన్నెవరూ నా ఇంటినుంచి గెంటలేరు. నా బిడ్డని ఎవరూ అమ్మలేరు. ఇంతకంటే నాకింకేం కావాలి?" అనేది.

అమ్మలక్కలు అంతటితో ఊరుకునేవారు కాదు. వాళ్ళు కందిరీగల వంటివారు. చుట్టూచేరి చెవిక్రింద రొద పెట్టేవారు. రాణో బొడ్డులో చెయ్యివేసి మరీ అడిగేవారు.

"మా దగ్గర అబద్ధాలు చెప్పకు. మీ ఇద్దరూ ఊరికే ఒకే మంచంలో పక్కపక్కన పడుకుంటారంటే మేమే నమ్మతామను కుంటున్నావా?" అంటూ.

"అవును. నేను చెప్పేది నిజం."

''నువ్వొక మంచంమీద, అతను వేరొక మంచంమీదానా?"

"అవును.''

"అయితే ఏం చెయ్యడానికి నీకు ధైర్యం లేదా?"

"లేదు.''

''ఏం? అతను నీ వాడు. అతను నిన్ను తన నీడలోకి తీసుకున్నాడు''

ఈ మాటలు వింటూ రాణోకి కన్నీటి పర్యంతం అయ్యేది.

''అతను నాకు మేలిముసుగు వేసినవాడైతే మాత్రమేం! నా దృష్టిలో పెళ్ళి కాక మునుపటికీ, ఇప్పటికీ అతని విషయంలో తేడా లేదు" అనేది.

ఆ మాటలు విని వాళ్ళు ఆశ్చర్యపోయారు. ''ఓసి! నీ ముఖం మాడా! ఈ మాటలు అనడానికి నీకు సిగులేదుటే! అసలు నీకు నిద్ర ఎలా పట్టుందే...?"

"అతనితో పెళ్ళి కాకముందు ఎలా నిద్ర పట్టేదో ఇప్పుడూ అలాగే."

''మరి అతనికో! ఏమీ చేయకుండానే నిద్ర పోతాడా?"

"అవును."

"అతను రాత్రుళ్ళు నిద్ర లేస్తుంటాడా? ఒళ్ళు విరుచుకుంటూ ఆవలిస్తుంటాడా?"

అమ్మలక్కలు ఒకళ్ళ పక్కలు ఒకళ్ళు పొడుచుకుంటూ పగలబడి నవ్వసాగారు. తర్వాత వాళ్ళు "నువ్వు చొరవ తీసుకుని ఏదో ఒకటి చేయకపోతే, అతగాడు నీకు దక్కకుండా పోగలడు" అని హెచ్చరిక చేశారు.

"నీకు కావాలంటే మంచి తాయెత్తు తీసుకువస్తాను" అంది ఒకామె.

"కావాలా అని అడిగేదేమిటి?తెచ్చేయి" అంది మరోకామె–

''నాకేమీ అవసరం లేదు. ప్రేమ మందులు, తాయెత్తులూ నా కక్కర లేదు" అని అరిచింది రాణో.

"తాయెతు కట్టుకోడానికి నువ్వు ఇష్టపడకపోతే, నీ జీవితమంతా కన్నీటితోనే గడపాల్సొంటుంది''— హెచ్చరించింది పూరణ్‌దేవి.

"నేనే కనక తాయెతు కట్టుకోకపోయుంటే, నాకు శంభు పుట్టేవాడే కాదు. నా భర్త నన్ను ఇంటినుంచి గెంటేసి ఉండేవాడు" అంది పూరణ్‌దేవి.

అక్కడున్న ఆడవాళ్లు నవ్వులతో

కిచ కిచ లాడారు. వాళ్లు నవ్వుతూంటే పత్తిపోలాల్లో కాయలు పగిలి పత్తి బయట పడ్డట్లు వాళ్ల పళ్లు బయటపడ్డాయి. చన్నో కళ్ళు చికిలిస్తూ "నువ్వు బాబాహరిదాస్‌తో ఎంత కాలం గడపాల్సివచ్చింది ?" అని అడిగింది.

పూరణ్‌దేవి ఆమె జుట్టు పట్టుకుని గుంజుతూ "ఇది చావుకి వచ్చింది" అంటూ అరవడం మొదలుపెట్టింది. కొంత సేపు వాళ్లిద్దరూ పోట్లాడుకున్నాక సలు గురూ వాళ్ళని విడిపించారు. తర్వాత అందరూ ఎవరి దారిన వారు వెళ్ళారు.

ఈలోగా టాంగా స్టాండ్ దగ్గర మంగళ్‌ని అతని దోస్తులు ఆట పట్టించడం మొదలుపెట్టారు. మంగళ్ ముఖం కోపంతో ఎరుపెక్కింది. తనకి తల్లితోనో, సోదరి తోనో అక్రమ సంబంధం అంటగట్టి నట్లుగా విపరీతమైన కోపం వచ్చిందతనికి. కాని దానిని లోలోపలే అణచుకుని మిన్న కున్నాడు. వాళ్ళ మాటలు విననట్లుగా గుర్రానికి బెల్టు బిగిస్తూ, దాని వీపుమీద తట్టసాగాడు.

గురుదాస్ విషయాన్ని మరికొంత ముందుకి తీసుకువెళ్లాడు. "నన్నడిగితే, అనుభవం వున్న స్త్రీతో గడపడంలో మహా మజా వుంది" అన్నాడు.

"ఏ రకమైన మజా ఏమిటి?" చర్చని కొనసాగించాలనే ఉద్దేశంతో ఎవరో రెచ్చ గొట్టారు.

"ఆ అనుభవం బాగా ఉన్నామెకు అందులోని కిటుకులు బాగా తెలుసుంటా యితే."

వాళ్లు పగలబడి నవ్వారు. కోపంతో కంపిస్తున్న మంగళ్ "లంజకొడకల్లారా ! మీ యమ్మ..." అంటూ లేచాడు.

వాళ్ళు మంగళ్ వంక మౌనంగా కోప దృక్కులతో చూడసాగారు. గురుదాస్ మాత్రం ధైర్యంచేసి మాట్లాడాడు. వాళ్లం దరిలోకీ అతనే బలిష్ఠుడు. అతనితో పోట్లాడమంటే ఎవరేనా ఒకటికి రెండు సార్లు ఆలోచించుకోవాలి. "ఒరేమంగళా ! నువ్వు రాణోని పెళ్ళాడింది, మీ అమ్మగా దత్తత చేసుకోడానికా ?" అన్నాడు.

మంగళ్ కోపంగా గురుదాస్ వంక చూశాడు. కాని మౌనంగా ఉండడమే మంచిదని ఊరుకున్నాడు. విషాద పరిస్థితి తొలగిపోయేసరికి, ఇస్మాయిల్ విష యాన్ని మార్చాడు. "ఓ సర్దార్జీ అణా కాసు నిప్పులో పడిపోయిందట" అని ఊరు కున్నాడు.

"మరేం చేశాడు ?" మంగళ్ వంక చూస్తూ అడిగాడు నవాబ్.

ఆ సమయంలో ఒకామె అటుపోతుంటే "అమ్మా...కోర్టుకి వెళ్ళాలా?" అని అడి గాడు నవాబ్.

"లేదన్నా" అని ఆమె బదులిచ్చి వెళ్లిపోయింది.

"ఆ...నిప్పులో పడిపోయిన అణాని సర్దారేం చేశాడు ?" అని అడిగాడు మళ్లీ.

"ఆ...చెప్తున్నాను. సర్దార్జీ ఆకాశం వైపు రెండు చేతులూ యెత్తి "అల్లా నా అణాకాసు కనిపించేటట్లు చేయి." అని ఎలుగెత్తి ఏడవసాగాడట".

ఆ దారిలోపోతున్న మహమ్మదీయుడు ఒకడు, సిక్కు మతస్థుడు అల్లానిగురించి ప్రార్థిస్తుండడంచూసి ఆశ్చర్యపోయాడట.

అతను "నువ్వు మీ గురునానక్ దయ కోసం ప్రార్థించక, మా అల్లాని ప్రార్థి స్తున్నావెందుకు?" అని అడిగాడట.

సిక్కు ఆ నిప్పుల వంక చూస్తూ "ఒక్క అణాకోసం నిప్పులోకి రమ్మని

మా గురువుని పిలిచేందుకు నేనేమైనా తెలివి తక్కువ వాడిననుకున్నావా ?" అని అన్నాడట.

ఆ కథ విని టాంగావాలాలు పగలబడి నవ్వుకుంటూ ఒకరి చేతులు ఒకరు చరుచుకోసాగారు. మంగళ్‌కి కూడా చిరునవ్వు వచ్చింది. ఆ నవ్వు చూసి ఇస్మాయిల్ ఇంక మాట్లాడ్డానికి లైసెన్స్‌దొరికినట్లు భావించాడు.

"మంగ్లా...సిక్కులకి మధ్యాహ్నం పన్నెండు గంటలకి మతిపోతూంటుందిట.. నిజమేనా ?" అని అడిగాడు.

"అవును. అది నిజమే."

"నిజంగా! అయితే నీకూ పన్నెండు గంటలకి మతి పోతుంటుందా ?"

"ఆహా ! నాకూను."

ఇస్మాయిల్ తనచేతిని మంగళ్ జుట్టుపై ముడిమీద ఉంచి "ఇక్కడఏదేనా వున్నట్లు నీ కనిపిస్తోందా ?" అని అడిగాడు.

"అవును-ఉన్నట్లనిపిస్తోంది" అన్నాడు మంగళ్.

అంతమాత్రపు హాస్యం ఇస్మాయిల్‌కు చాలలేదు. "మధ్యాహ్నం పన్నెండు గంటలకేనా, అర్ధరాత్రి పన్నెండు గంటలకి కూడానా నీకు మతితప్పుతుండేది ?" అని అడిగాడు.

"మధ్యాహ్నం సమయంలోనే. అసలైన సిక్కుకి మధ్యాహ్నం సమయంలో తీవ్రమైన ఎండ, పొడుగైన జుట్టు, తలపాగాల మూలంగా చిరాకెత్తుతుంది."

"మరి మన ఊళ్ళో వడ్రంగి బసాఖాసింగ్ ఉన్నాడుగా వాడు అర్ధరాత్రి వేళ రౌడీగా మారుతుంటాడు. మరి వాడికేమవుతుంటుంది ?"

"ఆ లంజకొడుకు ముస్లిం మతం నుంచి సిక్కు మతం పుచ్చుకున్నవాడై ఉండాలి"

అంతటితో ఇస్మాయిల్ నోటికి తాళం పడింది.




టాంగా స్టాండ్‌వద్ద వీళ్లిలాపగలబడినవ్వుకుంటున్నారు. అందరిలోకి మంగళ్ నవ్వు అతి పెద్దగా వినిపిస్తోంది. అటువైపు ఒక జంట వస్తుండేసరికి వాళ్ళ నవ్వులు ఆగిపోయాయి. అందరూ వాళ్ల మీద పడ్డారు. మరు నిమిషంలో ఆ స్త్రీ మూట నవాబ్ టాంగాలోకి వచ్చింది. ఆమె చెప్పులు మంగళ్ జట్కాలోకి వచ్చాయి. ఆమె గురుదాస్ చేతుల్లో ఇరుక్కుంది. పాపం ఆమె మొగుణ్ని మరో జట్కాలో కుదేశారు. వాళ్లంతా ఒకరినొకరు తిట్టుకోడం మొదలు పెట్టారు. చివరకి దంపతుల నిద్దర్నీ ఒక జట్కాలోకి జేర్చి పంపించారు.

ప్రస్తుతం మంగళ్‌కి స్త్రీల విషయంలో వున్న ఆసక్తి కేవలం ప్రయాణీకులుగానే. ఎప్పుడైనా ఏ అందాల భామైనా కంటపడితే నిర్లిప్తంగా ఆమె వంక చూసి 'ఇటువంటి వాళ్లు కూడా ఉంటారు కాబోలు' అని అనుకునేవాడు.

సలామత్ విషయం వేరు. ఆడవాళ్లనుకునే కబుర్ల ద్వారా మంగళ్‌కీ, రాణోకీ మధ్య ఎట్టి శారీరక సంబంధం ఏర్పడలేదని తెలుసుకుంది. దాంతో ఆమె మంగళ్ కంటపడేటప్పుడు మరింత కవ్వించేటట్లుగా బట్టలు వేసుకుని పయ్యె

రంగా అతని ముందు నడిచేది. పైకి ఆమె మంగళ్ వైపు ఎన్ని ప్రేమ దృక్కులు ప్రదర్శించినా లోలోపల మాత్రం అతని పట్ల కోపం, అసహ్యం ఉన్నాయి. మంగళ్‌ని నమ్మించి మోసపుచ్చి తనని అవమాన పరిచిన స్థలానికి రప్పించి తనని అవమానం చేసిన చోటనే అతని బట్టలు విప్పించి పగ తీర్చుకుంటానని ఒట్టుపెట్టుకుంది. అతను బట్టలు తీసేసి తన వైపు వస్తున్నప్పుడు గట్టిగా అరచి నలుగురినీ పిలిచి అవమానపరచాలని ఆమె పథకం వేసుకుంది. అటువంటి అవమానం జరిగితే ఎవరూ కూడా జన్మలో మరువలేరు. ఇప్పుడు అతనికి భార్య కూడా ఉండడం వల్ల అతని శేషజీవితమంతా, ఆమె అతన్ని దెప్పి పొడవడానికి అవకాశం ఏర్పడుతుంది.

ఒక రోజున జట్కా స్టాండు వద్ద మంగళ్, నవాబ్ కలుసుకున్నారు. ఇద్దరూ చేరి కొంచెం తాగారు. కాని మనసులో ఏదో బెదురు వున్నందువల్ల మంగళ్ దాని రుచిని ఆనందించలేక పోయాడు. అన్న బతికున్న రోజుల్లో అయితే తానొక్కడే ఒక సీసాను పట్టించేయ గలిగేవాడు. కాని ఇప్పుడు భయం లోపల గూడు కట్టుకుని నెమ్మది నెమ్మదిగా తినివేయ సాగింది. ఈ పరిస్థితిలో మరచి పోడానికి తాగటం మొదలుపెట్టాడు. దానివల్ల వచ్చే పరిణామాల గురించి భయపడుతున్నా తాగాలనే కోరుకున్నాడు.

రాణోది చాలా కుశాగ్ర బుద్ధి. భర్త నుదుటిమీది గీతలుచూసి మనోభావాన్ని పసి గట్టగల నేర్పరి ఆమె. అటువంటి స్త్రీలకి వారి భర్తలు విశ్వాస ఘాతుకంగా ప్రవర్తిస్తే, వారి మనసుకి తెలుస్తుంది. వారి కంఠ స్వరంబట్టి, వారి నడక తీరు బట్టికూడా భర్తల భావాల్ని గ్రహించ గలరు. ఒక్కమాటలో చెప్పాలంటే మగ వారి మనసుల్ని వారు పుస్తకాన్ని చదివి నంత సులువుగా చదవగలరు. మంగళ్‌కి అప్పుడప్పుడు తాగే అలవాటుందని రాణోకి తెలుసు. రాణోకి తెలుసునని మంగళ్‌కీ తెలుసు. అయితే ఈ తాగుడు విషయంలో వారిద్దరి మధ్యా ఎప్పుడూ మాటా మాటా రాలేదు. జీవితం శాంతంగానే గడిచి పోతోంది.

రోజులు గడుస్తున్న కొద్దీ అమ్మలక్కలు రాణోని వేధించడం మరీ ఎక్కువై పోయింది. రాణోకి కూడా వాళ్ళ మాటల్లో కొంతైనాసిజముందేమోననిపించ సాగింది. ఆమె తన భవిష్యత్తు గురించి, తన బిడ్డల భవిష్యత్తు గురించి దిగులు పడసాగింది. రోజు రోజుకీ మంగళ్‌కి చిరాకు ఎక్కువవుతోంది. అన్నిటికీ విసుక్కుంటుండేవాడు. అది చూసి రాణోకి భయం పట్టుకుంది. అతనితో ఏమీ చెప్పలేక పోయేది. అతనితో అనడానికి ఆమెకి ఏ హక్కుంది? అసలు ఏ హక్కయినా ఉందా? పెద్దల సమక్షంలో ఊరి అమ్మలక్కల సన్నిధిలో సొంత మనుషుల ముందు వివాహం జరిగింది. మరి అతనిమీద హక్కు లేకుండా ఎలా ఉంటుంది? మరీ గట్టిదికాకపోయినా కనీసం ఎంతో కొంత హక్కయినా లేదా?

అయితే అప్పటికీ ఇప్పటికీ ఒక తేడా ఉంది. తిలోక అంటే భయం వున్నా అతడు ఆమెని చావు దెబ్బలు కొట్టూ వచ్చినా అతనితో పోట్లాడడానికి భయపడేది కాదు. మరి మంగళ్ ముందు ఆమె నోరు పెగలదు. అతను కనీసం తన చిటికిన వ్రేలు కూడా ఆమె వంక ఎత్తడు.

పరిస్థితుల ప్రాబల్యం వల్ల తప్పని సరిగా ఒకే గదిలో పడుకోవలసిరావడం వల్ల మాత్రం కాస్తంత దగ్గరగా ఉంటాడు. అటు తర్వాత అదీలేదు.

ఒక రోజున ఇంకా వెలుచు బాగా వుండగానే మంగళ్ ఇంటికి తిరిగి వచ్చాడు. ఆకాశంలో ఇంకా వెలురు బాగా వున్నందు వల్ల చంద్రుడు వెల వెలబోతూ చెట్టు కొమ్మల్లో చిక్కుకున్నగాలి పటంలా అనిపిస్తున్నాడు. చంద్రుడు కూడా



మంగళ్ జట్కాని అనుసరిస్తూ ఆకాశంలో పరుగులు తీశాడు. అతను ఆగిపోయిన చోటనే తానూ ఆగిపోయాడు. మంగళ్ జట్కా ఒకచోట ఆపి గుర్రం కళ్ళెం తీసి దాణా పెట్టాడు. తర్వాత ఇంటికి వెళ్ళి తిరిగివచ్చి దానికి బ్రష్ చేశాడు.

మంగళ్ తాను వెళ్ళేముందు జట్కా నుంచి ఊడతీసి గుర్రాన్ని రాటకి కట్టాడు



దగ్గర్లోనే ఎక్స్పెరిమెంటల్ ఫారంకి చెందిన చెరుకు పొలం ఉంది. గడలు ఎత్తుగా ఎదిగి గోడలాగా అల్లుకుపోయాయి. సాలిపురుగులు మాత్రమే తమ దారాలతో ఆ గడల మధ్య గూళ్ళని కట్టగలిగాయి. ఆ పొలానికి ఆవల గ్రామ పాఠశాల ఉంది. దాని పక్కన జీలం ఇల్లు వుంది. ఆమె ఇంటి తర్వాత చంద్రుడు ఉన్నాడు.

ఆ పొలం దగ్గర వాతావరణంలో ఒక వింత వాసన గుబాళిస్తోంది. మంగళ్ నాసికా పుటాలకి ఆ వాసన పరిచయమైనట్టిదే. అది రైతులు చెరుకు ఆడించే సీజన్. చెరుకును నరికాక రసం తీసి త్రాగినంత తాగి మిగిలిన దానితో బెల్లం చేస్తారు. తర్వాత బెల్లాన్ని మట్టి కుండలో వుంచి దానికి పచ్చని చెట్టు బెరడు కలుపుతారు. తర్వాత ఆ కుండలకి మూతలు వేసి పేడకుప్పల్లో పాతి పెట్తారు. కొద్ది రోజుల్లోనే ఆ బెల్లం పులియడం ప్రారంభిస్తుంది. క్రిందనుంచి గుడగుడ శబ్దంతో బుడగలు పైకివచ్చి పగులుతుంటాయి. ఇది కమ్మని వాసన వేస్తుంటుంది. ఆ విధంగా పులిసిన ద్రవాన్ని వేరే కుండలలోకి కాని సీసాలలోకి కాని తీస్తారు. ఆ వాసనే ఇప్పుడు గాలిలో తేలుతూ పల్లెలోకి వస్తోంది.

వేసవి పోయి శరదృతువు వస్తోంది. మే, జూన్ నెలలలో వచ్చే తీవ్రమైన వడ గాలులకు అలవాటు పడిన వాళ్ళకి అక్టోబరులో వచ్చే చల్లని గాలులు కొంత చలి అనిపిస్తున్నాయి. ఈ కాలంలో వాతావరణం ఎటూ తేల్చుకోలేనట్లుగా ఉంటుంది. రాత్రిళ్ళు దుస్తులమీద దుస్తులు వేసుకోవాలో అక్కర్లేదో తెలీదు. ఆడవాళ్ళు రజాయిలను బయటికి తీసి వాటికి దూది వేసి మళ్ళీ కుట్టాలో అక్కరలేదో నిర్ణయించుకోలేరు. అయిష్టంగా వాళ్ళు తమ చలికాలపు పరుపుల్ని బయటికి తీసి రిపేర్లు ప్రారంభిస్తారు. పని పూర్తయ్యాక మాత్రం సంతోషిస్తారు. ఎందుకంటే మంచు కురిసినా, వడగళ్ళు పడ్డా లెక్క చేయకుండా, ఒళ్ళు సాచుకుని హాయిగా నిద్రపోవచ్చు. మగవారికి బయటపని చేయక తప్పదు. అందువల్ల వాళ్ళకి చలి మరీ ఎక్కువనిపిస్తుంది. వాతావరణంతో పాటు వాళ్ళ ఒంటి రంగు కూడా మారుతుంది.

మంగళ్ ఇంటికి వెళ్ళబోతూంటే, దగ్గరున్న డాబా పైనుంచి "ఓయి మంగళా..." అన్న పిలుపు వినిపించింది.

మంగళ్ తల పైకెత్తి చూశాడు. అతనికి చంద్రుడు, సలామత్ కనిపించారు. "అక్కడే ఉండు. నీతో పనుంది" అంది సలామత్.

మంగళ్ ఉన్న చోటనే ఆగిపోయాడు. అతని గుండె దడ దడ లాడుతోంది. తన గుండె శబ్దం స్పష్టంగా వినిపిస్తోంది. మిరపకాయలను డాబాపైన ఎండబెట్టడానికి అక్కడో కొయ్యనిచ్చెన వేశారు. దాని మెట్ల మీదనుంచి దిగివచ్చి, మంగళ్‌కి కొంచెం దూరంలో ఆగింది సలామత్.

"ఏం విశేషం ?" ప్రశ్నించాడు మంగళ్.

"ఏమిలేదు" ఆమె గొంతులో విచారం గూడుకట్టుకుని ఉంది. చూస్తుంటే ఏడ్చేస్తుందేమోననిపించేటట్లుంది.

"మరి ఎందుకు పిలిచావ్?" అంటూ మంగళ్ ఆమెకి దగ్గరగా రాబోయాడు.

సలామత్ భయపడ్డట్లుగా వెనక్కి

అంగవేసి "నా దగ్గరకు రాకు" అంది. సలామత్ బట్టలమీద నుంచి గుప్పుమని సెంట్ వచ్చింది. గ్రామీణులు వాడే సెంట్ల వాసనలు మంగళ్‌కి బాగా పరిచయ మున్నవే. కాని ఈ సెంట్ మాత్రం ఇంతకు ముందు తెలిసిందిగా లేదు. పట్నాలలో శృంగార జీవితం గడిపే వారు ఇట్టివి వాడుతారు. అది మత్తెక్కించే పరిమళం. అసలే ఆ శరత్కాలపు సాయంత్రం మంగళ్‌లో కోర్కెను రేకెత్తించింది. దానిని సలామత్ మాటలు మరింత జ్వలింపజేశాయి.

మంగళ్ దేనినీ లెక్కచేయకుండా, ఆమె దగ్గరకు వెళ్ళి "ఏం...నేనంటే భయమా ?" అని అడిగాడు.

"అవును. ఆరోజు జరిగింది అప్పుడే మరిచిపోయావా ?" అంది సలామత్.

"లేదు. మర్చిపోలేదు. జరగాల్సింది ఇంకోటి మిగిలిపోయింది" అంటూ మరో అడుగు ముందుకు వచ్చాడు మంగళ్.

సలామత్ "వద్దు వద్దు" అంటూ వెనక్కి వెనక్కి వెళ్ళి గోడ వీపుకి తగలడంతో ఆగిపోయింది. అతను కనుక తనమీద అత్యాచారం జరపడానికి ప్రయత్నిస్తే గట్టిగా అరిచి సలుగురినీ పిలిచి మంగళ్‌ని కొట్టిస్తానని బెదిరించింది.

అంతలో ఆమెకో గ్రహింపు కలిగింది. మంగళ్ కనక తనమీదికి వంగి అతని విశాల వక్షానికి తనని గట్టిగా హత్తుకుని, కౌగిట్లో బిగించి, అతని పెదవులతో తన పెదవులను అదిమిపట్టే తానేమి ఆర్తనాదం చేయగలదు. ఆ ఎలుగుబంటి, సలామత్ వైపు నెమ్మదిగా, దృఢచిత్తంతో వస్తోంది. సలామత్ వేద్దామనుకున్న కేక గొంతులోనే ఆగిపోయింది. ఆమె భయంతో వణికిపో సాగింది. దృఢకాయుడైన మంగళ్ ఒక్క అంగలో ఆమెమీదికి వెళ్ళగలడు. ఆ సమయంలో ఆమె చేయగలిగిందేమీలేదు. ఇద్దరూ ఆ చీకట్లో ఒకరి కళ్ళలోకి ఒకరు సూటిగా చూసుకున్నారు. పోట్లాడుకుంటున్న పిల్లుల్లాగా ఒకరినిచూసి ఒకరు బుసలు కొట్టుకున్నారు. అటువంటి సందర్భాలలో సాధారణంగా పురుషుల కంటే స్త్రీలే ఎక్కువగా తమ తెలివిని కోల్పోకుండా ఉండగలుగుతారు. కాని ఇప్పుడు మాత్రం సలామత్ తన సమయస్ఫూర్తిని కోల్పోయినట్లు, మంగళ్ తన తెలివిని అదుపులోనే ఉంచుకోగలిగినట్లు అనిపిస్తోంది. సలామత్ తన శక్తినంతా కూడగట్టుకుని తన బాహువులను మంగళ్ నడుంచుట్టూ బిగించి, అతను తనని బిగి కౌగిట్లోకి తీసుకోకుండా జాగ్రత్తపడింది. మంగళ్ ఆమె చెవిలో "నీకేం కావాలో చెప్పు" అని గుసగుస లాడుతున్నట్లుగా అన్నాడు.

"ఏమీలేదు. ఈసారి నిన్ను కలుసుకున్నప్పుడు 'ప్రియా! నీవు భూమిని దున్నేచోటికి నా తిరిగే చక్రాన్ని తీసుకుపో' అని అడుగుద్దామనుకున్నాను" అని గూఢార్థంతో మాట్లాడుతూ కిలాకిలా నవ్వింది.

మంగళ్ చేతులు ఆమె శరీరాన్నంతా స్పృశించసాగాయి.

"నీకేం పిచ్చెక్కలేదుకదా, అందుకు ఇది తగిన స్థలమూ కాదు. సమయమూ కాదు" అంది సలామత్ కోపం నటిస్తూ.

"అయితే ఇప్పుడు వద్దా ?"

"వద్దు"

"మరెప్పుడు? ఎక్కడ వీలవుతుంది?"

సలామత్ చెరుకు పొలంవైపు చూపిం

చింది. "అక్కడ...గుళ్లోగంటలు మ్రోగినప్పుడు. మసీదులో ముల్లా ప్రార్థనలకి పిలిచేటప్పుడు" అంది.

మంగళ్ చెరుకుపొలం వైపుచూసి, ఆ తర్వాత తలెత్తి ఆకాశం వంక చూశాడు. ఆకాశంలో పలుచని మేఘాలు బాతు రెక్కలలాగా అక్కడక్కడ ఉన్నాయి. "అలాగే" అన్నాడు మంగళ్.

మంగళ్‌కి హజారి పులిసిన చెరుకు పానకం వున్న ఓ కుండ తీసుకువెళ్లిన విషయం తెలుసు. అదికాకపోయినా ఆ చెరుకు పొలంలో ఇద్దరు పడుకోడానికి కావలసిన స్థలం ఉండకపోదు. మంగళ్ నిర్వికారంగాఉండిపోయాడు. చేతికిచిక్కిన పిట్టని వదిలి పెట్టున్న విషయం అతనికి తెలుసు. బలవంతం చేయడానికి అతనికి ధైర్యంచాలలేదు.బహుశాఓఘాటైనచుక్క వేసుకుంటే, ఆ నిషాలో ధైర్యం వచ్చేదేమో! పైగా అతనికి కూడా ఒళ్ళంతా మురికిగా ఉంది. రోజంతా ఎండలో ఉండడంతో పట్టిన చెమటమీద దుమ్ముకొట్టి ఒళ్ళంతా అట్టకట్టుకుపోయింది. నోరు కూడా అసహ్యంగావుండివాసనకొట్టోంది. ప్రొద్దుటి తర్వాత మళ్ళీ శుభ్రం చేయకపోవడం అటుంచి, అందర్నీ పట్టుకుని పాచికూతలు కూస్తూంటే, నోటికి దుర్గంధం రావడంలో ఆశ్చర్యమేముంది? మంగళ్ మనసులో వస్తున్న ఆలోచనలకి, పైకి అంటున్న మాటలకి పొంతనలేదు. "అలాగే సలామత్. మరిచిపోకు" అన్నాడు పరధ్యాసగా.

"నేను మరిచిపోను, మరిచిపోయే వాడివి నువ్వే" అని జవాబిచ్చింది ఆమె.

"నేనూ మరిచిపోను.అందులో ఈసారి అసలే మరిచిపోను" అని మంగళ్ వెనక్కి తిరిగాడు. వెన్నెలలోమెరుస్తున్న సలామత్ కళ్ళు అతనిలో ఊహల్ని ప్రజ్వలింపజేస్తున్నాయి. అతని అడుగులు గాలిలో తేలిపోతున్నాయి. అతని వెన్ను రెల్లుగడ్డిలాగ నిటారుగా నిలబడింది. దూరాన్నుంచి చూస్తుంటే అతను ఠీవిగా నిలబడిన పైన్ వృక్షంలాగా వున్నాడు. కాని మామూలు మనిషిగా అనిపించడం లేదు.

వెళ్ళిపోతున్న మంగళ్‌ని సలామత్ గమనిస్తూ ఉండిపోయింది. శరత్కాలం ఆమె మనసుకి చక్కలిగింతలు పెట్టింది. ఆకస్మికంగా ఆమెలో ప్రజ్వరిల్లిన కామ కీలలు,అంత ఆకస్మికంగానూ చల్లారాయి. అర్ధరాత్రి తామిద్దరూ కలుసుకున్నప్పుడు గట్టిగా అరచి తన వాళ్లనిపిలిచి మంగళ్‌ని పట్టియ్యాలని ఆమె ఆలోచన. ఆ పథకాన్ని విజయవంతంగా అమలు జరుపగలదా అనే అనుమానంతో ఇంటిముఖం పట్టింది. దారిలో ఆమె పెద్దక్క ఇనయత్ ఎదురైంది.

"ఎక్కణ్ణుంచీ?" అంటూ ఆమె కంటే ముందే ప్రశ్నవేసింది సలామత్

"మంత్రసాని సుగ్మా దగ్గర్నుంచిపొడి తేవడానికి వెళ్ళాను."

"పొడా! దేనికి?"

"ఆత్మహత్య చేసుకోడానికి" అంది ఇనయత్.

ఆ మాటకి సలామత్ బిత్తరపోయింది. ఎరుపెక్కిన ముఖంతో "లోకంలోఆడదై పుట్టడమంత సిగ్గుమాలిన పని మరొటి లేదు" అంది ఇనయత్.

"హాయ్" అని అరిచింది సలామత్ అక్కభావం అర్థం చేసుకుని. "నీ చివరి పాపకి ఇంకా ఏడాది నిండలేదు" అంది.

"అందుకే ఆత్మహత్య చేసుకోవాలనుకుంటున్నాను" అంటూ ఇనయత్

చేతులోవున్న పొట్లంతో నుదుటి మీద కొట్టుకోసాగింది. తర్వాత అక్కా చెల్లెళ్ళిద్దరూ ఇంటి దారి పట్టారు. దారిలో సలామత్ "ఈ విషయంలో మురాద్‌ను సంప్రదించావా?" అని అడిగింది.

మురాద్ ఇనయత్ భర్త.

"లేదు'' అంటూ చెల్లెలి చెయ్యి కుదుపుతూ అంది ఇనయత్. "అతని సలహా ప్రకారం నేను పిల్లల్ని కంటే ఇప్పటికి నాకు పదకొండుగురు ఉండేవారు. నాది పొట్ట కాని, చపాతీలు చేసే కుంపటికాదు" అంది.

సలామత్‌కి ఇబ్బందిగా అనిపించింది. ఈ విషయాల గురించి ఆమెకి అంతగా తెలియదు. ప్రకృతి మనకి తెలీని రీతిలో కావాలనుకునే వారికి గర్భధారణ కావించి, వద్దనుకునేవారికి కడుపు రాకుండా చేస్తుంటుందని ఆమె ఇన్నాళ్ళూ అనుకుంటూ వచ్చింది.

"నువ్వు పురుషుడి కౌగిట్లోకి వెళ్ళావంటే ఇంతకు మించిన ఘోరం వేరేమీ జరగదు" అంది ఇనయత్.

సలామత్ ఏమీ మాట్లాడలేదు.

వాళ్ళిద్దరూ ఇంటి ముందుకి వచ్చారు. ఇనయత్ తన భర్త, తన చిన్న చెల్లెలు ఆయేషాతో సరసాలాడుతుండడం గమనించింది.

వాళ్ళని చూడగానే ఆయేషా "అక్కా! ఆ భాటియా కుర్రాడిని నువ్వు మళ్ళీ కలిశావా?" అని అడిగింది గట్టిగా.

వేరే ధ్యాసలో వున్న ఇనయత్ చెవులకి ఈ మాటలు వినిపించలేదు.

"ఏ కుర్రాడు?" అని అడిగింది సలామత్ ఏమీ ఎరగనట్లు.

"వాడే...ఆ జట్కా తోలే మంగ్లూ"

సలామత్ కొంచెం ఆలోచించింది. అక్కా చెల్లెళ్ళు మురాద్, పసిపాప వున్న చోట చేరారు. వాళ్ళమ్మ ఇంట్లో లేదు. మాంసంలోకి వెయ్యడానికి పచ్చి బఠాణీలు తేవడానికి వెళ్ళింది. వాళ్ళెవరికీ తమ తండ్రి ఎక్కడ ఉన్నాడో తెలియదు.

సలామత్ మంచం మీద కాళ్ళుసాచుకు పడుకుని ఊహల్లో విహరించసాగింది. ఎదురుగుండా గోడకున్న మేకుకి ఆమె బట్టలు వ్రేలాడుతున్నాయి. అవి ఆమెకి జరిగిన గత అవమానాన్ని గుర్తుచేశాయి. కోపంతో ముఖం ఎరుపెక్కింది. 'ఆ రోజు నాకేమైంది? ఆ రోజు నేను ప్రవర్తించినట్లుగా ఎవరూ ప్రవర్తించరు. ఆ రోజు అతను నా ఒంటి మీద మిగిలిన గుడ్డల్ని కూడా మొత్తం తీసెయ్యమని అంటే తీసేసుండేదాన్ని. పిచ్చి కాకపోతే ఏమిటి? ఛీ...ఛీ నా వక్షాన్ని కప్పుకోవడానికి ఆ సందులో చొక్కా వేసుకోవలసి వచ్చింది. ఎవరైనా చూసుంటే?' సలామత్ కోపంతో పళ్ళు పటపటా కొరికింది. "నీ బట్టలు తీసేయడం అయింది. ఇంక ఇంటికి పోవచ్చు' అన్నాడు. ఏ స్త్రీకీ ఈ విధమైన అవమానం జరిగి వుండదు.

ఇంట్లో అందరికీ సలామత్ వడ్డించసాగింది. అందరూ వేరే పనుల్లో ఉన్నప్పుడు సమయం చూసుకుని ఇనయత్‌తో తనకీ, మంగళ్‌కీ మధ్యన జరిగిన వ్యవహారం గురించి చెప్పింది. ఆ రాత్రి స్కూలు దగ్గరున్న చెరుకు పొలంలో కలుసుకోబోతున్నట్లు కూడా చెప్పింది. ఇనయత్ ఈ విషయాన్ని మురాద్‌కి చెప్పింది.

మురాద్ గ్రామంలోకి వెళ్ళి కొందరు రౌడీలను పిలుచుకుని వచ్చాడు. వాళ్ళంతా పేద ముస్లింలు. అయినా వాళ్ళ స్త్రీలలో

ఎవరికైనా కళంకం వచ్చే పని ఏది జరిగినా సహించరు. వాళ్ళు కంగారుగా తమలో తాము సంప్రదించుకుని చేతికందిన ఆయుధాలు– కర్రలూ, కత్తులూ, బల్లాలూ, గొడ్డళ్ళూ పుచ్చుకుని చెరుకు పొలానికి వెళ్ళారు. వాళ్ళు మంగళ్ కోసం ఎదురు చూస్తున్న సమయంలో గ్రామంలో అంతకు ముందు జరిగిన హత్యల గురించి మాట్లాడుకోసాగారు. చౌదరీ కోసం తీసుకు వచ్చిన అమ్మాయి మానభంగం తర్వాత చనిపోవడం, తిలోక హత్యా కావించబడడం...ఇవన్నీ ఆ చర్చలో వచ్చాయి.

మంగళ్ శుభ్రంగా స్నానం చేసి, గడ్డానికి ఆవనూనె పట్టించాడు. అనుకున్న సమయం వరకూ కాలం గడపడానికి చమ్చాతో ఆడుకుంటూ, వద్దీని ఉడికిస్తూ, ముసలి జిందాన్‌తో, వద్దీకి చదువుకున్న భర్తని చూడడంలో గల సమస్యలని చర్చిస్తూ కాలక్షేపం చేయసాగాడు. ఇల్లంతా నవ్వులతో నిండింది.

రాణోది మంచి కాయ దేహం. ఆమెని చూస్తే రెండుమూడేళ్ళు మించి పెళ్ళయి ఉండదనిపిస్తుంది. పిల్లల్ని చూస్తే మరో పెద్ద భార్య సంతాన మేమోననిపిస్తుంది. లేదా, తమ్ముడి భార్యని మారు మనువు చేసుకున్నాడేమోనని పిస్తుంది. కాని అది ఎలా సంభవం! వారి ఆచారం ప్రకారం తమ్ముడు మాత్రమే అన్నగారి భార్యను వివాహమాడగలడు. తమ్ముడు చనిపోతే అతని భార్యని కూతురిలాగా చూసుకోవాలి అన్నగారు.

మంగళ్ ఎప్పుడూ సాయంత్రం పూట స్నానం చేయడు. ఎప్పుడూ లేనిది ఆనాటి రాత్రి స్నానం చేయడం, మంచి బట్టలు వేసుకోడం రాణో మెదడులో ఎన్నో ఆలోచనలని కల్పించాయి. ఇదంతా అతను తనకోసమే చేస్తున్నాడా! పగలంతా తనదే. బహుశా ఆ రాత్రి కూడా తనదే అవుతుందేమో!

మంగళ్ రాణో వంక మరోసారి చూశాడు. తన కళ్ళు తనని మోసం చేయడం లేదుకదా! ఆమెలోని ప్రతీదీ– ఆమె కళ్ళు, వక్షం, చెంపలు, పెదవులు, తొడలు–అన్నీ కావాలనిపిస్తున్నాయి. ఆ రోజు ఉదయాన్నే ఆమె ఊరి చెరువులో స్నానం చేసి వస్తుంటే చూశాడు. ఆ తడి బట్టలు ఆమె ఒంటికి అంటుకుపోయుంటే, జల దేవతలాగా అనిపించింది. రోజూ ఆమె గంటల కొద్దీ ఒంటికి పసుపు రుద్దుకుంటుంటుంది. అందుకేనేమో ఆమె ఒళ్ళు పట్టులాగా మృదువుగా ఉంటుంది. ఆమె ముఖానికి చక్కగా బొట్టు దిద్దుకుంది. పెదవులు ఎరుపెక్కాయి. ఇంతకు ముందు ఎండిపోయిన ద్రాక్ష పళ్ళలాగా వుండిన పెదవులు ఇప్పుడు రాస్ప్‌బెరీ పళ్ళగుత్తి లాగా ఎర్రగా మిసమిసలాడుతున్నాయి. మంగళ్ ఆమె వంక మరోసారి దీక్షగా చూసి "ఈ రోజు నువ్వు మార్కెట్‌కి వెళ్ళావా?" అని అడిగాడు.

రాణో తన పెద్ద పెద్ద కళ్ళను అతని వైపు తిప్పింది. అతని కళ్ళలో కనిపించిన కోరికను గమనించి పెళ్ళికూతురు లాగా సిగ్గుపడింది. ఆ సిగ్గుతో ఆమె బుగ్గలు ఎరుపెక్కాయి. తడబడుతూ "అవును" అంది. తర్వాత పనిలో వున్నట్లు నటించ సాగింది. మనస్సులో అతనితో ఒంటరిగా గడపడం గురించి ఆలోచించ సాగింది.

రాణో మనసులో ఏముందో! ఆమె అనుభవజ్ఞురాలు. తనకున్నదంతా ఒకే సారి ఇచ్చేసే రకంకాదు ఆమె. మృదువైన

ఆమె దేహం, ముఖం మీద సింధూరం, కెంపుల వంటి పెదవులు – వీటన్నిటికీ అతీతంగా ఆమెలో ఏదో ఉంది. ఆమె దేహంలో కోర్కెని జనింపజేసే లక్షణాని కంటే ఏదో ఉంది. సౌందర్యాన్ని కాపాడుకోవాలని స్త్రీలకుండే కాంక్షకి అతీతమైనదేదో ఉంది. వీటన్నిటినీ మించినదేదో ఉందని మంగళ్ గ్రహించాడు. బలీయమైన కాంక్షతో పరవశమైనప్పుడు ఉండే విధంగా ఉందామె. ఆమె శుక్లపక్షంలోని చవితినాటి చంద్రుడిలాగా ఉంది. ఆ చంద్రుడు తనలోని అధిక భాగాన్ని చీకట్లోనే వుంచుకుని, రోజు రోజుకీ మరింతగా బయట పెట్టుంటాడు. పున్నమి నాటి రాత్రి తన పూర్తి కళలతో ప్రకాశిస్తాడు. కాని సలామత్‌ను గురించిన ఆలోచనలతో ఉన్న మంగళ్ తన ఇంట్లో పౌర్ణమికోసం ఎదుగుతున్న చందమామని ఎలా అర్థం చేసుకోగలడు! అతనెప్పుడూ ఆకాశం వంక నిశితంగా చూసింది లేదు. తాను సూర్యుని వంటివాడని, తన వంక చూసినవారి కళ్ళు బైర్లు కమ్ముతాయన్న విషయం అతనికి తెలీదు.

ఆరోజు సాయంత్రం రాణోమంగళ్‌తో ఏదో ప్రత్యేకంగా చెప్పాలని ప్రయత్నిస్తున్నట్లుగా అనిపించింది. తమ మధ్యనున్న బంధాలని గురించి వాటిని గురించని మంగళ్‌కి తెలియజేయాలని అనుకొంటున్నట్లుగా ఉంది.

తీసిన నీ మేలిముసుగు
కళ్ళని జిగేల్ మనిపిస్తుంది
ఓ... అందాల భామా...
తొలగించు నీ మేలిముసుగును
నీలోని ముత్యాలను
నిగూఢంగా ఉంచకు
కుసుమాల వంటి
కోర్కెలను నిప్పుల పాల్జేయకు.

రాణో తనకీ తన ఆరాధ్యదైవమైన భర్తకీ మధ్యన వున్న భ్రాంతి తెరని చించేయాలని నిర్ణయించుకొంది. ఆ తెరను ఆ రాత్రే చింపాలని కూడా నిశ్చయించింది.

మంగళ్ కూడా రాణోతో సర్దుబాటు చేసుకోవాలని అనుకుంటున్నట్లు కనిపించాడు. అతను దస్కానుంచి తిరిగి వస్తున్నప్పుడు ఆమె కోసం కొనుక్కొచ్చిన తలపిన్నులను జేబులోంచి తీసి ఆమెకి ఇచ్చాడు. అతని చేతిలోంచి ఆ పిన్నులు అందుకుంటూంటే, ఆమె వెన్నులోంచి విద్యుత్ ప్రవహించినట్లయింది. "ఆ..." అని పట్టరాని సంతోషంతో అరిచింది. కాని అదేమీ వినిపించుకోలేదు మంగళ్. అతను నోట్లు తీసి రాణో చేతిలో పెట్టాడు. రాణో కళ్ళలో నీళ్లు తిరిగాయి. ఆమె తన ఆశ్చర్యాన్ని అణచుకోలేక పోయింది.

"ఎనిమిది రూపాయలే! ఈ రోజు ఎనిమిది రూపాయలెలా వచ్చాయి?" అంది.

"ఒక పాసెంజర్ వచ్చాడు, పెద్ద బేరం తగిలిందిలే"

"అయితే?"

"మరేమీ లేదు వాటిని ఖర్చుపెట్టుకో, ఇదంతా నీ కోసమే"

పెళ్ళయిన తర్వాత మొదటిసారిగా ఆమె అలంకారం వైపు పరీక్షగా చూసి "ఖర్చులు కూడా ఎక్కువయ్యాయనుకుంటాను" అన్నాడు.

వివాహమైన తర్వాత మొదటి సారిగా రాణో కొత్త పెళ్ళి కూతురిలాగా సిగ్గుపడింది. ఆమె ఒంటికిపసుపు వల్ల కలిగిన నున్నదనం, అరచేతులకి వున్న గోరింట,



పెదవులకి వున్న ఎరుపు - ఇవన్నీ నగ్నంగా వున్నట్లనిపించింది. సిగ్గుతో ఆమె తన మానాన్ని గుడ్డతో దాచుకుంటున్నట్లు ముడుచుకు పోయింది.

జీవితంలోనివి చిత్రం ఇలాగేఉంటుంది. మానసికంగా అతనికి చేరువ కావాలని కోరినప్పుడు, భౌతికంగాసాధ్యమైనంత దూరంగాపోయింది.మానసికంగా దూరంగా పోవాలని కోరుతున్నప్పుడు, భౌతికంగా బాగా దగ్గరకు వస్తోంది.ఏదిఏమైనా అప్పటి కింకా రాత్రి బాగా ముదరలేదు. గుళ్ళో గంటలు మ్రోగలేదు. మసీదులో మోజిన్ ప్రార్థనలకు పిలవలేదు.

"తినడానికేమేనా పెట్టు" అని అడిగాడు మంగళ్.

"అప్పుడే కాదు"

"ఎందుకని ?"

ఏమి సమాధానం చెప్పాలో రాణోకి తెలీలేదు. "ఏమైనా మంచి వంటకం చేశావా ?" అని మంగళ్ అడిగి ఆమెను

యిబ్బంది నుంచి తప్పించాడు.

"అవును. పచ్చి బఠానీల పులుసు- అందులో నంచుకోడానికి పుదీనా పచ్చడి చేశాను" ఆమె పట్టలేని సంతోషంతో అంది.

"అరె! ఎంత పొరబాటయి పోయింది" మంగళ్‌కి తాను సలామత్‌తో కలవ వలసిన విషయం గుర్తుకు వచ్చింది. వెంటనే లేచి నుంచున్నాడు. అతని ముక్కుపుటాలు ఎగరసాగాయి. తలపాగాలోంచి అతని జుట్టు బయటకి వచ్చింది. అతనికి కలవరపాటు కలిగింది. అతని మస్తిష్కం నిండా సాలెగూళ్ళు అల్లుకున్నాయి. అతను కంగారుగా అడిగాడు. "ఏది సిద్ధంగా వుంటే అదే ఇయ్యి. లేకపోతే నేనేమీ తినకుండానే వెళ్ళాల్సి వస్తుంది. నేను చాలా తొందరలో వున్నాను" అన్నాడు.

రాణో ఉత్సాహం నీరుకారి పోయింది. ఆమె ఊహా ప్రపంచంలో, ఆ రాత్రి కోసం మరో రకం భోజనం వండింది. ఒక వేళ అతనికి నిజంగానే అవసరమైన పని ఉందేమో! అసలు అతను అప్పుడే వెళ్ళే మంచిదేమో! అతను తిరిగి వచ్చేసరికి పిల్లలు నిద్రపోతారు. ముసలి హజూర్ సింగ్ నిద్రపోతాడు. దాంతో తెరలు తెరలుగా వచ్చే అతనీ దగ్గు ఆగిపోతుంది. జిందాన్ గుర్రు కొట్టడం ఆపి, బహుశా మంచి గాఢ నిద్రలోకి పోతుంది. తన్మయత్వం కల్పించే ఆ నిశ్శబ్దంలో, ఊపిరి బిగపట్టి వాళ్ళిద్దరూ గడపాలి.

"నా చొక్కా ఎక్కడుంది ?" అన్న మంగళ్ మాటతో, రాణో ఆలోచనా ప్రవాహానికి అడ్డుకట్ట పడింది.

మంగళ్ మనసులో ఏముందో రాణోకి అర్థమయింది. ప్రశ్నార్థకంగా కనుబొమ్మలు పైకి ఎత్తింది. "ఎక్కడికి పోతున్నావు? ఆకాశం బాగా మబ్బు పట్టింది. గాలి వాసన కూడా వాన వచ్చేటట్లనిపిస్తోంది" అంది.

"నాకేం లెక్కలేదు. అయినా ఇందులో నీ పెత్తనమేమిటి ?''

రాణో కంఠ స్వరం చల్లబడింది. "నిన్ను అడిగే హక్కు నాకు లేదు. ఊరికే తెలుసుకుందామని అడిగాను. అంతే!" అంది నెమ్మదిగా.అదే తిలోకతో అయితే ఆ వ్యవహారం వేరుగా ఉండేది. అతని విషయంలో అటువంటి సందర్భంలోనైతే, ఆమె మరోలా పెంకెగా ప్రవర్తించి ఉండేది. ''అది నాకు సంబంధించింది కాకపోతే, నిన్ను ఆపవలసిన అవసరం ఇంకెవరికి ఉంటుంది'' అని గట్టిగా నిలేసి ఉండేది. మంగళ్‌తో ఆ విధంగా మాట్లాడ లేదు ఆమె. పెళ్లి నాడు ఆ పాత, మురికి, చిరిగిపోయిన గుడ్డ తనకి యిచ్చిన హక్కు లేవో రాణోకి తెలుసు. రాణో చిన్న బుచ్చుకోడంతో మంగళ్ చలించాడు. ''నువ్వు నిజం తెలుసుకో దలుచుకుంటే నేను వ్యభిచరించడానికి పోతున్నాను'' అన్నాడు నసుగుతూ.

సాధారణంగా అటువంటి మాటల్ని ఏ మొండి పురుషుడైనా నిజంగా ముండ దగ్గరికి పోతుంటే అంటాడు- అనవసరపు కుతూహలాన్ని చూపించే భార్యతో, చిరాకు స్వభావం గల భర్త కావాలని అట్టి సమాధానం ఇయ్యవచ్చు. లేకుంటే ఎవరైనా తాను వ్యభిచరించడానికి పోతున్నట్లు చెప్పాల్సిన అవసరం ఏముంటుంది? రాణోకి జీవితానుభవం ఎక్కువ. మానసికంగా ఇతరుల మనస్సుల లోని దానిని అర్థం చేసుకునే శక్తి, చాలామంది స్త్రీలకంటే ఆమెకి ఎక్కువగా ఉంది.

దేవుడు ఆమెకి కోరికలు తీర్చుకోడానికి స్త్రీలకి అవసరమైన చాకచక్యాన్ని పరిపూర్ణంగా ఇచ్చాడు.

మంగళ్ చొక్కాని అడగడంతో, రాణో మనసుని భయపెట్టున్న అనుమానం బలపడింది. ఆమె లేచి మొండిగా నిలబడింది. కోపంతో ఆమె ముక్కుపుటాలు ఉబ్బసాగాయి. ఆమెలోని స్త్రీత్వం ప్రకోపించింది. భార్యగా తన హక్కుల కోసం పోరాడాలని కోరింది. అవసరమైతే ఒక వేశ్యలాగా అతనిని ఆకర్షించుకోడానికి సిద్ధపడింది. తన దగ్గరున్న ఆయుధాల సన్నిటినీ ఉపయోగించి అతన్ని లొంగదీసుకోవాలనుకుంది. రాణోకి తనకి ప్రత్యర్థిగా వున్న ఎత్తయిన వక్షాలూ, దృఢమైన దేహం గల సలామత్ సంగతి తెలుసు. సహజంగా ఎరుపుగా వుండే ఆమె పెదవులకు తాంబూలం నమిలి ఎరుపు తెచ్చుకోవలసిన అవసరం లేదు. ఆమె ముఖానికి బొట్టులేక పోయినా ఆకర్షణీయంగానే ఉంటుంది.

మగవాడు కొండరాయి వంటివాడు; ఉక్కు కడ్డీ వంటివాడు. అయినా బిగువైన దేహం గల స్త్రీ ముందు కరిగిపోతాడు. రాణోకి ఈ విషయాలన్నీ తెలుసు. అందుకే తెలివిగా ఆ పరిస్థితిని ఎదుర్కోవాలనుకుంది. మంగళ్ వంక అర్థవంతంగా ఓ చూపు విసరి "నీ చొక్కా ఆ ట్రంకులో ఉంది" అంది.

బయట నుంచి ఎవరో "రాణో" అని పిలిచిన పిలుపు వినబడింది. ఆ పిలిచింది రాణో స్నేహితురాలు విద్య.

రాణో తలుపు దగ్గరకి పరిగెత్తింది. విద్య ఏమైనా మాట్లాడేలోగానే రాణో ఆమెని తోసేసింది "ఇప్పుడు కాదు విద్యా వెళ్లిపో" అంది కంగారుగా.

విద్య ఆశ్చర్యంతో నిలబడి "ఎందుకు ? అసలు విషయం ఏమిటి?" అని అడిగింది.

రాణో ప్రార్థిస్తున్నట్లుగా చేతులు జోడించి "నీకో దణ్ణం. నీ పెద్దలకో దణ్ణం. దయచేసి వెళ్ళిపో" అంది.

విద్య వెళ్ళిపోయింది. కాని వెళ్తూ వెళ్తూ అనేకసార్లు వెనక్కి తిరిగి చూస్తూ వెళ్ళింది. రాణో తిరిగి వచ్చే సరికి మంగళ్ ట్రంకు పెట్టెని తెరిచాడు. అతని బట్టలు నేల మీద చెల్లా చెదురుగా ఉన్నాయి. అతని చేతిలో నారింజరంగు సారాసీసా ఉంది. అతని కళ్ళు ఎర్రగా మెరుస్తున్నాయి. "ఇదెక్కడి నుంచి వచ్చింది ?" అని నిగ్గదీసి అడిగాడు.

"ఏది ?"

"ఇది ఈ సారా" అంటూ సీసా పైకెత్తాడు మంగళ్. రాణో బెదురు చూపులతో తలుపువంక చూసి "నాకేం తెలుసు ?" అంది. దబ్బా ఆమెకి సహాయం చేయడానికా అన్నట్లు మొరగడం మొదలు పెట్టింది. రాణో తలుపు లోంచి తొంగిచూస్తూ, కుక్కవంక చెయ్యి వూపుతూ—

"నీకు చావురానూ నీ ఇంట్లో మొరుగుతావెందుకే. ఎక్కడకేనా పోయి ఇంత కూరా, మాంసం వుండే చోట మొరుగు" అని తిరిగివచ్చి మంగళ్‌తో—

"మీ అన్న దీనిని తాగుతూ ఉండేవాడు" అంది.

"అవును. నాకూ తెలుసు. కానీ ఇన్ని సంవత్సరాల తర్వాత..." అన్నాడు ఆశ్చర్యంగా.

"ఇన్నాళ్ళ బట్టీ అది అక్కడే ఉండి ఉండాలి. మీ అన్న చనిపోయాక నేను మళ్ళీ ఆ ట్రంకుని ముట్టలేదు" అంది.

మంగళ్ ఆ సీసాని అటూ ఇటూ

తిప్పుతూ, నమ్మలేని కళ్ళతో, దానిలోని ద్రవాన్ని పరీక్షించసాగాడు. నిజానికి అతను సరిగ్గా ఇటువంటి దానికోసమే సాయంత్రం నుంచి చూస్తున్నాడు. అది తాగితే ధైర్యం పెరుగుతుంది. పొట్టేలుకి లాగా ఊపు వస్తుంది. గజ్జలకి పది గుర్రాల శక్తి వస్తుంది. అతని కళ్ళ ముందు చెరుకు పొలంలో, కామ ప్రకోపంతో తన కోసం వేచివున్న ఆ దృఢ కాయురాలు కనిపిస్తోంది. వాకిలి దగ్గరకు వచ్చి ఆకాశం వంక చూశాడు మంగళ్. నల్లని మేఘాలు చంద్రుణ్ణి తమ గుప్పిళ్ళలో మూసివేశాయి.

ఎక్కడో వేసవి మరికొంత కాలం జరిగి ఉండాలి. ఎక్కడో ఇసక తుపానులు వచ్చి ఉండాలి. లేకుంటే శరదృతువులో మేఘాలు ఏమిటి? ఆ మబ్బులోంచి అక్కడక్కడ తొంగిచూస్తున్న నక్షత్రాలని చూసి, రాత్రి ఇంకా ముదరలేదని గ్రహించాడు మంగళ్. కాని ఈ మంగళ్ వేరు-మనసు మొద్దుబారి దేనినీ పట్టించుకోని మంగళ్ ఇతను.

"టాంగా స్టాండ్ దగ్గర నేను ఒకటి రెండుసార్లు చిత్తుగా తాగాను" అన్నాడు మంగళ్ తన మాటల్ని నొక్కి పలుకుతూ. ఎడమచేతి బొటన వ్రేలుని నోట్లో పెట్టుకుంటూ.

"నాకు తెలుసు" నిర్లిప్తంగా సమాధానం ఇచ్చింది రాణో.

మంగళ్ ఆశ్చర్యాన్ని వ్యక్తంచేయలేదు. ఆ విషయం రాణోకి తెలిసినా, తెలియక పోయినా అతనికి లెక్కలేదు. చేతిలోని సీసా వంక ఒక్కసారి చూశాడు. రాణో కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆమె ఊపిరి భారమైంది. ఆ ఊపిరిలో బెదిరింపు వ్యక్తమౌతోంది.

"నేను నీ ముందు తాగను" అన్నాడు మంగళ్ అదే నిర్లిప్త స్వరంతో.

"ఏం ... ఎందుకు తాగవు ?" రాణో అడిగింది పోట్లాటకి సిద్ధపడుతూ.

"నీకు అది ఇష్టం ఉండదని తెలుసు కనుక"

"నేనెందుకు బాధపడాలి? వద్దని చెప్పడానికి నాకేం హక్కుంది ?" త్వర త్వరగా మాటలు ఆమె పెదవులపై దొర్లాయి. అంతరాత్మ మాత్రం ఆమె నిజమైన భావాన్ని జ్ఞాపకం చేసింది. "నేను దానిని విషంతో సమానంగా చూస్తాను" అన్న భావం ఆమె కళ్ళలో ప్రస్ఫుటంగా ఉంది.

రాణో సరిగ్గా ఊహించింది. తన మనిషి సంగతి ఆమెకి బాగా తెలుసు. తాను కోరుకున్న విధంగా అతను ప్రతిస్పందించాలని అనుకుంది. అదే జరిగింది. మంగళ్ సీసా బిరడాని పళ్ళతో పీకుతూ వెటకారంతో కూడిన ధైర్యంతో "పెళ్ళయిన ఆడవాళ్ళతో ఇదేచిక్కు. ఎంతసేపూ చెవికింద జోరీగల్లాగ వారి మగవాళ్ళు ఏం తినాలో, ఏం తాగాలో చెప్తూ రొద పెడ్తారు" అన్నాడు. అన్నాడే కాని, తాను ఎక్కువగా మాట్లాడాడేమో ననుకున్నాడు.

కనీసం మాటలలోనైనా వారిద్దరి మధ్యా భార్యాభర్తల సంబంధం ఏర్పడినందుకు రాణో చాలా సంతోషించింది. పైకిమాత్రం కోపం కలిగినట్లు నటించింది. "దానిని తాగడానికి ధైర్యం చేస్తావా? నేనెంత మాత్రం అది సాగనియ్యను" అంది గట్టిగా.

రాణో ముందుగా ఊహించినట్లుగానే మంగళ్ బిరడాని పళ్ళతో ఊడపీకి నేల

మీద ఉమ్మేశాడు. సారా వాసనతో గది గుప్పుమంది. రాణో ఒక చేత్తో తన దుపట్టాని ముక్కుమీదికి లాక్కుని, రెండో చేత్తో సీసా మూతి మూసేసింది. మంగళ్ రాణోని చేయి పట్టుకుని బలంగా దగ్గరకు లాక్కుని ఆమె చెవిలో "నా ఇష్టమయింది నేను తాగుతాను. ఈ సారా నాకెంతో ఇష్టం" అన్నాడు పరుషంగా.

"మీ అన్న దీనిని తీసుకుంటుంటే నువ్వే అడ్డుపడేవాడివి. అతని చేతిలో సీసాని నువ్వే పగలకొట్టావు. అతని పట్టునుంచి నువ్వే నన్ను రక్షించావు. అవన్నీ జ్ఞాపకం ఉన్నాయా ?"

"నేను నీ గురించి జాలిపడేవాడిని. అంతకు మించి మరేమీ లేదు"

రాణో ఊహించినట్లుగానే మంగళ్ ఆమె పట్టునుంచి సీసాని విడిపించడానికి బలం ఉపయోగించ మొదలు పెట్టాడు. వద్దీ అటువచ్చి వాళ్ళిద్దరూ బాగా దగ్గరగా వుండడం చూసి ఆగిపోయింది. పెద్ద మెరుపు మెరియడంతో దొడ్డివైపంతా వెల్తురు వచ్చి గదిలోని ఆ ముగ్గురిమీదా పడింది. ఆ వెంటనే ఫెళఫెళారావంతో పిడుగు పడింది.

"నువ్వెళ్ళి పిల్లలకి అన్నం పెట్టి, అవతలి గదిలో పడుకో బెట్టు" అంది రాణో వద్దీతో. "వాన వచ్చేట్టుంది" అంది పలానావారితో అని కాకుండా.

వద్దీ వెళ్ళిపోతూ వెనగ్గా తలుపు మూసి వెళ్ళింది. పొద్దుటి నుంచీ ఆమె తన తల్లిలో వస్తున్న మార్పుని గమనిస్తూనే ఉంది. ఏ సంఘటన రూపం దిద్దుకుంటుందో అర్థం చేసుకోగలిగింది.

రాణో సీసాని లాక్కునే ఘర్షణ తిరిగి ప్రారంభించింది. మంగళ్ ఆమెని తోసివేయడానికి ప్రయత్నించాడు. ఆమె విడవకపోయేసరికి ముఖంమీదా, గుండెల మీదా, వీపు మీదా ఇష్టం వచ్చినట్లు కొట్టడం మొదలు పెట్టాడు. ఆమెని దూరంగా నెట్టినపుడు సీసాని నోటి దగ్గర పెట్టుకుని ఒక గుక్క తాగడం మొదలు పెట్టాడు. ఆ ఉషారులో "మా అన్నలాగా నేనేం మగతనం లేనివాడిని కాదు. ఆడదానికి నేను అంత తేలిగ్గా లొంగను" అనసాగాడు.

మంగళ్ రాణోతో పోట్లాడుతూనే సీసాలోని సారాలో మూడువంతులు ఖర్చు చేశాడు. రాణో పట్టుదలగా అతని చేతిలో నించి సీసాని లాక్కోడానికి చివరి ప్రయత్నం చేసింది. మంగళ్ ఆమెని నేలమీదికి పడతోసి పొట్టమీద బరువుగా కూర్చొని రాణో ఊహించినట్లుగానే ముఖంమీద ఎడాపెడా కొట్టసాగాడు.

పైకి లేవడానికి రాణో ప్రయత్నించిన కొద్దీ అంతకన్నా తీవ్రంగా మంగళ్ ఆమెని నేలమీదికి నెట్టసాగాడు. ఖాళీగా వున్న రెండో చేత్తో మిగిలింది కూడా తాగేశాడు. అతని ముఖం ఎరుపెక్కింది. చెవుల్లోకి, తలలోకి రక్తం వేగంగా ప్రవహించింది. రాణో వక్షస్థలం రెండు కొలిమితిత్తులు ఎగురుతున్నట్లు ఎగరసాగింది. రాణో శరీర నిర్మాణం అతనికి లొంగనట్లుగా ఉంది. రాణో తప్పించుకోడానికి మరో గట్టి ప్రయత్నం చేసింది. మంగళ్ ఆమె తలని నేలకేసి కొట్టాడు.

రాణో బలహీనపడి పోరాటాన్ని ఆపివేసింది. ఆమె నేలమీద వెల్లకిలా పడుకుని కళ్ళు మూసుకుని ఉంది. గదిలో జరుగుతున్న గడబిడ విని జిందాన్ "రాణో! ఏమిటక్కడ?" అని అడిగింది.

"ఏంలేద త్తయ్యా...పిల్లి" అని సమా

ధాన మిచ్చింది రాణో మూర్ఛలా వున్న పారవశ్యంలో. ఆమెకి తన శరీరంలోంచి ప్రాణం లేచిపోతుందేమో ననిపిస్తోంది. ఆమె చేతులు ఉన్న ఛోటనే ఉండి పోయాయి. కాళ్ళు ఎడమైపోయాయి. ఒంటిమీద బట్టలు చెదిరి పోయాయి. ఆమె తొడుక్కున్న సాల్వార్ తడిసిపోయింది. అది సారావల్ల జరిగిందో, నీటి మూలంగా జరిగిందో ఆమెకి అర్థంకాలేదు. ఆ స్థితిలో నిషా ప్రభావంలో వున్నది రాణోనో, మంగళో తెలియడం లేదు. నిషా లో వున్నది ఎవరో చెప్పడం కష్టం.

మంగళ్ లేచి నుంచుని తన పాదాల దగ్గర పడివున్న రాణో వంక చూశాడు. 'విచిత్రమైన స్త్రీ' అనుకున్నాడు. "ఇన్ని దెబ్బలు తిని కూడా తన పేరు చెప్పకుండా పిల్లి అని అంది" అని ఆశ్చర్యపోయాడు. తననిచూస్తే తనకే సిగ్గేసింది. రాణో అంటే కృతజ్ఞతా భావం కలిగింది.

మంగళ్ తన పాగాలో నించి గుడ్డని చింపి రాణో తలకి అయిన గాయానికి కట్టు కట్టాడు. గుడ్డని నోటి ఆవిరితో వెచ్చచేసి ఆమె గాయాలమీద మెత్తగా ఒత్తసాగాడు. చాలారోజుల క్రితం తమ వివాహమైన రాత్రి, రాణో తనకి అదే విధంగా సేవ చేయడం అతనికి గుర్తుకి వచ్చింది. ఆమెకి ఆ విధంగా సపర్యలు చేస్తుంటే అతని మనసుకి ఆహ్లాదంగా ఉంది. తన తప్పులకి ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నట్లనిపించింది. ఆ భావనతో రాణో పాదాలను పట్టుకున్నాడు. రాణో అతన్ని తన మీదికి లాక్కుని గట్టిగా తన కౌగిట్లో అదిమిపట్టింది. తానే మంగళ్ని కొట్టినందుకు ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నట్లుగా ప్రవర్తించింది.

"నన్ను క్షమించు. నువ్వు తప్పక క్షమించాలి" అంటూ చిన్న పిల్లవాడిలాగా వలవలలాడాడు మంగళ్.

"మళ్ళీ తాగనని ఒట్టేయి" అంది రాణో అతన్ని మరింత గట్టిగా బిగిస్తూ. తెగేదాకా లాగితే వ్యవహారం చెడవచ్చు నని ఆమెలోని స్త్రీ హృదయం హెచ్చరించింది. "నువ్వు నాకు మాట ఇస్తే, నీకు నా చేతులతోనే సారా ఇస్తాను" అంది మళ్ళీ.

"అలాగే. ఒట్టు" అన్నాడు మంగళ్ తాను ఇస్తున్న ఒట్టు విషయంలో పూర్తి అవగాహన లేకుండానే.

రాణో లేచి నెమ్మదిగా బయటకు జారుకుంది. బయట వాన కురుస్తోంది. వానచినుకులు వంటింటి పాత్రలపై పడి సంగీత బద్ధంగా చేస్తున్న శబ్దాన్ని వింటూ ఆమె రాకకోసం నిరీక్షించసాగాడు మంగళ్. పద్దీ పిల్లలకి రాత్రి భోజనం పెట్టి నిద్రపుచ్చింది. ఆ దంపతుల వ్యవహారాన్ని చక్కబరిచేందుకు దేవతలు, మనుష్యులు కూడా చేతులు కలిపారా అనిపిస్తోంది. రాణో పళ్లెంనిండా అన్నం పెట్టుకుని నారింజ రంగు సారా వున్న మరో సీసాని మంగళ్ కోసం తెచ్చింది. పళ్లెంలో ఒక పక్కన చపాతీలు, మరోపక్క మాంసం వేపుడు, అప్పుడే తరిగిన ఉల్లిపాయ చక్రాలూ ఉన్నాయి. మంగళ్ మాంసంవేపుడు నుంచి రాణో వైపు చూశాడు. ఆ పదార్థాలను చూస్తూంటే అతనికి నోరూరింది. రాణో ఆ నారింజ రంగు సారాని గ్లాసులో పోసి అతనికి అందించింది. మంగళ్ తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు అతను. రాణో కళ్ళలోకి సూటిగా చూశాడు. ఆమె ఇచ్చిన గ్లాసుని కాదనలేకపోయాడు. ఆమె చేతి

లోని గ్లాసునందుకున్నాడు. "ఈ రోజు తర్వాత నేను మళ్ళీతాగితే నాకు అన్నం పెట్టకు" అన్నాడు ఆ గ్లాసుని నోటికి ఆనించుకుంటూ.

"కొంచెం ఆగు" అంది రాణో అధికార స్వరంతో. ఆమెకి ఏదో జ్ఞాపకం వచ్చింది. వానలోకి పరుగులు తీస్తూ వెళ్ళింది. ఒక సాసర్లో పల్చని టమాటో ముక్కల్ని తెచ్చింది.

మంగళ్ భోజనం మీదా డ్రింక్ మీదా కలియబడ్డాడు. టాంగా స్టాండ్ వద్ద అతను తింటుండే భోజనం కన్నా అది ఎంతో బాగుంది. వణుకుతున్న చేతులతో రాణో నారింజ రంగు సారాతో గ్లాసుని నింపుతూనే వచ్చింది. తాగుతుంది మంగళే అయినా రాణో తనకి నిషా ఎక్కుతున్నట్టుగా భావించసాగింది. ఆమె తలమీది నుంచి దుపట్టా జారి కిందపడిపోయింది. ఆమె బాడీకి వున్న గుండీలు ఊడిపోయాయి.

గుళ్ళో గంటలు మ్రోగసాగాయి. మసీదులో మోజెన్ నమాజ్ కోసం పిలువసాగాడు. పెద్దగా వినిపిస్తున్న ఆ గుడి గంటలు, నమాజ్ కోసం రాగయుక్తంగా పిలుస్తున్న ముల్లా పిలుపు వినేసరికి మంగళ్ "అరే!" అంటూ లేచాడు.

"అరే! ఏమయింది?" అని అడిగింది రాణో.

సలామత్‌ని కలుసుకోడానికి అర్ధ మనస్కంగా ప్రయత్నించాడు మంగళ్. లేచి దొడ్డిదాకా వెళ్ళి ఆకాశం ఎంత చీకటిగా వుందో చూసి తిరిగి గదిలోకి వచ్చాడు. రాణో అతనిముందు శిలాప్రతిమ వలె, శరత్కాలపు పున్నమినాటి చందమామవలె నిలబడి ఉంది. ఆమెవంక తదేకంగా చూస్తూ "నువ్వు...నువ్వు... ఎందు కీతడి బట్టలు ఉంచుకున్నావు?" అని అడిగాడు.

రాణో తన దుపట్టా తీసి ఇద్దరిమధ్యా వ్రేలాడదీసింది. "ఇదుగో నా బట్టలు తీసేశాను" అంటూ ఒంటిమీదున్న బట్టలన్నిటినీ ఒక్కొటొకటిగా ఊడదీసేసింది. స్త్రీ సౌందర్యంలోని పరిపూర్ణత మంగళ్‌కి సాక్షాత్కరించింది. ఆమె చనుబాలు తాగినంత మాత్రాన ఆ సౌందర్యాన్ని అనుభవించాలనే కోరికనుంచి తప్పించుకోగలడా? అతి పలుచగా వారిద్దరి మధ్యన వున్న అడ్డుకట్టని పగలకొట్టుకుని తృష్ణ వరదలై ప్రవహించింది. ఆ సమయంలో సంవత్సరంలో వున్న వారాలు, రోజులు, గంటలు నిమిషాలు, సెకనులు – అన్నీ సమయ స్పృహని కోల్పోయాయి. కాలం తెలియని శాశ్వతత్వంలో కరిగిపోయాయి. అటువంటి మరిచిపోలేని సందర్భాలలోనే చంద్రుడు సూర్యుని తన కౌగిట్లోకి తీసుకోగలుగుతాడు. మంగళ్ గుడ్డివాడిలాగా ఆమెని తడమసాగాడు. తన బాహువులలోకి ఆమెనిఇముడ్చుకున్నాడు. కుంకుమ పువ్వు పండించే పొలాలలో మొక్కలు పూతకి వచ్చినప్పుడు నిప్పుల్ని చెరుగుతున్నట్లుంటాయి. మరుక్షణంలో, అంతటి వేడితో వారిద్దరూ ఒకరినొకరు చుట్టేసుకున్నారు.

"ఈ రాత్రి నువ్వెంత అందంగా కనిపిస్తున్నావు!" అన్నాడు మంగళ్ ఆమె చెవిలో. తన ఊపిరి అంతకంతకీ తగ్గి చివరకి ఆనందపు అంచులు చూసేదాకా, అతను ఆ మాటలను తిరిగితిరిగి అంటూనే వచ్చాడు.

సలామత్ వాన వచ్చినందుకు తిట్టుకుంటూ తన వాకిటివద్దనే ముఖంముడుచు

కుని ఉండిపోయింది. గుప్పెడు ఎండు మిరపకాయలు నమిలినట్లుగా తన ముఖం మీదా, తొడలమీదా కొట్టుకుంటూ బుసలు కొట్టసాగింది. గుడి గంటల శబ్దం నిశీధి శూన్యంలో కలిసిపోయింది. ముల్లా ఇచ్చిన ప్రార్థన పిలుపు బహుదూరంలో క్షీణ ప్రతిధ్వనిగా మారిపోయింది. సలామత్ వాళ్లను తిట్టుకుంది. శరీరాన్ని తయారు చేసే శక్తి వాళ్లచేతిలో లేకపోయినా, మనుషుల మీద ఆంక్షలు విధించడంలో మాత్రం ముందుంటారు.

అర్ధరాత్రి కావచ్చింది. ఉండుండి వాన పడుతూనే ఉంది. చెరుకు పొలం పక్కనే



వున్న స్కూల్ వరండాలో ఆమె మనుష్యులు మంగళ్‌కోసం వేచి ఉన్నారు. మురాద్ మేఘాలవంక చుస్తూ చిరాగ్గా "ఈ సలామత్ పట్టి కబుర్లపోగు అనుకుంటా" అన్నాడు స్నేహితులతో.

ఖలీఫా అతనితో ఏకీభవించాడు. మిగతావాళ్లు తమ తలలని ఆడించారు.

వాళ్ళు తమ కర్రలూ, కత్తులూ, గొడ్డళ్ళూ తీసుకుని ఆ జోరున కురుస్తున్న వానలో ఇళ్ళ ముఖం పట్టారు. పోతూపోతూ "ఈ వెధవ తన ప్రాణం కాపాడుకున్నాడు" అన్నారు.

సలామత్ తన బావ ఆ హత్యచేయకుండానే తిరిగి వస్తుండడం చూసి పోయి తన మంచంమీద పడుకుని "అంతా దైవ లీల'' అనుకుంటూ ఆవలించి నిద్రలోకి ఒరిగింది.



## 6

చెదురు మదురుగా వున్న మేఘాల చాటున సూర్యుడు దాగున్నాడు. అలసిపోయిన రైతాకడు క్రితం రాత్రి పడ్డ శ్రమతో ఒళ్ళెరగకుండా చింకిపాతమీద పడుకుని నిద్రపోతున్నాడు. ఒక బలమైన పవనం కొండలపైనుంచి వీచింది. దాంతోపాటు సైబీరియాలోని చిత్తడి నేలలనుంచి, కాకసస్ పర్వతాలనుంచి, పామీర్ పీఠభూమినుంచి, సులేమాన్ పర్వత శిఖరాలనుంచి వలసలు పోయే అనేక పక్షులని తెచ్చింది. వాటిని చూస్తుంటే ఎన్నోమైళ్ళ అవతల పిల్లలు లక్షలకొద్దీ కాగితం పడవలను కాల ప్రవాహంలో వదిలినట్లుగా అనిపిస్తోంది.

కర్నాటక సంక్రమణం గడిచిపోయింది. రాత్రిళ్ళు పొడవుగానూ,పగళ్ళుపొట్టిగానూ అవసాగాయి. సూర్యుడు మేఘాల మధ్య నుంచి మాత్రమే చూడగలుగుతున్నాడు. అతని కిరణాలు చల్లని, తడి తడిగావున్న భూదేవి మీద వెచ్చని చిరునవ్వులను ఒలికిస్తున్నట్లు ఉన్నాయి. ఆ కిరణాలకి బూడిదరంగు వున్న మేఘాలు ముదురు ఎరుపుగా మారుతున్నాయి. భూమాతని కప్పుకున్న మంచు ఎప్పుడు విచ్చుకుంటుందా అని రైతులు ఆత్రుతగా ఎదురు చూడసాగారు. ఎలాగైతే మంచు ఆరడంతో భూమిని దున్ని కొత్త విత్తనాలు నాటారు. పిల్లలు మల్బరీ చెట్ల కొమ్మలు విరిచి, విల్లంబులుచేసి, ఒకలక్ష్యం అంటూ లేకుండా బాణాలను వేయసాగారు. ఆలయంలోని పూజారి, మసీదులోని ముల్లా మతపరంగా ఇచ్చే బలులను సిద్ధం చేయసాగారు.

మంగళ్ గుర్రానికి కళ్ళెం కట్టి కుచ్చు పెట్టి బండిని సిద్ధం చేశాడు. రాణో పొయ్యి శుభ్రంచేసి అంటించింది. కిందటి రోజున మంగళ్ ఇచ్చిన ఎనిమిది రూపాయలలో నుంచి, రాణో ఒక రూపాయిని తీసి వడ్డీకిచ్చి పొరుగింటినుంచి తాజా నేతిని తెమ్మని పంపింది. కవలపిల్లలు బడిలో అర్ధ సంవత్సరం పరీక్షలు రాస్తున్నారు. అందరిలోకీ చిన్నవాడైన చమ్మాని, జీలం ఇంటికిపోయి ముల్లంగి, బంగాళా దుంపలు తెమ్మని పంపింది. అతను వెళ్ళేసరికి సలామత్ తల పిన్నులతో జుట్టు వంకీలు తిప్పుకుంటోంది. అతను ముల్లంగిని, బంగాళా దుంపలని మూట కట్టుకుంటుంటే సలామత్ చూసింది.

"బాబూ ... చమ్మా... చపాతీలోకి ముల్లంగి, బంగాళాదుంపల కూర చేస్తున్నారా ?" అని అడిగింది.

చమ్మా గర్వంగా "చపాతీలుకాదు. పరోటాలు. అమ్మ పొయ్యిని అంటించింది" అన్నాడు.

"ఓ...మీ అమ్మ తన పొయ్యిని అంటించిందన్నమాట. ఇప్పుడేనా?" అని జీలం కల్పించుకుంటూ గూఢార్థంతో అంది..

"అవును" అంటూ తలని జోరుగా ఆడించాడు చమ్మూ "నువ్వు వచ్చి పరోటాలు చేయదలుచుకుంటే రా.లేకపోతే సలామత్‌ని పంపినా సరే" అంటూ కాయగూరలతో పరుగెత్తాడు.

జీలం, ఇనయత్, ఆయేషా పడీపడీ నవ్వసాగారు. సలామత్ ఆ నవ్వుల్లో పాలు పంచుకోలేదు.

పరోటాలు చేస్తున్న కమ్మని వాసన ఆవరణదాటి హజూర్‌సింగ్, జిందాన్‌ల ముక్కులకి తాకింది. హజూర్ సింగ్ ఆపుకోలేకపోయాడు. "అమ్మాయి.కొన్ని మెత్తగా చెయ్యి. నా పళ్ళు వెనకటిలాగ గట్టిగాలేవు. నమలలేను." అన్నాడు. దాంతో జిందాన్‌కి చిర్రెత్తింది. "ఈ ముసలాడిని చూడు. ఈయనకి తిండి తప్ప వేరే ధ్యాసేలేదు" అంది.

రాణో వేడివేడి పరోటాలని పొట్లం కట్టి మంగళ్‌కి ఇచ్చింది. అతను మత్తుగా వున్న కళ్ళతో ఆవరణలో వున్న వారివైపు చూసి తలాడించి, రాణోతో "నువ్వు చేసుకోవలసిన పని చాలా ఉంది" అన్నాడు.

"అవును." అని క్రింది చూపులు చూస్తూ సమాధానం ఇచ్చింది రాణో. ఆమె తలయెత్తి "పనిచేయడానికి కాకపోతే దేవుడు మమ్మల్నెందుకు పుట్టించాడు?" అని అంది మళ్ళీ.

మంగళ్ వెళ్ళబోతుండగా ఆతనికేదో చెప్పాల్సిన విషయం ఉందని రాణోకి గుర్తుకి వచ్చింది. "ఉండు" అని అరిచింది.

మంగళ్ ఉన్నచోటే ఆగిపోయాడు. రాణో అతనికి బాగా సమీపంగా వచ్చింది. తడబాటులేని గొంతుతో "నాకు రెండు సాల్వార్‌లకు సరిపడ్డ గుడ్డ తీసుకురా, పండక్కి కావాలి" అంది.

మంగళ్ సమాధానం చెప్పేలోగానే రాణో తన వక్షస్థలం వైపు చూపిస్తూ "అందరు ఆడవాళ్ళు ఇక్కడ అదేదో ధరిస్తారు. నాకు కమీజ్ తప్ప వేరేమీ లేదు" అంటూ ముత్యాలవంటి పలువరస కనిపించేటట్లు నవ్వింది.మంగళ్ చిరునవ్వు నవ్వుతూ "సరే దానికేం కావాలో చూస్తాను" అన్నాడు.

"నీ ఉద్దేశమేమిటి? కావలసిందేమిటో చూస్తానంటే ఎలా! నువ్వు తప్పక ఏదో చేయాలి. సాల్వార్ లేకుండా బయటికి వెళ్ళమంటావా? నాకేం నష్టంలేదు" అంటూ కొంటెగా చూస్తూనొక్కిచెప్పింది.

ఆ అనుభూతిని మరెవరితోనూ పంచుకోడానికి ఇష్టంలేనట్లుగా మంగళ్ తల తిప్పాడు.

రాణో ఒకసారి పెదవులు ముడుచుకుని తిరిగి చెప్పసాగింది. "చన్నో భర్త నల్లని పట్టుగుడ్డ తెచ్చాడు. ఆమె తెల్లని దేహంమీద అది ఎంత బాగా నప్పిందో తెలుసా?"

రాణో మంగళ్ చొక్కా అంచు పట్టుకుని గోముగా "ఎక్కువమంది దూర ప్రయాణీకులని తీసుకు వెళ్ళడానికి ప్రయత్నించు" అంది.

మంగళ్ తియ్యటి కోరికల ప్రవాహంలో మునిగిపోయాడు. ఈకల కుచ్చు గుర్రం తలమీద నుంచి క్రిందపడింది. మంగళ్ దానిని తీసి, తిరిగి పెట్టసాగాడు. రాణో ఇంకా అతని చొక్కా అంచుని పట్టుకునే ఉంది–అతను తనకేదో అప్పు ఉన్నట్లు,

అతనిమీద తనకి సర్వాధికారాలూ ఉన్నట్లు.

"సరే...సరే..." అన్నాడు మంగళ్ ముందుకి సాగుతూ. రాణో గుమ్మం దగ్గర నుంచుని వెళ్ళిపోతున్న తన మనిషి నిండు విగ్రహాన్ని చూస్తుండిపోయింది. ఒక్క రాత్రి అనుభవం ఎన్నో రోజుల, నెలల నుంచి ఎదురుచూచిన ఆనందాన్ని అందించింది. ఆమె మనసులో తిలోకని గురించి ఆలోచన వచ్చింది. దాంతో ఒళ్ళుకంపించింది. చన్నో వారిద్దరికీ వివాహావకాశం గురించి ప్రస్తావించినప్పటి మంగళ్‌కీ, ఇప్పటి మంగళ్‌కీ ఎక్కడా పోలిక లేదు. ఇప్పుడతను సంసార బాధ్యతలు మోస్తూ వున్న వ్యక్తి. వెనకనుంచి చూస్తుంటే మాత్రం తిలోకని చూసినట్లే ఉంటుంది. మనసులో మంగళ్ రూపం పూర్తిగా ముద్రపడ్డాక, రాణో తిరిగి ఇంట్లోకి వెళ్ళింది. ఆ ఉదయం ఆమె నడకలో ఎక్కువగా ఆత్మస్థైర్యం కనిపించింది. ప్రతీదీ ఆమెకి ఎంతో తేలికగానూ, హాయిగొల్పేదిగానూ అనిపించింది. బంక మట్టి తెచ్చి అతిథులను కూర్చోపెట్టేందుకు వీలుగా, ఇంటిముందు ఆవరణను అలకసాగింది.

ఈసారి కోట్లాకి అంతటి ఎక్కువ సంఖ్యలో యాత్రికులు వస్తారని ఎవరూ ఊహించలేదు. ఆ పర్వతాల మీద ఈసారి ఇంత త్వరగా మంచు కురుస్తుందనీ ఎవరూ అనుకోలేదు. దీని మూలంగా ఆ యాత్రికులు కోట్లాలో ఆగిపోవలసి వచ్చింది. ఎన్నెన్నో ఊళ్ళనుంచి యాత్రికులు వచ్చి అక్కడ సమావేశమయ్యారు. కొందరు బస్సుల్లో, మరి కొందరు ఎడ్లబళ్ళలో, ఇంకొందరు జట్కాలలో వచ్చారు.

ఈ యాత్రికుల రాకతో అనుకోని విధంగా కోట్లాలోని రైతుల, వ్యాపారుల అదృష్టం పండింది. కిరాణా వ్యాపారి తన కొట్లోని ధాన్యాన్ని,పప్పులని మొత్తం అమ్మేశాడు. పాడివున్న రైతులు తమ నేతి నిల్వలని అమ్మివేయగలిగారు. ఖర్చు కాకుండా వుండిపోయిన నూనెనంతా ఆ షాపువాడు వదిలించుకున్నాడు. జీలం కాయగూరలు మొత్తం అమ్ముడుపోయాయి. గుళ్ళో పావురాలకి కూడా కడుపులు నిండాయి. గుడి శిఖరం నుండి అవి ఎగిరివచ్చి ఊరిలోని సందుగొందుల్లో యాత్రికులు పారవేసిన ఆహారాన్ని సుష్టుగా భోంచేశాయి. ముక్కులతో అవి ఆహారాన్ని ఏరుకుంటూ 'కుహ్, కుహ్' అనసాగాయి. ఊరిలో వున్న గెస్ట్‌హౌస్, సత్రం, జైల్‌దార్ ఇల్లు అన్నీ యాత్రికులతో క్రిక్కిరిసి పోయాయి. ఏ సౌకర్యాలూలేని అతి చిన్న గదికి కూడా వాళ్ళు ఇరవై రూపాయలు అద్దె చెల్లించారు. స్వర్ణకారులు తమ దగ్గరవున్న చెవి రింగులన్నీ అమ్ముకోగలిగారు. వెండి పనివారు చేసిన పళ్ళాలు, కుమ్మరి వాళ్ళు చేసిన కుండలూ, ప్రమిదలూ- అన్నీ అమ్ముడుపోయాయి. పాపం... ఊరిలోని పెద్ద మర్రిచెట్టు ఆకుల్ని కూడా దులిపేశారు వారు. చివరకి మసీదు లోపలి ఆర్చికి పట్టిన తేనె పట్టును కూడా వదిలిపెట్టలేదు. యాత్రికులు ప్రవాహం లాగా వస్తూనే ఉన్నారు. బృందాలు బృందాలుగా భజన కీర్తనలు పాడుతూ, నృత్యం చేస్తూ వచ్చారు వారు.

పాపులము మేము ఓ అంబమాతా
ముక్తినిచ్చి కాపాడు ఓ అంబమాతా.

కోట్లాలోని అమ్మాయిలు ఈ సమ

యంలో పైకి సౌమ్యంగానూ, లోపల కర్కశం గానూ తయారయ్యారు. అందుకు కారణమేమిటో ఎవరూ చెప్ప లేదు. గడచిపోయిన వేసవి ప్రభావం వల్ల ఈ మార్పు జరిగిందని కొందరు వ్యాఖ్యానిస్తే, వస్తున్న చలికాలం వల్లనని ఇంకొందరు నుడివారు. ప్రతివాళ్ళూ ఈ విషయం గురించి తమ ఊహల్ని చెప్తూ హాస్యాలాడుకోవడం మొదలు పెట్టారు. ఎవరేమనుకున్నా అమ్మాయిలు మాత్రం లెక్కచేయ లేదు. వాళ్ళు కలిసికట్టుగా గుళ్ళోకి వెళ్ళేవారు. ఇత్తడి పళ్లాలలో పూలూ, సింధూరంవేసి వెంట తీసు కెళ్ళేవారు. వాళ్లు వెల్తుంటే వయ్యారంగా కదలాడే వారి జఘనాలు వింత సోయ గాన్ని కొల్పుతున్నాయి. మధ్య మధ్య వారు ఆగి జువ్విచెట్టు మొదలుకి కాస్సంత ఆనుకుని విశ్రాంతి తీసుకొనేవారు. వాళ్ళు తమ వంక చూసినట్లనిపిస్తే చాలు ఊళ్లోని జులాయి వెధవలకి ఉషారెక్కి పోయేది. వాళ్లు కాస్త కనుమరుగవగానే "హాయ్.. హాయ్.." అని కేకలు, ఈలలు వేసే వారు.

అప్పుడు జరుగుతున్న ఉత్సవం, సంవత్సరంలో జరిగే వాటన్నిటిలోకి పెద్దది. అయితే వద్దీ మాత్రం తల్లితో ఇంట్లోనే ఉండిపోయింది. ఆమె వయసులో వున్న పిల్లలు యువకులతో నిండివుండే గుంపులలో కలిసిపోవడం క్షేమం కాదు. రాణో ఏదో పదార్థాన్ని కల్వంలో వేసి నూరి రాగి గిన్నెలోకి తీస్తోంది. పక్కనే వున్న మంచి పళ్లెంలో తడిపిన పిండి, దాని మీద పచ్చిమిరపకాయ గుచ్చి ఉంది. మరో ఫక్కన తరిగిన బంగాళాదుంప చక్రాలు ఉన్నాయి. పొయ్యిమీద బాణలిలో ఆవనూనె కాగుతోంది.

నల్లని పట్టుచీర కట్టుకుని చన్నో లోపలకి వచ్చింది. తలమీద ఊదారంగు దుపట్టా వేసుకుంది. పొట్టి బ్లవుజు వేసుకోవడంతో వంటి ఛాయబాగా కన్పిస్తోంది. వంటింట్లో పనిచేస్తున్న రాణోని చూడగానే "ఓసి... నీకిదేం పోయేకాలమే! ఇటువంటి రోజున ఇంట్లో ఉన్నావు! నువ్వు మనిషివేనా!" అని అరిచింది.

రాణో ఏమీ చెప్పకుండా నవ్వి ఊరుకుంది.

చన్నో ఆమెకి బాగా దగ్గరగా వచ్చి చెవిలో "అక్కడ అమ్మాయిలంతా నీ కోసం ఎదురు చూస్తున్నారు. మరి నువ్వు వంటింటికి అంటుకు పోయావేమిటి ?" అంది. రాణో సాల్వార్‌కి వున్న పూల డిజైన్ చన్నోకి కంటబడింది. "ఆ... ఇదన్నమాట !" అంటూ ఆ సాల్వార్‌ని తడిమిచూసింది.

రాణో పొడుగుకాడ వున్న గరిటిని కాగుతున్న నూనెలో ముంచింది. చెయ్యి సాచటంతో, పొట్టిగా కత్తిరించిన రాణో బ్లవుజు చన్నో కంట పడనే పడింది. వెంటనే తన చేతిని ఆమె వక్షం మీద వేసి నిప్పు ముట్టుకున్నట్లు వెంటనే చేతిని బయటకి తీసేసింది. "హాయ్, హాయ్... నాకు చావురానూ? ఎలాగయితేనేం మంగళ్ తన పనిని పూర్తి చేసినట్లున్నాడే" అంది.

రాణో నిండుకుండలాగ తొణక్కుండా ఊరుకుంది. ఆమె తయారు చేస్తున్న పచ్చడిని కొంచెం తీసి నాలిక మీద వేసుకుని చప్పరించింది.

"ఏమిటే ఇది?" అని అడిగింది చన్నో. ఆ పచ్చడి వంక నిశితంగా చూసి వ్రేలితో కొంచెం తీసి నోట్లో వేసుకుంది. అది పుల్లగా, తియ్యగా, కారంగా వున్న

పచ్చడి. ఆ కారానికి ఆమె నోరు మండి "ఛూ ... ఛూ" అంటూ ఉమ్మేసింది. వెంటనే రాణోని భుజాలు పట్టుకుని కుదుపుతూ "ఏమిటే సంగతి !" అంటూ ఉత్సాహంగా అడిగింది.

"సంగతా! ఏమిటది?" అంది రాణో అర్థం కానట్లు నటిస్తూ.

"నిజం చెప్పవే, లేకుంటే నేను ఆగలేను. ఇదుగో నా మీద ఒట్టు వేస్తున్నాను" అంది చన్నో.

రాణో వద్దీ వంక తల ఆడిస్తూ కళ్ళతో సంజ్ఞ చేసింది. ఆమె చన్నోని దగ్గరగా లాక్కొని ఒకే ఒక్కమాట "అవును" అని చెవిలో ఊదింది.

చన్నో వెన్నులోంచి విద్యుత్ ప్రవహించినట్లయింది. ఒక చేతిని తన తల మీదా, వేరొక చేతిని నడుంమీదా పెట్టుకుని ఒంటికాలి వ్రేళ్ళమీద గిరుక్కున తిరిగింది. పరుగు పరుగున బయటకు పోయి "ఒసే పూరో...ఒసే విద్యా... సరూపో...ఎక్కడికిపోయారే మీరంతా?" అంటూ గొంతు చించుకొని అరవసాగింది.

చన్నోకి పట్టరాని సంతోషం కలగడంతో ముందూ వెనకా కనిపించడం లేదు. ఆ పరుగులో అప్పుడే గుమ్మంలోకివచ్చిన మంగళ్‌కి బలంగా గుద్దుకుంది. ఆ దెబ్బకి వెనక్కి దొర్లిపడి గోడకి గుద్దుకుంది. మంగళ్ తలపాగా క్రిందపడిపోయింది. జుట్టుముడి ఊడిపోయి పొడుగుపాటి వెంట్రుకలు ముఖమంతా చెల్లా చెదరయ్యాయి. ఆ దృశ్యం నవ్వు కల్పించేదిగా తయారైంది.

చన్నో కోపాన్ని నటిస్తూ "నువ్వేమైనా గుడ్డివాడివా ? ఎక్కడికి పోతున్నావో తెలీదూ ?" అంటూ తిట్టడం మొదలుపెట్టింది.

మంగళ్ తడబడ్డాడు. అతను ఏదో అనేలోగానే చన్నో బయటకి పరుగెత్తింది. మంగళ్ పడిపోయిన తలపాగాని ఎత్తుకుని బట్టల దుమ్ము దులుపుకుని "రాణో" అని పిలిచాడు.

ఊహల్లో తేలిపోతున్న రాణో ఆ పిలుపుతో పరవశించింది. వివాహమయ్యాక అతను పేరుతో పిలిచింది అదే మొదటి సారి. మంగళ్ ఆమె పక్కగా మోకాళ్ళ మీద కూర్చుని, రహస్యం చెప్తున్నట్లుగా "విను రాణో...ఈరోజు చాలా విచిత్రమైన సంగతి జరిగింది. నమ్మశక్యం కానిది" అన్నాడు.

నిజానికి రాణో ఉత్సాహంతో అరిచి ఉండాల్సిందే. కాని ప్రయత్నపూర్వకంగా అణచుకుని ప్రశాంతమైనముఖంతో "నువ్వు నీ కథ చెప్పడం అయ్యాక, నేనూ నా కథ చెప్తాను" అంది.

"ఏమిటి సంగతి ?"

"ముందు చెప్పాల్సింది నువ్వు."

మంగళ్-వద్దీ గోడవారగా నిల్చుని వుండడం గమనించాడు. ఆమె ఎటో చూస్తున్నట్లుందే కాని, ఆమె చెవులు మాత్రం తన తల్లికీ, సవితి తండ్రికీ మధ్య జరుగుతున్న సంభాషణ వినడానికి రిక్కించి ఉన్నాయి. మంగళ్ ఆమెని ప్రేమగా పిలుస్తూ "అమ్మాయి...ఓసారి లోపలికి వెళ్ళావామ్మా" అన్నాడు.

వద్దీ అణకువతో వున్న చిన్నపిల్లల్లే ఇంట్లోకి వెళ్ళిపోయింది. మంగళ్ చెప్పసాగాడు. "ఇక్కడకు వచ్చిన యాత్రికులలో పాతికేళ్ళ కుర్రాడు ఉన్నాడు. సింహబలుడనుకో. వాళ్ళనాన్న దస్కాలో పిటిషన్‌లు వ్రాస్తుంటాడు. వాళ్ళకి పొలాలు, ఇళ్ళూ, దుకాణాలు ఉన్నాయి.

అన్ని రకాల ఆస్తి ఉంది"

రాణో ముఖం వాడిపోయింది. "వాళ్లు ధనవంతులైతే, ఏదో ఓటి ఘనంగానే అడుగుతారే!" అంది.

"నేను చెప్పేది పూర్తి కానీ" అసహనంగా అన్నాడు మంగళ్ "ఆ కర్తారాడు ఏమంటున్నాడో తెలుసా? తాను పెళ్ళి చేసుకుంటే వద్దీనే చేసుకుంటాడట వద్దీ తప్ప ప్రపంచంలో ఇంకెవరూ అక్కర లేదట"

"నిజంగా!" ఆశ్చర్యంగా అడిగింది రాణో. తన చెవులను తానే నమ్మలేక పోయింది. చేస్తున్న పనిని అట్టే ఉంచింది.

"నిజం,ఒట్టేసి చెప్తున్నాను" అన్నాడు మంగళ్.

రాణోలో ఆత్రం హెచ్చింది. ఆమె ఊపిరి వేగమైంది. కాళ్లు వణకసాగాయి. ఆమె మనసులో ఏదో అనుమానం తొంగి చూసింది. తన ఆవేశాన్ని అణచుకుంటూ "అతను వద్దీని చూశాడా?" అని అడిగింది.

"చూసే ఉండాలి. అయినా దాంతో మనకేమి పని?"

"పనిలేకపోవడమే! అతను వద్దీని చూడకుండా, వుంటే, వద్దీనే పెళ్ళాడాలని ఎందుకనుకుంటున్నట్లు?"

"అదేమో నాకు తెలీదు. అయితే ఊరి పెద్దలంతా ఇందుకు ఇష్టంగానే ఉన్నారు. వాళ్లేమంటున్నారో తెలుసా? "పంచోంమేం పరమేశ్వర్' అని ఐదుగురు పెద్దల మాట, దేవుని మాటతో సమానం అంటున్నారు."

"ఆ మాట నిజమే. అది కాకపోతే ఈరోజున నే నెక్కడుండేదానినో!" అంటూ ఒప్పుకుంది రాణో.

కొంచెంసేపాగి తిరిగిచెప్పడం మొదలు పెట్టాడు మంగళ్. "నీ కూతురు చాలా అదృష్టవంతురాలని వాళ్లు అంటున్నారు. ఆమె రాణి అవుతుంది. నీలాగ పేరుకి కాకుండా నిజమైన రాణి అవుతుంది."

మంగళ్ మాటలు ఆమె చెవులకి విని పిస్తున్నాయే కాని, అతను ఏమి అంటోందీ మనసుకి పట్టడంలేదు. మంగళ్ అదేమీ గమనించకుండా చెప్పుకుపోతున్నాడు, "అతనికి కట్నం ఏమీ అవసరంలేదుట. పైగా ఎవరైనా ఆ పేరు ఎత్తితే కోపం వస్తుంది." తన మాటలని రాణో అపార్థం చేసుకుంటుందేమోనన్న అనుమానంవచ్చి వెంటనే మళ్ళీ అన్నాడు. "అలాగని నేనేం ఇయ్యనని అనుకోకు. సంప్రదాయం ప్రకారం ఇయ్యాల్సినవన్నీ ఇస్తాను. నా కూతురికి నేను అన్యాయం చేయను"

మంగళ్ ఆమెని "నా కూతురు" అనడంతో, తన చెవులని తాను నమ్మలేక పోయింది రాణో.

"వద్దీకోసం అవసరమైతే నన్నే అమ్ముకుంటాను.నా జట్కాని,గుర్రాన్ని తాకట్టు పెట్తాను"ఒక్క ఉదుటునచెప్పుకుపోయాడు. అంతలో రాణో కూడా తనకేదో చెప్పాలనుకున్న విషయం గుర్తుకి వచ్చింది. "నువ్వు కూడా ఏదో చెప్పాలనుకున్నావు కదూ?" అన్నాడు.

"అది ఏమంత ముఖ్యమైనది కాదు" అంది రాణో ముభావంగా. "ఈసారి నువ్వు బయటకి వెళ్ళినప్పుడు ఓసారి మంత్రసాని సుర్మాని వెంట తీసుకునిరా. ఆమెతో కొంచెం మాట్లాడాలి" అంది.

"మంత్రసానా!" ఆశ్చర్యంగా అడిగాడు మంగళ్. కుతూహలంతో విప్పారిన కళ్ళతో "నిజమేనా!" అన్నాడు.

రాణో చిరునవ్వి నవ్వి అవునన్నట్లు తలాడించింది. అంతలో ఇంటి ఆవరణ

లోకి ఆడుతూ, పాడుతూన్న ఆడవాళ్ళ గుంపు జొరబడింది.

కంకణాల చేతుల్ని నువ్వు చూపావు
నీ భర్త హృదయాన్ని నువ్వు పొందావు
రాసుకున్నావు పెదవులకి రెండు పైసల రంగు
వేసుకున్నావు అందగానిని ముడిగా నీ కొంగు

మంగళ్ వాళ్ళని ఊరుకోమన్నట్టుగా చేతులు పైకెత్తేసరికి పూరణ్‌దేవి ముందుకి వచ్చి బలంగా ఓ తోపు తోసింది మంగళ్‌ని. "ఓరి నీయిల్లు బంగారంగానూ. నువ్వు మహా మొనగాడివయ్యావే" అంది.

"అబ్బో! ఇప్పుడు అతన్ని పట్టపగ్గాలున్నాయా?" అంటూ చన్నో మరో తోపు తోసింది.

"పో...ఇక్కణ్ణించి. లేళ్ళ గుంపులో పొట్టేలు లాగ నువ్వెందుకిక్కడ. ఇక్కడ నీకేం పని లేదు" అంది విద్య.

"సిగ్గుమాలినవాడా! ...పో...పో నీ పని నువ్వు చేశావు. ఇంక పోయి నీ బండి తోలుకో" అంది పూరణ్‌దేవి.రాణో వంక తిరిగి "నువ్వు కొడుకుని కంటే మంచిది. లేకుంటే నీ కష్టాలకి అంతుండదు" అంది.

అమ్మలక్కలంతా జేరి మంగళ్‌ని తోస్తూ, బాదడం మొదలుపెట్టారు. అతని అవస్థ చూసే రాణోకి నవ్వు వచ్చి కళ్ళలో నీళ్ళు వచ్చాయి. ఆమె కల్పించుకుంటూ "హేయ్... నా భర్తని వదలండి ఇంకచాలు. లేకుంటే అతన్ని చంపేసేట్టున్నారు'' అంది. మంగళ్ తన ముఖాన్ని చేతులతో మూసుకుని వెనక్కి వెనక్కి నడుచుతుంటూ తలుపు దగ్గరకి వెళ్ళాడు "చన్నో పిన్నీ...సరే... నే వెళ్తాను. నన్నొంటరిగా వదిలేయండి" అని అరుస్తూ గడపదాటి బయటపడ్డాడు.

ఇంక అమ్మలక్కలకి అడ్డంటూ లేక పోయింది. మరింత ఉత్సాహంగా ఆట, పాటలు మొదలయ్యాయి. ఒకరు "తప్పా" పాట అందుకున్నారు.

నిప్పు రాజేయండి
నీళ్ళు కాచండి
పుట్టబోయేది మగబిడ్డేనండి.

అందరూ బృందంగా పాట అందుకున్నారు.

పండువంటి వాడు పుట్టబోతాడు
చురుకైనవాడు, అతి అందగాడు
నిప్పు రాజేయండి
నీళ్ళు కాచండి
పుట్టబోయేవాడు మగబిడ్డేనండి.

వాళ్ళు వేగంగా సుళ్లు తిరుగుతూ మరింత ఉత్సాహంగా పాడుతున్నారు. వాళ్ళు చేస్తున్న శబ్దం చెవులు చిల్లులు పడేట్టుగా ఉంది. రాణో పూరణ్‌దేవిని పక్కకి పిలిచి ఆమె చెవిలో "శుభవార్త పిన్నీ" అంది.

"శుభవార్తా... ఏమిటది?" అంది పూరణ్‌దేవి ధోతీని నడుం మీద బిగించుకుంటూ.

"వడ్డీకి భర్త దొరికాడు"

గ్రామీణ స్త్రీల ఆలోచనలు ఎంత సేపూ పెళ్ళిళ్ళ మీదా. గుర్రం మీద వచ్చే పెళ్ళికొడుకుల మీదా, మేలి ముసుగులో వున్న వధువుల మీదనే ఉంటాయి. వాళ్ళ చెవులు ఎంతసేపూ పెళ్ళికి వినిపించే షహనాయిని వినాలనే కోరుకుంటాయి. వాళ్ళు ఎప్పుడూ మగపెళ్లివారి కోసం ఎదురు చూస్తుంటారు. వడ్డీ పెళ్ళి విషయం వినేసరికి వాళ్ళ ఉత్సాహానికి అవధులు లేకపోయాయి. వాళ్ళ కళ్ళ

ముందు పెళ్లి జరుగుతున్నట్లే అనిపించింది, ఆ ఉత్సాహంలో వాళ్ళకి "పిల్లవాడు ఎవరు ? ఎక్కడివాడు ? ఏం చేస్తాడు ?" వంటి ప్రశ్నలు అడగాలనే అనిపించలేదు. వాళ్ళ కళ్ళ ముందు మెదులుతున్నదల్లా గుర్రం మీద ఓ పెళ్లికొడుకు, అతని ముఖం కప్పివేస్తున్న జరీ తీగలు, తలమీద కుచ్చులపాగా, చేతిలో ఒక కత్తి.

వాళ్ళు మళ్ళీ పాట అందుకున్నారు.

కొమ్మకింద పండాయి రెండు నిమ్మ
పళ్ళు
మా బావ కోరాడు అప్పుగా వాటిని
ఓ ... బావగారూ! ఇమ్మనండీ వాటిని
అరువుగా కూడా ఇయ్యలేనండీ
నా కొమ్మలన్నీ నిమ్మపళ్ళ బరువుతో
వంగాయి
చెవుల జూకాలలాగ వ్రేలాడు
తున్నాయి

పాట చివరి భాగాన్ని అందరూ కలిసి అందుకున్నారు.

ఓ మామగారూ... ఉన్నారు మీరు
బాదంకాయవంటి గోధుమ వర్ణంతో
మీ కొడుకులైతే ఉన్నారు నల్లగా
మరి మీ కొడుకుల భార్యలు ఉన్నారు
తెల్లగా.

వాళ్ళ ఊహా లోకంలో పెళ్ళికూతుళ్ళ నందర్నీ అత్తవారిళ్ళకు పంపించి వేశారు అమ్మలక్కలు. పట్టరాని ఆనందంతో వాళ్ళు వేస్తున్న కేకలు, పాడుతున్న పాటల శబ్దంతో గుళ్ళోకి వెళ్తున్న వాళ్ళు అనేక మంది మంగళ్ ఇంటికి రాసాగారు. అది చూస్తుంటే అమ్మవారు గుడిలోంచి కదిలి మంగళ్ ఇంటికి వచ్చిందా అనిపిస్తోంది.

గ్రామ సర్పంచ్, మరికొందరు ఊరి పెద్దలు మంగళ్ ఇంటి ప్రాంగణంలోకి వచ్చేశారు. డాబా పైభాగాలు ఆడవాళ్ళతో క్రిక్కిరిసి పోయాయి. సందులు మగవారితో నిండిపోయాయి. ఆ ఊళ్ళో ఎంతో మందికి పురుళ్ళు పోసిన సుర్మాబాయికూడా అక్కడే ఉంది. ఇంకా ఎన్నో తరాల వాళ్ళకి ఆమె పురుడు పోస్తుంది కూడా.

జీలంముగ్గురుకూతుళ్ళుకూడాఅక్కడికి వచ్చారు. ఆయేషా, గుణవంతి ఎప్పుడూ పోట్లాడుకుంటుండేవాళ్ళు. తమ పాత పోట్లాటలు మరిచి ఆ సంబరంలో కలిసి పోయారు. పూరణ్ దేవి, విద్య రాణోని బలవంతంగా తమ మధ్యకి లాక్కొచ్చారు.

ఎన్నో సంవత్సరాల విచారం రాణోని మానసికంగా కృంగదీసి, ఆమె అందాన్ని హరించింది.

కొద్దిమంది మాత్రమే ఆమె విచారపు ఆచ్ఛాదన కింద అత్యంత సౌందర్యరాసి అయిన స్త్రీనిచూడగలిగారు. కాని ఇప్పుడు ఆమె విచారాలన్నీ తొలగిపోయి స్వతస్సౌందర్యం తిరిగి వచ్చినట్లుంది. ఆమె వేసుకున్న చారల చొక్కాలోంచి వక్షం పెగుల్చుకు వస్తున్నట్లనిపిస్తోంది. ఆమె కట్టుకున్న చిన్న పువ్వుల సిల్కు సాల్వార్ ఆకాశంవైపు ఎగసి పడుతున్న చుక్కల పాములాగ ఉంది. "గిద్దా" నృత్యం చేస్తూ ఆమె చేతులు పైకి ఎత్తితే చాలు, ఎటువంటి వారైనా చిత్తయి పోవాల్సిందే.

కోట్లా గ్రామంలోని మగవారు రాణో సంతరించుకొన్న కొత్త అందం గురించి వింతగా చెప్పుకోసాగారు.

అమ్మాయిలు చుట్టు చుట్టుగా నృత్యం చేయసాగారు. వాళ్ళు నృత్యంచేస్తున్నప్పుడు

పై బట్టలు ఎగురుతుంటే, మగ వా రు మున్నెన్నడూ లేనంతగా వారి అందాల్ని చూడగలిగాను.

గ్రామంలో మరో ఉత్సవం జరుగుతోంది. అసంఖ్యాకంగా భక్తులు గుమిగూడి అమ్మవారిని కీర్తిస్తూ గీతాలు పాడుతున్నారు. వారు అంతకుముందు చేసిన పాపాల్నీ, చేయబోయే పాపాల్నీ శాళనం చేసుకోడానికి వచ్చారు. వారు నృత్యం చేస్తూ పాడుతున్నారు.

అది అమ్మవారి దర్బారు
అది ఆదిశక్తి దర్బారు
అక్కడ వెలిగాయి దివ్య దీపాలు
ఓ దివ్య మాతా!
మీరు సప్త సోదరీమణులు
ఉన్నాయి మీ జడలో పగడాల పూలు
నా చల్లని తల్లి దర్బారులో
వెలుగుతోంది శాశ్వత జ్యోతి.

ఆ దృశ్యం చూస్తుంటే చాలా విచిత్రంగా ఉంది. చౌదరీ, అతని సోదరుడు తమ జైలు శిక్షను పూర్తిచేసుకుని తిరిగి వచ్చారు. వాళ్ళుకూడా అతి సందడిగా వున్న ఆ భక్తుల ఊరేగింపు వెంట నడుస్తున్నారు. వారి తలలు సిగ్గుతో వాలి ఉన్నాయి. చూపులు నేలకి ఆని ఉన్నాయి. నడుస్తూ నడుస్తూ వాళ్ళు మధ్య మధ్య నేల మీదసాష్టాంగ పడుతున్నారు.పశ్చాత్తాపంతో చెవులు పిండుకుంటూ గుంజీలు తీస్తుండడంతో అవి ఎర్రబడ్డాయి. వాళ్ళు మాటల్లో చెప్పకపోయినా, వారి మౌనం వారు తమ తప్పిదాన్ని ఒప్పుకున్నట్టు చెప్తోంది.

వారిద్దరి మధ్య ఒక యువకుడు ఉన్నాడు. అతను పొడుగ్గా, అందంగా ఉన్నాడు. అతను ఎంతో భక్తి ప్రపత్తులతో అమ్మవారిని కీర్తిస్తూ పాడుతున్నాడు.

ఎవరతను? తన తప్పుల్ని క్షమించమని అంత దీనంగా అమ్మవారిని ప్రాధేయపడుతున్నాడే! ఆ లేతవయసులో అంతటి తప్పుని ఏం చేసి ఉంటాడు?

మంగళ్ ఆ జనాన్ని చీల్చుకుని రాణో దగ్గరకి వెళ్ళాడు. అతను రాణో భుజం కుదిపి ఆ యువకునివంక చూపిస్తూ "రాణో అడుగో... అతనే ఆక్రూరాడు" అని చెప్పాడు,

రాణో ఆ అందమైన యువకుడిని పరకాయించి చూసింది. ఆమె కళ్ళు మిలమిలా మెరిశాయి. ఆమె కాబోయే అల్లుణ్ణి మనసులోనే ఆశీర్వదించింది. ఏ తల్లి మాత్రం తన కూతురికి అంతకంటె అందమైన భర్త కావాలని కోరుకుంటుంది! రాణో సంతోషం పట్టలేకుండా ఉంది. ఆమె చన్నోని తన చేతుల్లోకి తీసుకుని ఊపిరాడనంత గట్టిగా కౌగిలించుకుంది. "చన్నో! నాకింకే దిగులూ లేదు. దేవతలు నా పట్ల ఎంతో దయగా ఉన్నారు" అంది ఆనందంతో.

వద్దీ అమ్మలక్కల తలల మీదనుంచి ఆ అబ్బాయిని స్వయంగా చూడడానికి ప్రయత్నించింది. ఆ జన సముద్రంలో తననే గుర్తించలేనట్లుగా, స్వీయ స్పృహని కోల్పోతున్నట్లుగా ఉంది ఆమెకి. సిగ్గుతో ముఖం జేవురించింది. పక్కనే వుండి జాగ్రత్తగా గమనిస్తున్న సలామత్ ముఖం పాలిపోయింది. ఆమె తన పెద్దక్క చేతిని పట్టుకుని "ఇంటికి పోదాం పద. నాకు చాలా అలసటగా ఉంది" అంది.

రాణో ఆ అబ్బాయిని చిన్న పిల్లలు

తమ ఇష్టమైన బొమ్మని చూపించినట్లు అందరికీ చూపించ సాగింది.

పూరణ్‌దేవి ఆ అబ్బాయి వంక పరీక్షగా చూసింది. విద్య అమ్మకానికి పెట్టిన గుర్రాన్ని పరీక్షించినట్లు ఆ అబ్బాయిలో ఏ ఏ అంగాలు అందంగా ఉన్నాయో పరిశీలించ సాగింది. చండీ అతనిలోని మంచి చెడులను తూకం వేయ సాగింది. జానకి విమర్శనా పూర్వకంగా అతని వంక చూడసాగింది. రాణో వాళ్ళ అభిప్రాయాలు వింటూ "అవునవును మీరు చెప్పింది నిజం" అంటూ ఒప్పు కొంటోంది.

మిలమిలా మెరుస్తున్న కళ్ళతో చూస్తున్న రాణో దృష్టిలో అకస్మాత్తుగా మార్పు వచ్చింది. చన్నో ముఖంలో మార్పుని కూడా రాణో గమనించింది. "హాయ్... ఏమిటే సంగతి?" అంటూ చన్నో వంక చూస్తూ అరిచింది రాణో. ఆ తర్వాత తానే స్వయంగా, పరీక్షగా చూసింది.

ఆ యువకుడు ఆమెకి సమీపంగా వచ్చి నిలబడ్డాడు. చేతులు జోడించి ఆమె పాదాల వంక చూస్తూ, అనుగ్రహం కోసం అర్థిస్తున్నట్లుగా ఉన్నాడు.

రాణో ముఖం కాగితంలా తెల్లగా పాలిపోయింది. ఆమె చేతులు వణికాయి. ఆమె ఒళ్ళంతా చల్లని చెమటలు పట్టాయి.

"వాడే వీడు.... వీడే నా భర్తని ..."

రాణో తల తిరిగిపోతోంది. ఆమె స్పృహ తప్పి పడిపోబోతుంటే, ముసలి హజూర్ సింగ్ తన చేతిని ఆమె వెనకాల ఊతగా వుంచి, ఆమె వెనక్కి విరుచుకు పడి పోకుండా కాపాడాడు.

"కోడలా! ఎందుకు వీచారిస్తావు? నా వంక చూడు. ఒక అసలైన కొడుకుని పొందడానికి ఇద్దర్ని పోగొట్టుకున్నాను" అన్నాడు అతికష్టం మీద. అంతకిమించి ఆ ముసలాయన ఏమీ అనలేక పోయాడు. కళ్ళమ్మట నీళ్లుకారి అతని గడ్డంలో కరగిపోయాయి. త్రిలోక చనిపోయి నప్పటి నుంచి హజూర్‌సింగ్, ఆస్థానాన్ని ఆక్రమించగల వ్యక్తి కోసం అన్వేషిస్తు న్నాడు. తరచుగా వణికే కంఠంతో పాడుకుంటుంటాడు.

దుమ్ములో వెతికి ఏమి ప్రయోజనం?
పోయిన మాణిక్యం మళ్ళీ దొరకదు.

హజూర్‌సింగ్ ప్రాపంచిక బంధాలన్ను తెంచుకున్నాడు. కాని ఈ కొత్త పరిస్థితి అతనిలోని ఆవేశాన్ని రెచ్చగొట్టి, మసక కళ్ళను స్పందించేటట్లు చేసింది. అతని మనసే ఒక దృశ్యం! అతను ద్రష్ట. అతనిది ఆట. అందులో అతను ఆట గాడు. ఆతని కాషాయ రంగు తలపాగా వదులయింది. అతను కళ్లు తుడుచుకొని, తలపాగా రెండో కొసలో ముక్కు చీదు కునే సరికి అతని ముఖం ఎరుపెక్కి అతను ప్రపంచాన్ని త్యజించిన యోగి లాగ కనిపించాడు.

నిజానికి హజూర్ సింగ్ ఎప్పుడో ప్రపంచాన్ని పరిత్యజించాడు. ప్రపంచమే అతన్ని పరిత్యజించలేదు. మృత్యుద్వారం ముంగిటవున్న అతని అంతరంగంలో సత్యదృష్టి కలిగింది. తృటిలో అతనికి జీవన్మరణాల అర్థం గోచరించింది.

ప్రాపంచిక రంగస్థలం మధ్యలో తన కోడలు రాణో ఉంది. ప్రతి వివాహంలోనూ పెళ్ళి

ధుపట్టా ధరించి, ఎక్కడి నుంచో వస్తూ ఆమె కనిపిస్తోంది. లక్క కంకణాలు ధరించి, గోరింటను పెట్టుకున్న చేతుల్ని జోడించి సిగ్గుతో నిండిన అర్ధ నిమీలిత నేత్రాలతో ప్రార్థిస్తోంది.

"ఓ... మా తండ్రుల తండ్రీ! నీ ఈ కొడుకును నాకియ్యి. దానికి పదింతలు నేను తిరిగి ఇస్తాను. అతనిలాగే వుండే పదిమంది కొడుకులను నీకిస్తాను" అంటూ తాను జవాబు చెప్పాడు.

"స్త్రీ కోరిక నా ఆజ్ఞ, కాని ఈ నా కొడుకు... ఈ..." ఆవేశం తట్టుకోలేక వెన్ను తిరిగిపోయాడు హజూర్ సింగ్.

హజూర్ సింగ్ వణుకుతున్న తన వేళ్ళను రాణో పొడుగుపాటి జుట్టులో నించి పోనిచ్చాడు.

ఆ స్పర్శలో రాణోకి ఏనాడో పోగొట్టుకున్న తన తండ్రి జ్ఞాపకం వచ్చాడు. సంప్రదాయాన్ని లెక్క చేయకుండా ఆమె అతని వక్షస్థలం మీద తల ఆన్చి రోదించింది– "వద్దు... బాపూ వీల్లేదు. ఇది ఎప్పటికీ జరగకూడదు. నా కూతురికి ఇది జరగరాదు. అంతకంటే నన్ను నేను చంపుకుంటానికి ఇష్టపడతాను" అంటూ.

ఈ దృశ్యం చూసి గుడినుంచి వస్తున్న యాత్రికులు అక్కడికి వచ్చారు. వారందరూ ఈ సమస్య ఎలా పరిష్కారమవుతుందా అని ఆతృతగా ఎదురు చూస్తున్నారు. ఆ సమయంలో అక్కడ రాణో ఇచ్చే తీర్పుమీదే ఈ ప్రపంచ భవిష్యత్తు ఆధారపడినట్లుగా ఉంది. ఆమె కనుక 'అవును' అంటే జీవితం తిరిగి ప్రారంభమవుతుంది. 'కాదు' అని అంటే ప్రపంచం నాశనం అవుతుంది.

దాంతో ఎంతటి విపత్తు కలుగుతుంది! ఆ సర్వనాశనంలో మనుషులు కాని, జంతువులు కాని, మృగాలుకాని, భూమికాని, ఆకాశంకాని ఏమీ మిగలవు.

కాలప్రవాహం ఆగిపోతుంది. మాటకి గొంతు పోతుంది. టార్చికి వెలుగు పోతుంది. భగవంతుడు తన అస్తిత్వాన్ని కోల్పోతాడు.




ఊరి పెద్దలు అయిదుగురు వరుసగా రాణో ముందు నుంచున్నారు. అమాయకుడైన మంగళ్ ఆరోవాడు. హజూర్ సింగ్ రాణో వీపుమీద తట్టి "బిడ్డా! ఏమిటి ఇదంతా? సంఘటనలన్నీ ఇలా ఎందుకు తిరిగాయి? దీనికి సమాధానం నీకు తెలీదు. నాకూ తెలీదు. ఇక్కడున్న వాళ్ళలో ఎవరికీ తెలీదు. ఈ రహస్యాన్ని ఛేదించడానికి ప్రయత్నించకు. సరియైన సమాధానం మౌనమే. నిశ్శబ్దాన్ని పాటించు" అన్నాడు.

రాణో పక్కకు తిరిగి తన కూతురి వైపు చూసింది.

వద్దీ ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్లుగా ఉంది. ఆమె తన నోరు తెరవలేదు.



కాని ఆమె ముఖంలో భావాల్ని చూసి తాను కనుక 'కాదు' అంటే, తాను వివాహం కాకుండా ఉండి పోవడానికి తననే శాశ్వతంగా బాధ్యురాలిని చేస్తుందని రాణో గ్రహించింది.

రాణో తన తలని మామగారి గుండెల మీదనుంచి తీసి పైకెత్తి స్పష్టమైన స్వరంతో "బాపూ! మీ కోరిక ప్రకారమే కానీండి" అంది.

రాణో యొక్క నిర్ణయాన్ని అక్కడ జేరిన జనం ఊపిరి బిగపట్టి విన్నారు. అప్పటికప్పుడు కొందరు ప్రధానం కోసం బహుమతులు తెచ్చారు. ఉత్సాహం పట్టలేక వాళ్ళు పాడుతూ, ఆడుతూ, అరుపులు అరవసాగారు. రాణో తల ఎత్తి అమ్మవారి దేవాలయం వైపు చూసింది. కృతజ్ఞతా భావంతో కళ్ళనీరు వచ్చి చెంపలమీద నుంచి కారసాగింది. దైవానుగ్రహం పొందినట్లున్న చిరునవ్వు ఆమె ముఖంలో తాండవించింది.

నెమ్మదిగా జనం కదిలిపోయారు. సాయంసంధ్య ముదిరి రాత్రిలో కలిసి పోయింది. కటిక చీకటిలో కూడా రాణో ముఖంలో జ్యోతి ప్రకాశిస్తోంది. గుడి గంటలు లయబద్ధంగా మ్రోగసాగాయి. మసీదులో ముల్లా ప్రార్థనలకి పిలవ సాగాడు. గుడి శిఖరంమీద రాణోకి ఒక స్త్రీ ఆకారం కనిపించింది. ఆమె పొడుగు పాటి జుట్టు భుజాలమీదుగా వ్రేలాడు తోంది. రాణో ఆ ఆకారం వంక చూస్తూ "అమ్మా మాతా! జగన్మాతా" అంటూ అరవసాగింది. ★

"వాల్టర్! నాకు నీవు తాగే టీ కప్పులో భవిష్యత్ సంఘటన కన్పిస్తోంది. వచ్చే ఆదివారం రాత్రికి పట్టణంలో రెండు హత్యలు జరుగుతాయి. ఈ రెండు హత్యలే కాక ఒక పోలీసుకు తుపాకి గుండు తగిలి తీవ్రంగా గాయ పడ్తాడు. ఆ ఇద్దరు మరణించేవారిలో ఒకరు వ్యాపారి, మరొకరు సామాన్య పౌరుడు. ఈ హత్యలు ఎక్కడ అవు తాయో మాత్రం చెప్పలేను" అని మాదామ్ మంటల్ సూపరింటెండెంట్ తో గంభీరంగా అంది.

మాదామ్ మంట్ - వాల్టర్ భార్య స్నేహితురాలు. అప్పుడు భార్యాభర్త లిద్దరు మాదామ్ ఇంట్లో టీ తాగుతున్నారు.

వాల్టర్ 16సంవత్సరాలనుండి పోలీసు డిపార్ట్ మెంట్ లో పనిచేస్తున్నాడు. ముఖం చూసి భావాల్ని కనిపెట్టడంలో ప్రవీ ణుడు. మాదామ్ ఈ విచిత్రమైన భవిష్య ద్వాణిని చెబుతూంటే చూపుల్ని ఆమె ముఖంపైనే కేంద్రీకరించాడు. మాదామ్ నేత్రాల్లో భయం కనిపిస్తోంది. దీర్ఘంగా శ్వాస పీలుస్తోంది. ముఖం పాలిపోయింది. కుడిచేతితో బల్ల మూలను గట్టిగా పట్టు కొంది.మాదాం ఇలా ఇంతకుముందెన్నడూ భవిష్యద్వాణి చెప్పలేదు.

వాల్టర్ దంపతులు ఇంటికి చేరు కున్నారు. మాదామ్ చెప్పిన భవిష్యద్వాణి వాల్టర్ మస్తిష్కంలో ఎన్నో ఆలోచ నల్ని రేకెత్తిస్తోంది. మాటి మాటికీ రెండు శవాలు తన కండ్లముందు కదలాడు తున్నాయి. తెల్లవార్ ఆఫీసులో భవిష్య ద్వాణి ఆలోచనలవల్ల ఏ పనీ సరిగ్గా చేయలేకపోయాడు.



మరునాటి ఉదయం వాల్టర్ పోలీసు శాఖ కార్యాలయంకి వెళ్ళాడు. కాని చాలా సేపటివరకు కార్యాలయం ముందు సంది గ్ధంగా నిలుచున్నాడు. తరువాత పోలీస్ కమీషనర్ గదిలోకి వెళ్ళాడు. కమీషనర్ చిరునవ్వుతో ఆహ్వానించి కుశల ప్రశ్నలు వేశాడు.

వాల్టర్ చెప్పాలనుకుంటున్న విష యాన్ని చెప్పలేకపోతున్నాడు. చివరకు అతి కష్టంగా "సర్! మీకు జ్యోతిష్యం పైనగాని,భవిష్యద్వాణి పైనగాని నమ్మకం లేదని నాకు తెలుసు. అయినా నేనో విషయం చెప్పాలని వచ్చాను. వచ్చే ఆది వారం రాత్రి నగరంలో దొంగతనం జరుగుతుంది. ఆ దొంగతనం సందర్భంగా రెండు హత్యలు జరుగుతాయి. ఒక పోలీ సుకు గాయాలు తగులుతాయి. ఈ విష యాన్ని మరెవరికీ చెప్పకండి" అన్నాడు.

ఈ మాటలు విన్న కమీషనర్ వాల్టర్ వైపే ఆశ్చర్యంగాచూశాడు. ఈ మాటలు చెప్తున్నది వాల్టరే అని కమీషనర్ కు విశ్వాసం కలగటంలేదు. వాల్టర్ కు రాత్రి ఏదో పీడకల వచ్చి ఉండాలని అనుకున్నాడు.

మాదామ్ 'భవిష్యద్వాణి' మూడు రోజులవరకు వాల్టర్ కు శాంతిలేకుండా చేసింది. సోమవారం ఉదయం రోజూ లాగే తయారై 7.30 గంటలకు పోలీస్ హెడ్ క్వార్టర్స్ చేరుకున్నాడు. కమీషనర్ అంతకుముందే ఆఫీసుకు వచ్చి వాల్టర్ కోసం ఆత్రంగా నిరీక్షిస్తున్నాడు. వాల్టర్ రాగానే చరచరా తనవెంట గదిలోకి తీసి కొని వెళ్ళాడు.

కమీషనర్ కుర్చీలో కూర్చుంటూ "భవిష్యద్వాణి చెప్పిన స్త్రీ పేరేమిటి?" అడిగాడు.

"మాదామ్ మంటల్" వాల్టర్ సంక్షి

ష్టంగా జవాబిచ్చాడు.

"మాదామ్ భవిష్యద్వాణి అక్షరాలా నిజమైంది" అని కమీషనర్ అన్నాడు. "రాత్రి 11-30 గంటలకు కాలిఫోర్నియా థియేటర్‌లో దొంగతనం జరిగింది. థియేటర్ మేనేజర్ తుపాకి గుండువల్ల మరణించాడు. హంతకులు పారిపోయారు. కొందరు వ్యక్తులు హంతకులు పారిపోతుండగా చూశారు. వారు కారు నెంబర్, హంతకుల పోలికల్ని పోలీసులకు చెప్పారు. వెంటనే అన్ని పోలీసు స్టేషన్లకు ఈ విషయాన్ని తెలియచేశారు. ఇద్దరు పోలీసులు తూర్పు ప్రాంతంలో గస్తీ తిరుగుతుండగా, వేగంగా వెళ్తున్న కారును గుర్తించారు. మోటారు సైకిళ్ళపై వెంబడించి ఫైరింగ్ చేశారు. ఇరువైపుల నుండి కాల్పులు జరిగాయి. ఆ కాల్పుల్లో ఒక పోలీసు తీవ్రంగా గాయపడ్డాడు. మరో పోలీసు వైర్‌లెస్ ద్వారా హెడ్ క్వార్టర్స్ సహాయం కోరాడు. ఇంతలో దొంగలు పారిపోయి ఒక భవనంలో దాక్కున్నారు. కొంచెం సేపట్లోనే పోలీసులు ఆ భవనాన్ని చుట్టుముట్టారు. ఒక దొంగ వెంటిలేటర్ ద్వారా బయటకి రావడానికి ప్రయత్నం చేస్తుండగా పోలీసులు గుండ్లవర్షం కురిపించారు. వెంటనే అతడు అక్కడికక్కడే మరణించాడు" అని కమీషనర్ చెప్పాడు.

మరుసటి రోజు పోలీస్ కమీషనర్ పత్రికా విలేఖరులకు జరిగిన విషయాన్ని చెప్పేశాడు. ఈ వార్త చదవడంతోనే వందలకొద్దీ ప్రజలు తమ భవిష్యత్తు తెలుసుకోవాలని మాదాం ఇంటికి రాసాగారు. కాని మాదామ్ "నేను వృత్తి రీత్యా జ్యోతిష్కురాలను కాను. నేను చెప్పిన భవిష్యద్వాణి కాకతాళీయం. ఇదెలా నిజమైందో నాకే ఆశ్చర్యంగా ఉంది" అంది.

మాదామ్ ఇదే మాటను వందసార్లు అడిగినవారికల్లా చెప్పవలసివచ్చింది.

* * *

ఇలాంటిదే మరో సంఘటన. దేవన్ అనే స్త్రీకి తనకు వచ్చే కలల్లో భవిష్యత్తులో జరుగబోయే విషయాలు తెలిసేవి. నాలుగు గుర్రాల నల్లబగ్గి దేవన్ కలలకు ఆధారం. దేవన్‌కు ప్రప్రథమంగా 12 సంవత్సరాల వయస్సులో నల్ల బగ్గికి చెందిన కల వచ్చింది. అప్పుడు కాన్వెంట్‌లో చదువుకుంటోంది. ఒక రాత్రి దేవన్‌కు విచిత్రమైన కల వచ్చింది. ఆ కల ఇలా వచ్చింది: దేవన్ నాలుగు గుర్రాల బగ్గిపై కూర్చొని ఎక్కడికో వెళ్తోంది. బగ్గి ఒక భవనంముందు ఆగింది. దేవన్ బగ్గి దిగి ఆ భవన వెనకద్వారం నుండి ఒక గదిలోకి వచ్చింది. ఆ గది చాలా చీకటిగా ఉంది. బెడ్‌పై ఒక వయస్సుమళ్ళిన వ్యక్తి ముఖం మాత్రం స్పష్టంగా కన్పిస్తోంది. కొంచెంసేపు అక్కడే నిలబడి బయటికి వచ్చింది. భవనం బయట విషాదచిహ్న దుస్తులు ధరించిన ఒక స్త్రీ కూర్చొని ఉంది. ఆ స్త్రీ చుట్టూ చాలామంది కూర్చొని ఏదో గుసగుస లాడుతున్నారు.

మరుసటి రోజు దేవన్ స్నేహితురాలు యులెండాకు తన తండ్రి ప్రమాదకరమైన జబ్బుతో ఉన్నాడని టెలిగ్రాం వచ్చింది. యులెండా ఇంటికి చేరుకున్న కొద్దిసేపటికే తండ్రి మరణించాడు. దేవన్ తన మిత్రురాలి ఇంటికి సంతాపాన్ని ప్రకటిద్దామని వెళ్ళింది. యులెండా ఇంటిని చూడగానే దేవన్ ఒక్కసారి దిగ్భ్రాంతురాలైంది. ఎందుకంటే రెండురోజులక్రితం

తాను కలలో చూసిన భవనం అచ్చం ఇలాగే ఉంది. యులెండా తండ్రి శవాన్ని ఉంచిన గది, కలలో చూసిన గదిలాగే ఉంది. దేవన్ యులెండా తల్లిని చూడగానే గుర్తించింది. తాను కలలో చూసిన విషాద చిహ్నా దుస్తులు ధరించిన స్త్రీ ఈమే.

వెంటనే దేవన్ ఇంటికి పరుగెత్తి తన కొచ్చిన కలను తల్లికి వివరించింది. అప్పుడు దేవన్ తల్లి ఇలా చెప్పింది "ఆ నాలుగు గుర్రాల బగ్గీ మన వంశానికి చెందిన ప్రేతం. 1652 నుండి ఆ ప్రేతం రూపం దాల్చింది. మన వంశంలోని ఒక పూర్వీకుడు బిషప్ రికట్ క్రామ్‌వెల్ అత్యాచారాలకు విసిగిపోయి నాలుగు గుర్రాల బగ్గీపై పారిపోతూ పట్టుబడ్డాడు. క్రామ్‌వెల్ ప్రభుత్వం అతనికి మరణశిక్ష విధించింది. అతని సోదరుడైన మార్క్స ఆస్తినంతా స్వాధీనం చేసుకొని దేశం నుండి వెళ్ళగొట్టింది. మార్క్స కూడా మార్గ మధ్యంలోనే మరణించాడు. చనిపోయేప్పుడు అతడు కూడ ఆ బగ్గీలోనే ప్రయాణం చేస్తున్నాడు. 1740 లో కోనల్ కుటుంబంలోని ఒక వ్యక్తి మొదటిసారి ఆ బగ్గీని స్వప్నంలో చూశాడు. ఆ తరువాత బగ్గీ కుటుంబ సభ్యులందరికీ కన్పించసాగింది. ఒకసారి మీ తాత దేనియల్ తన కలలో ఆ బగ్గీపై కూర్చుని ప్రయాణం చేస్తున్నాడు. బగ్గీ బోస్టన్‌లోని అతని పినతండ్రి ఇంటిముందు ఆగింది. ఆ ఇంటిలోని ఒక గదిలో మీ తాత తల్లి పడుకొని ఉంది. దృష్టి దోషం వల్ల మీ తాతను గుర్తించలేక పోయింది.

మీ తాత ఇలా కలగంటున్న సమయంలోనే ఆయన నాయనమ్మ వచ్చి నిద్రలేపి "టెలిఫోన్ మ్రోగుతోంది" అని చెప్పింది. మీ తాతయ్య రిసీవర్ ఎత్తాడు. ఫోన్ చేసేది బోస్టన్‌లోని తన పినతండ్రి అని గుర్తించాడు.

ఫోన్‌లో ఏ విషయమూ చెప్పకముందే "అమ్మ చనిపోయిందని చెప్పాలనుకుంటున్నావా" అన్నాడు.

మీ తాతయ్య తల్లి చనిపోయి అప్పటికి 15 నిమిషాలే అయింది. అతడు అందరి కంటే ముందు మీ తాతయ్యకే ఫోన్ చేశాడు.

* * *

అమెరికా అధ్యక్షుని ఎన్నికల ఫలితాలు ప్రకటించబడ్డాయి. అబ్రహాం లింకన్ రెండవసారి అధ్యక్షునిగా ఎన్నుకోబడ్డాడు. లింకన్ పార్టీ కేంద్ర కార్యాలయం నుండి వైట్‌హౌస్‌లోకి ప్రవేశించాడు. ఎన్నో రోజుల్నుండి నిద్రలేదు. విశ్రాంతిగా కూర్చుందామని సోఫాలో వాలాడు. తన దృష్టి ఎదురుగా వున్న నిలువుటద్దంపై పడింది. అతనికి ఆ అద్దంలో రెండు ముఖాలు కన్పించసాగాయి. అందులో ఒక ముఖం చాలా ఆనందంగా, మరో ముఖం విషాదంగా పాలిపోయి జీవంలేనట్లు ఉంది. ఈ దృశ్యాన్ని చూడగానే లింకన్ నివ్వెరపోయి లేచి కూర్చున్నాడు. అతడు మళ్ళీ అద్దంలోకి చూశాడు. కాని ఇప్పుడేమీ కన్పించడం లేదు. అతడిలాగే ఇంతకు ముందు ఎన్నోసార్లు తన ముఖం ప్రతిబింబాల్ని చూశాడు. అతడితో ఎవరో అజ్ఞాతవ్యక్తి "రెండవసారి అధ్యక్షుడుగా ఉన్నప్పుడు నీవు హత్య చేయబడతావు" అన్నట్లు అనిపించ సాగింది.

మార్షల్ హిల్‌మెన్ "లింకన్ రెండవసారి అధ్యక్షుడుగా ఎన్నుకోబడినపుడు, ఆయనకు ఇక తన మృత్యువు తప్పదనే

నమ్మకం కలిగింది" అని చెప్పాడు. లింకన్ ఇంతకంటె నమ్మకంగా, ఇంకొక నెలకు హత్య చేయబడతాడనగా ఒక స్వప్నం ద్వారా తెలుసుకున్నాడు. లింకన్ తన మిత్రులతో తనకొచ్చిన స్వప్నం గురించి ఇలా చెప్పాడు-

"ఒక రాత్రి నేను చాలా ఆలస్యంగా నిద్రపోయాను. తొందరగానే నిద్ర పట్టింది. నా కలలో నేను కార్యాలయంలో ఒంటరిగా కూర్చొని ఉన్నాను. ఇంతలో ఎవరో వెక్కి వెక్కి ఏడుస్తున్న శబ్దం వినపడసాగింది. ఆఫీసు నుండి బయటకువచ్చి మెట్లు దిగి వైట్‌హౌస్‌లోని ఒక్కొక్క గదిని వెదికాను. ఎవరూ లేరు. వెక్కి వెక్కి ఏడుస్తున్న శబ్దం మాత్రం వినిపిస్తూనే ఉంది. గదుల్లో లైట్లు వెలుగుతున్నాయి. నా మనసులో పరిపరి భావాలు కలుగసాగాయి. ఆ గదిని, ఈ గదిని గాలిస్తూ తూర్పుగా ఉన్న హాల్ కు వెళ్ళాను. ఆ హాల్ మధ్య ఒక శవముంది. శవం నాలుగువైపులా బాడీగార్డ్స్ నిలుచుని ఉన్నారు. శవం ముఖం గుడ్డతో కప్పబడి ఉంది. శవం చుట్టూ చాలామంది నిలబడి ఉన్నారు. అందులో కొందరు ఏడుస్తుంటే, మరికొందరు విచార వదనాలతో నిలబడ్డారు. నేనొక సైనికుణ్ణి "చనిపోయిందెవరు" అని ప్రశ్నించాను. "గౌరవనీయుడైన అధ్యక్షుడు. ఆయన్ను ఎవరో చంపేశారు" అని జవాబిచ్చాడు. ఆ తరువాత జన సమూహం ఒక్కసారి గోల చేసింది. నేను చటుక్కున నిద్ర నుండి మేల్కొన్నాను"

14 ఏప్రిల్ 1865 సాయంత్రం 7 గంటలకు లింకన్ ప్రధాన బాడీగార్డ్ అయిన క్రంక్ తన ఇంటికి వెళ్తూ "గౌరవనీయమైన అధ్యక్షా! గుడ్ నైట్" అన్నాడు.

"గుడ్‌బై" లింకన్ అన్నాడు.

క్రంక్ ఇంటికి వెళ్తూ ప్రెసిడెంట్ రోజూ 'గుడ్‌నైట్' అనేవాడు. ఈ రోజు 'గుడ్‌బై' అని ఎందుకన్నాడా? అని ఆలోచిస్తూ ముందుకు సాగాడు.

సరిగ్గా 8 గంటల తరువాత క్రంక్ సమస్య పరిష్కరించ బడింది. లింకన్ హత్య చేయబడ్డాడు.

* * *

హెరాల్డ్, అతని మిత్రుడు జెక్ ఇద్దరూ కలిసి సెలవులు గడపటానికి నిశ్చయించారు. వారి ప్రోగ్రాం సముద్రంలో చేపల్ని పట్టడం. కాని వారు బయలుదేరే సమయానికే రేడియోలో తుఫాను రాక హెచ్చరిక చేశారు. హెరాల్డ్ భార్య ప్రోగ్రాంను వాయిదా వేయమని కోరింది. జెక్ భార్య కూడా భర్తను వెళ్ళవద్దని చెప్పింది. కాని వారిద్దరు భార్యల మాటల్ని లక్ష్యపెట్టలేదు. సముద్రం వైపు బయలుదేరారు.

వాళ్ళు కొంచెం దూరం వెళ్ళగానే గాలి తీవ్రమైంది. తుఫాను వాతావరణం నెలకొనసాగింది. అయినా వారు పోర్ట్ వాషింగ్టన్ వైపు ప్రయాణం సాగించారు.

హెరాల్డ్ "నాకు రాత్రి ఏ మాత్రం నిద్ర పట్టలేదు" అని తన నిద్రలేమి కళ్ళని నలుపుకుంటూ అన్నాడు.

"అలాగా! ఎందుకో మరి నాక్కూడా రాత్రి నిద్ర కరువయింది" అని జెక్ తలను కారు స్టీరింగ్‌పై ఆన్చాడు.

సముద్ర తీరానికి వెళ్ళి పడవల వారి దగ్గరకి వెళ్ళారు. వారు "తుఫాను వచ్చేట్లుంది. చాలా ప్రమాదం" అని హెచ్చరించారు.

హెరాల్డ్, జెక్‌లు పడవలవారి హెచ్చ

రికల్ని లక్ష్యపెట్టక ఒక మోటార్ బోట్‌ను అద్దెకు తీసుకొని సముద్రంలోకి ఉరికించారు. కొంచెం దూరం వెళ్ళగానే తుఫాను తీవ్రమైంది. మోటార్ బోట్ ఊగిసలాడసాగింది. భయంకరమైన కెరటాల దెబ్బలు మోటారు బోట్‌కు తాకి బంతిలా పైకి లేస్తోంది. తీరానికి చేరుకుందామని ప్రయత్నించినా మోటార్ బోట్ ముందుకు సాగటం లేదు. అకస్మాత్తుగా హెరాల్డ్ నిద్రమత్తులో తూలసాగాడు. జెక్ వెంటనే తట్టి లేపి మోటార్ బోట్‌ను జాగ్రత్తగా డ్రైవ్ చేయమని హెచ్చరించాడు. కాని హెరాల్డ్ నిద్రలో జోగుతూ లేడు, మేల్కొనే ఒక కల కంటున్నాడు. ఆ కలలోని దృశ్యం ఇలా ఉంది. కొద్ది దూరంలో ఇద్దరు వ్యక్తులు సముద్రంలో మునిగి పోతున్నారు. ఆ ఇద్దరూ ప్రయాణిస్తున్న బోట్ పల్టీ కొట్టింది. వారిద్దరూ నీటిలో మునకలు వేస్తున్నారు. హెరాల్డ్‌కు వచ్చిన ఈ స్వప్నం అతనిపై ఎంతటి భయంకర ప్రభావం చూపించిందంటే, అతడు వెంటనే బోటును విశాలమైన సాగరం మధ్యకు ఉరికించాడు. అకస్మాత్తుగా కొంచెం దూరంలో ఏదో నల్లని వస్తువు కన్పించ సాగింది. మోటార్ బోట్ దగ్గరికి రాగానే ఆ నల్లని వస్తువు ఒక వ్యక్తి అని గ్రహించారు. హెరాల్డ్ వెంటనే నీటిలో దూకి అతణ్ణి మోటారు బోట్ పైకి తెచ్చాడు. తానొక మిత్రునితో చేపల వేటకు వచ్చామని, మోటారు బోటు నీటిలో మునిగి పోవటంవల్ల ఇద్దరం సముద్రంలో పడి పోయామని చెప్పాడు. హెరాల్డ్ వెంటనే అతని మిత్రుని కోసం చుట్టూ వెతక సాగాడు. దాదాపు ఒక మైలు దూరంలో వారికి మోటార్ బోట్ కనిపించింది. మోటార్ బోట్ కొక్కేనికి కట్టి ఉన్న త్రాడు ఇంజన్‌లో చిక్కుకొని పోవడంవల్ల, ఆ త్రాడును విడవకుండా పట్టుకోవడంవల్ల అతడు అలాగే కొట్టుకొని పోతున్నాడు. హెరాల్డ్ తక్షణమే అతణ్ణి తమ మోటార్ పైకి లాగాడు. హెరాల్డ్ - "జెక్ ! మన కార్యక్రమం విజయవంతమైంది. ఇక మనం వెళ్ళిపోవాలి, ప్రకృతి వీళ్ళిద్దర్నీ రక్షించడానికే మనల్ని పంపినట్లుంది. అందుకే మనకు ఎన్నో హెచ్చరికలు లభించాయి" అన్నాడు.

* * *

రమ్‌లాకు కలలు గనటం అలవాటు. రమ్‌లా కనే కలలు చాలావరకు యదార్థాలయ్యేవి. తమ కూతురు అదేపనిగా కలలు గనటంవల్ల తల్లిదండ్రులు రమ్‌లాను ఒక మానసిక వైద్యునికి చూపించారు. వైద్యుడు పరీక్షించి 'మెంటల్ వీక్‌నెస్' అని, మనోవైజ్ఞానిక చికిత్స చేయించమని సలహా ఇచ్చాడు. చికిత్స జరిగింది. అయినా కలలు రావటం తగలేదు.

రమ్‌లా తల్లి హంగరీలో గొప్ప సినీ నటి. ఒకనాడు రమ్‌లాకు విచిత్రమైన, భయంకరమైన కల వచ్చింది. రమ్‌లా తల్లి తల దువ్వుకొంటోంది. అకస్మాత్తుగా పొట్టిగా ఉండే ఒక స్త్రీ గదిలోకి ప్రవేశించి పిస్తోలు పేల్చింది. గుండు రమ్‌లా తల్లికి తగిలి క్రింద పడిపోయింది.

ఈ భయంకరమైన స్వప్నం రాగానే రమ్‌లా నిద్రలేచి పరుగెత్తుతూ తన తల్లి గదికి వెళ్ళి భయంతో వణుకుతూ కలను వినిపించింది. అప్పుడు సమయం ఉదయం 5 గంటలవుతోంది. తల్లి చిరునవ్వుతో రమ్‌లాను తన ఒడిలో చేర్చుకుంది.

ఉదయం 8 గంటలకు రమ్‌లా తల్లి స్టూడియోకి వెళ్ళటానికి తయారు

కాసాగింది. డ్రెస్సింగ్ రూంలో మేకప్ చేసుకోవడంలో నిమగ్నురాలైంది. ఇంతలో ఇంటిలోని వారికి ఏదో పేలిన శబ్దం, దానితోపాటు కేక వినబడ్డాయి. అందరూ భయంతో రమ్‌లా తల్లి డ్రెస్సింగ్ రూంవైపు పరుగెత్తారు. రమ్‌లా తల్లి రక్తం మడుగులో గిలగిల లాడుతోంది. చేతిలో దువ్వెనుంది. హంతకురాలు రమ్‌లా ఇంట్లో ఇంతకుముందు పనిచేసిన నౌకరు. పొట్టిగా ఉంది. ఆమెని రమ్‌లా తల్లి కొన్ని రోజులముందే ఉద్యోగంనుండి తీసి వేసింది.

* * *

కింఘమ్ తన స్నేహితుడైన న్యూటన్‌తో బాబాయి సేవార్డ్ ఇంట్లో ఉంటున్నాడు. సేవార్డ్‌కు ఎనా, హనోరా అనే ఇద్దరు కూతుళ్ళున్నారు. ఆంధ్రే ఒక సైనికాధికారి. ఆంధ్రేకి, హనోరాను వివాహం చేసుకోవాలనే అభిప్రాయముంది. ఒకనాడు ఆంధ్రే, హనోరాను వివాహానికి అంగీకరింప చేద్దామని వచ్చాడు. అయితే హనోరా ఆంధ్రేను వివాహం చేసుకోవటానికి ఇష్టపడలేదు. అదే రాత్రి కింఘమ్‌కి ఒక విచిత్రమైన కల వచ్చింది. ఆ కల ఇలా ఉంది. ఆంధ్రే ఒక గుర్తు తెలియని ప్రదేశంలో ముగ్గురు సైనికుల చేతుల్లో పట్టుబడ్డాడు. అతని జేబులు వెతికి రహస్యమైన పత్రాలు, దస్తావేజులు కనుగొన్నారు. గూఢచారిత్వ ఆరోపణపై మరణశిక్ష విధించారు. తెల్లవారగానే కింఘమ్ ఈ కలను అందరికీ వినిపించాడు.

1774 లో ఆంధ్రే అమెరికా వ్యతిరేకంగా పోరాడేందుకు న్యూయార్క్ వెళ్ళాడు. అమెరికా జనరల్ ఆర్నాల్డ్ జూదరి, త్రాగుబోతు. అమెరికాలోని గొప్ప గొప్ప వ్యక్తుల వద్ద లక్షలకొద్దీ డాలర్లు అప్పుచేశాడు. ఈ అప్పులు తీరే మరో మార్గం లేక అమెరికా యుద్ధ రహస్యాలు బ్రిటానియాకు అమ్మటానికి నిశ్చయించాడు.

బ్రిటానియా కమాండర్ హెన్రీ కల్ఫ్టన్ రహస్య పత్రాల్ని తెచ్చేందుకు ఆంధ్రేను నియమించాడు. మేజర్ ఆంధ్రే నావికా సైన్య ఓడలో రహస్యంగా, చీకటిలో నిర్ణయించిన స్థానం చేరుకున్నాడు. జనరల్ ఆర్నాల్డ్ అంతకు ముందే ఆంధ్రే కోసం వేచి చూస్తున్నాడు. ఆంధ్రే ఇచ్చిన డబ్బు తీసికొని, అమెరికా సైన్య రహస్యాలు, దస్తావేజులు ఆంధ్రేకు అప్పగించాడు.

ఆంధ్రే ఓడ తీరంలో నిలిచి ఉంది. అమెరికా సైనికులు పసిగట్టి ఫైరింగ్ చేయసాగారు. ఓడ కెప్టెన్, ఆంధ్రే ఓడ పైకి రాకముందే పారిపోయాడు. ఆంధ్రే అపాయాన్ని గ్రహించి చకచకా తన సైనిక దుస్తుల్ని విడిచేసి, సాధారణ పౌరులు ధరించే దుస్తులు వేసుకొని బయలుదేరాడు. ఒకచోట డ్యూటీలో ఉన్న అమెరికా సైనికులు ఆంధ్రేను అనుమానించి సోదా చేశారు. గుట్టు బయట పడింది. అమెరికా కమాండర్ వద్దకు తీసుకొని వెళ్ళారు. కమాండర్ జనరల్ ఆర్నాల్డ్ స్వదస్తూరి పత్రాల్ని చూసి దిగ్భ్రమ చెందాడు. అతడు వెంటనే జార్జి వాషింగ్టన్‌తో సంప్రదించాడు. కాని ఆర్నాల్డ్‌ను పట్టుకోక ముందే పారిపోయి న్యూయార్క్‌లో గల బ్రిటానియా సైనిక హెడ్ క్వార్టర్స్‌లో తలదాచుకున్నాడు.

ఆంధ్రేను సైనిక న్యాయస్థానంలో విచారణ జరిపి మరణశిక్ష విధించారు. *

# చూసి తెమ్మంటే..

లోభారావు పిసినారి, ఎంగిలి చేత్తో కాకిని కూడా తోలడు. అందుకే వాళ్లింటి ఆవరణలో ఒక్క కాకికూడా కన్పించదు. ఒక్కడు కూడ అతనిచ్చే జీతానికి పట్టుమని పదిరోజులైనా పని చేయలేదు.

ఇలా అయితే లాభం లేదని ఓ బుర్ర లేని వెధవైతే కయి, కుయి మనకుండా పడి వుంటాడన్చెప్పి, వెతికి వెతికి ఓ తల మాసిన వెంకయ్యని పన్లో కుదుర్చుకున్నాడు.

నిజంగా బుర్రలేనివాడు కాబట్టి వెంకడు స్వామి భక్తిని ప్రదర్శించుకుంటూ లోభారావుగార్ని సేవించుకుంటున్నాడు.

కానీ వాడి తెలివి తక్కువ పన్లకి




మాత్రం లోభారావుగారు ఎప్పుడూ విసుక్కుంటూండేవారు. పైగా ఏదైనా పని చెప్పేటపుడు సవాలక్ష జాగ్రత్తలు చెప్పి మరీ పంపవలసి వచ్చేది.

ఓ రోజు లోభారావు, వెంకయ్యొ బజారునించి తెచ్చిన సామాన్లు లెక్క చూస్తూ-

"ఏవిరా అగ్గిపెట్టి తేలేదేమిరా ?" అనడిగాడు కోపంగా.

"తసాస్పదియ్యా ! మర్చిపోన్నండి నించంలో తెస్తాను" అని పరుగెట్ట బోయేడు.

"ఆగరా ! అన్నీ తొందరే నీకు ! పువ్వుమార్కున్న అగ్గిపెట్టెతీసుకురా, అది కొంచెం చవక. పుల్లలన్నీ సరిగా వున్నాయో లేదో చూసి అసలు వెలిగే రకమో కాదో తేల్చుకుని మరీ పట్టుకురా! ఏం !"

"అట్టాగేనండి" — గబ గబ పరుగు తీశాడు వాడు. పావుగంట గడిచింది.

అగ్గిపెట్టితో ప్రవేశించాడు వెంకడు. లోభారావు అందుకొని పెట్టితెరిచి నిర్ఘాంతపోయి —

"ఏవిరా ! అన్నీ కాలిపోయిన పుల్లలున్నాయి" అని నెత్తి బాదుకున్నాడు.

"మీరేకదండి బాబయా ! అన్నీ కాలుతాయో నేదో సూడమన్నారు" అన్నాడు వెంకడు అమాయకంగా.

—కొండూరి కమలకుమారి

# కరెన్సీ ప్రేమలేఖలు

స్వరూపరాణి కాలేజీ నుంచి ఇంటికి వస్తుండగా మన్మథరావు ఆమె చేతిలో ఓ కనకాంబరం రంగు కవరు పెట్టి

గబగబా వెళ్ళిపోయాడు.

ఇంటికొచ్చాక కవరు చించి చూసింది స్వరూపరాణి. కవర్లో అయిదు రూపాయల నోటుకి ఒక వైపున వుండే తెల్లని భాగం మీద "ఐ లవ్ యు" అని రాసి వుంది. స్వరూపరాణి నవ్వి, నోటుని మడిచి పుస్తకంలో పెట్టుకుంది.

సరిగ్గా వారం తరువాత మళ్ళీ మన్మధరావు కాలేజీ నుంచి వస్తున్న స్వరూపరాణి చేతిలో ఓ కవరు పెట్టి మాయమయ్యాడు. స్వరూపరాణి రోడ్డుమీద నడుస్తూనే కవరు చింపి చూసింది. పది రూపాయల నోటుమీద "ఐ లవ్ యు సోమచ్" అని వుంది. స్వరూపరాణి ముసిముసిగా నవ్వి నోటుని మడిచి జాకెట్లోపల దాచుకుంది.

ఆ మర్నాటి నుంచి ప్రతి రోజూ కాలేజీ నుంచి స్వరూపరాణి బయటికి వచ్చేసరికి కిళ్ళీకొట్టు దగ్గర దర్శనమిచ్చేవాడు మన్మధరావు.

మళ్ళీ సరిగ్గా వారం తరువాత మన్మధరావు ఎప్పటిలాగే ఓ కవరు చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు. ఇంటికొచ్చాక చూసుకుంది. ఈసారి "ఐ లవ్ యు సోమచ్ మైడియర్" అని వుంది.

ఆ తరువాత స్వరూపరాణికి అందిన కవర్లో యాభై రూపాయల నోటు మీద తెలుగులో, ''నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను. నీవే నా సర్వస్వం. నా ప్రేమను కాదనకు'' అని వుంది

ఈసారి స్వరూపరాణి అతని ప్రేమ లేఖకి సమాధానంగా తను ఓ తెల్ల కాగితం మీద రాసి కవర్లో పెట్టి, కిళ్ళీకొట్టు దగ్గర నిలబడి వున్న మన్మధరావుని పిలిచి అతని చేతికి అందించి చిలిపిగా నవ్వింది. మన్మధరావు మొహం ట్యూబులైట్ లా వెలిగింది. కవర్ని ముచ్చటగా మూడుసార్లు ముద్దు పెట్టుకుని వుబ్బి తబ్బిబ్బయ్యాడు.

మన్మధరావు రూమ్‌కి వెళ్ళగానే అర్జంటుగా కవరు చింపి స్వరూపరాణి ప్రేమలేఖ తీసి చదవసాగాడు.

"మీరు రాసిన కరెన్సీ ప్రేమ లేఖలు చూస్తుంటే మీకు నా మీద అమితమైన ప్రేమ వుందనీ, రాత్రింబవళ్ళు నన్నే వూహించుకుంటూ, నా నామాన్నే జపిస్తున్నట్టుగా అర్థమవుతోంది. నిజంగా మీకు



నామీద అంత ప్రేమ వుండటం నా అదృష్టంగా భావిస్తున్నాను. ఇంతగా మీరు నన్ను ప్రేమిస్తున్నారు కనుక మిమ్మల్ని ఓ చిన్న కోరిక కోరదల్చాను. మీరు నా కోరిక తీరుస్తారనే నమ్మకం నాకెంతైనా వుంది. ఏం లేదు...ఈసారి మీరు నాకు ప్రేమలేఖ రాస్తారుగా అటువంటివి మరో వంద వొరిజినల్ కాపీలు జతచేసి పంపగలరు"

అంతే ! మన్మధరావు అటు తరువాత స్వరూపరాణికి ప్రేమలేఖ రాయటం గాని, ఆమె కంటికి కనిపించటంగాని జరగలేదు.

—యన్నం ఉమాపతి

# అలవాటు

వచ్చిన జాబు చదువుకున్నాడు రంగ నాధం. జాబు తీసుకొనేప్పుడు వుండిన ఉత్సాహం చదివిన తర్వాత కనపడలేదు. ఇట్లా అవుతుందనుకోలేదు. దిగులుగా కూర్చున్నాడు...

...ఒకే ఒక్క కూతురు. అందాల భరిణె. బి. ఏ. వరకు చదివించాడు. తల్లి లేనిలోటు తెలియకుండా పెంచాడు. గుణము, కులము, చదువు, సంస్కారము, ఆస్తి, అంతస్తు, అన్నీ వున్న అల్లుడు కావాలని, అమ్మాయి అన్నివిధాలా సుఖ పడాలని ఆశించి, గాలించి గాలించి, యీ పెళ్ళి చేశాడు. అన్ని విధాలా మంచి సంబంధం తెచ్చావని అందరూ యెంతో మెచ్చుకున్నారు. కాని, యింతలోనే యేదో ఒక అపశృతి. అమ్మాయికి యెట్లా గడుస్తుందో? చిక్కిపోయిందేమో ? అసలు వేళకు భోంచేస్తుందో, లేదో?... జేబులోని జాబుతీసి మళ్ళీ చదివాడు...

..."నాన్నగార్కి నమస్కృతులు. ఇక్కడంతా బాగుంది. అందరూ నన్నెంతో ప్రేమగా చూచుకుంటున్నారు. నాకు యే లోటు లేదు...కాని, మీ అల్లుడి గార్కి రాత్రుళ్లు నిద్రలో గురకపెట్టే అలవాటు వుంది. మరీ, ఇళ్లెగిరిపోయేంత యెక్కువగా వుంటుందా శబ్దం అప్పు డప్పుడు. నాకు బాధగా వుంది. రాత్రులు నాకు బొత్తిగా నిద్రపట్టడంలేదు. అందు వల్ల నా ఆరోగ్యం కూడా దెబ్బతింటుం దేమోనని భయంగా వుంది. అయినా, యిందులో మీరు చేయగలిగిందేమీలేదు. దిగులు పడకండి..."

ఎమీ చేయకుండా వుంటే యెలా ? అమ్మాయి జీవితాంతం యీ బాధ పడవల సిందేనా?...కాదు, యేదో ఒక మార్గం చూడాలి. వెంబడే వూరిలోవున్న కొంత మంది వైద్యులను సంప్రతించాడు. వాళ్ళ సలహాపై విశాఖపట్నం, హైదరాబాదు లకు వెళ్ళి అక్కడ కొంతమంది స్పెష లిస్ట్సను కలుసుకున్నాడు. ఈ అలవాటు లేకుండా చేసేందుకు యేదో మంచి ట్రీట్ మెంట్ వుందన్నారు. ఇన్ పేషంట్‌గా వుండాలన్నారు. ఖర్చు వేలల్లో అవుతుందన్నారు. నెల రోజులు అదేపనిగా తిరిగి తిరిగి, వివరాలన్నీ



సేకరించి యిల్లు చేసుకున్నాడు. ఈ ట్రీట్ మెంటుకు ముఖ్యంగా అల్లుడి కన్ సెంట్ అవసరం కదా! అమ్మాయికి వివరంగా జాబు వ్రాయాలి అనుకుంటూ యింటి బీగం తీసి తలుపు తీశాడు.లోపల ఒక ఇన్‌లాండ్ లెటర్ పడివుంది... అమ్మాయి వద్దనుండే...

"...సుమారు $1\frac{1}{2}$ నెలల నుండి మీ వద్దనుండి జాబులేదు. మీ పనుల వత్తిడి యెక్కువగా వుందను కుంటున్నాను.

క్షేమంగా వున్నారనుకుంటాను ... మీ అల్లుడిగారి 'గురక' వలన నాకు నిద్ర పట్టడంలేదు. బాధగా వుందని యింతకు మునుపు వ్రాశాను. కొత్తలో ఆ విధంగా వుండింది. ఇప్పుడు నాకు బాగా అలవాటై పోయింది. పక్కన ఆ 'గురక' వినపడందే యిప్పుడు నాకు నిద్ర పట్టడం లేదు. ఆయన యెప్పుడైనా క్యాంపులో వుండిపోయిన రోజు నాకు ఇక్కడ నిద్ర రావడంలేదు...

...యింతే సంగతులు" అని గట్టిగా చదువుకుంటూ యీజీచైర్‌లో చతికిల పడ్డాడు రంగనాథం. *

—టి. పద్మనాభదాస్

# మొలిచిన సౌధం

ఓ విదేశీ ఇంజనీరు ఇండియా చూద్దామని వచ్చేడు సరదాగా. తనతో బాటు ఇండియా అంతా తిరిగి అన్నీ చూపించి వివరించటానికి ఓ ఇండియన్ గైడ్‌ని కూడా కుదుర్చుకున్నాడు.

విలాసయాత్ర హుషారుగా సాగుతోంది. అన్నీ వివరంగా చూపిస్తున్నాడు గైడ్. దేశమంతా తిరుగుతూ హైదరాబాదొచ్చారు. 'చార్‌మినార్' చూశాడు విదేశీ ఇంజనీర్. 'ఇదేమిటి' అనడిగేడు గైడ్‌ని.

"దీన్ని చార్‌మినార్ అంటాం. దీన్ని కట్టి కొన్ని వందల ఏళ్లైంది. మా దేశం గర్వించదగ్గ గొప్ప కట్టడాల్లో యిదొకటి" అని గర్వంగా చెప్పాడు గైడ్.

"ఓస్! ఇదీ ఓ గొప్పేనా! మా దేశంలో యిలాంటి కట్టడాలు ఊరూరా వున్నాయి" తేలిగ్గా అన్నాడు ఇంజనీరు.

ఒళ్ళు మండింది గైడ్‌కి.

తరువాత ఆగ్రా వెళ్ళారు.

తాజ్‌మహల్‌ని చూసి "ఇదేమిటని" అడిగాడు విదేశీ ఇంజనీరు.

"ఇది తాజ్‌మహల్. ప్రపంచమంతా మెచ్చుకునే ప్రసిద్ధ కట్టడమిది. కోట్లాది రూపాయల వ్యయంతో, కొన్ని లక్షల మంది అనేక ఏళ్ళు కష్టపడి నిర్మించారు దీన్ని. తన భార్య స్మృతికి చిహ్నంగా షాజహాన్ దీన్ని నిర్మించాడు" ఉప్పొంగే హృదయంతో ఆనందంగా చెప్పాడు గైడ్.

"అబ్బబ్బ! ఏం చెప్తావయ్యా! ఇది కట్టడానికి ఏళ్లు పట్టిందా! ఇలాంటివి నా చేతి మీదుగా కొన్ని వందలు కట్టాను తెలుసా!" అన్నాడు విదేశీ ఇంజనీరు.

గైడ్‌కి అతన్ని చితక బాదాలన్నంత కోపం వచ్చింది.



ఇలా ఏది చూపిస్తే దానికి ఏదో వంకలు పెడుతూ తననూ, తన దేశాన్ని ఆకాశానికి ఎత్తేసుకుంటున్నాడు విదేశీ ఇంజనీరు.

ఢిల్లీ వచ్చి ఓ రోజు రెస్ట్ తీసుకొని మర్నాడు బయలుదేరారు ఊరు చూడడానికి.

దార్లో 'కుతుబ్ మినార్‌ని' చూసి "ఇదేమిటని" అడిగాడు విదేశీ ఇంజనీరు.

"ఏమో ! నాకు తెలియదండి. నిన్న సాయంత్రం మనం. వచ్చేటప్పటికి లేదు. రాత్రే మొలిచుంటుంది" చాలా తేలిగ్గా చెప్పాడు గైడ్.

అవాక్కయిపోయాడు విదేశీ ఇంజనీరు.

—కోనెనాగ
వెంకట ఆంజనేయులు

# మరో కోతి కథ

అనగనగనగా అదృష్టపురం అనే ఊరు వుంది. అక్కడో కోతి. దానికేమో తరతరాలకి సరిపడేలా డబ్బు సంపాదించెయ్యాలనే కోరిక ముల్లులాగా గుచ్చుకుంది. వెంటనే దేశాన్ని తిరుక్షవరం చేసేసిన ఓ మంగలి దగ్గరి కెళ్ళి ఆ ముల్లు తీయమంది. ఆ మంగలి ముల్లు తీసి పారేశాక "ముల్లిస్తావా ? కత్తిస్తావా ?" అని కోతి పంతం పట్టింది. ఆ మంగలికి ఏం చెయ్యాలో తోచక కత్తియిస్తే, దాన్ని పట్టుకుని మన కోతి అడ్డమయిన వాళ్ళపీకలూ తెగనరకడం ప్రారంభించింది. ఇలా వుండగా అక్కడేమో హోటలు వాళ్ళు బేరాలు చాలక కత్తులు కొనుక్కోలేక చేత్తోనే కర్రలు కొట్టుకోడం కనిపించింది. వాళ్ళమీద జాలిపడి, మనకోతి వాళ్ళకి కత్తి అరువిచ్చింది. దాంతో వాళ్ళు కర్రలు కొడుతూ వుంటే కత్తి విరిగిపోయింది. కోతి కోపంవచ్చి, "కత్తిస్తారా? కర్రయిస్తారా?" అని పీకలమీద కూచుంది. వాళ్లు చెరో కర్రయిచ్చి దాని బెడద వదిలించుకున్నారు. షోగ్గా అధికార మంత్రదండం లాగా వాటిలో ఓ కర్రని తిప్పుకుంటూ కోతి బయలుదేరింది. దార్లో ఓ పేద అవ్వ నిత్యావసర వస్తువులు అందుబాటులో లేకపోవడంతో పొయ్యిలో కాళ్ళు పెట్టుకొని రొట్టె కాల్చుకుంటోంది. మన కోతికి ఆ రొట్టె కూడా లాక్కోవాలని బుద్ధిపుట్టింది. కర్రలిచ్చి కాల్చుకొని రొట్టె తయారు చేయమన్నది. తీరా రొట్టె తయారయ్యాక "కర్రలిస్తావా? రొట్టె



యిస్తావా?" అని పేచీ పెట్టింది మనకోతి. అవ్వ చేసేదిలేక కోతికి ఆ రొట్టె ఇచ్చేసి కడుపులో కాళ్ళు పెట్టుకుని పస్తు పడుకుంది. కోతి రొట్టె పట్టుకుని బయల్దేరింది. దార్లో పిల్లల సంవత్సరం హడావిడితో అలిసిపోయి ఆకలితో ఏడుస్తున్న ఓ పాప కనిపించింది. ఆ పాప ఆకలి ఎలా తీర్చాలో తెలీక వాళ్ళ అమ్మానాన్నా దిక్కుతోచకుండా వుండిపోయేరన్నమాట. కోతి—రొట్టె పాప చేతిలో

పెట్టింది. పాపకాస ఆ రొట్టె తినేశాక "పిల్లనిస్తారా ? రొట్టెయిస్తారా ?" అని మళ్ళీ తగువు పెట్టింది కోతి. ఆ పేచీ భరించలేక వాళ్ళు పిల్లనిచ్చేశారు. ఆ పిల్లని తీసుకుని కోతి బయల్దేరింది. ఆ పాప పెరిగి పెద్దదయింది. ఇంతలో ఎర్ర టోపీలు పెట్టుకున్న గారడీవాళ్ళు కొందరు "న్యాయ సంరక్షణ" అనే గారడీ జనానికి చూపెడుతున్నారు. వాళ్ళు పిల్లని తీసుకున్నారు. ఆ గారడీ చేస్తుంటే ఆ పిల్ల కాస్తా కిందపడి హరీ మంది. జనం ఒకటే గొడవ చెయ్యడం ప్రారంభించారు. "పిల్ల పోతే పోయింది డప్పు ఇస్తే కాని వదిలేది లేదని" కూచుంది కోతి. ఆ ఎర్రటోపీల గారడీ వాళ్ళు దానికి డప్పు ఇచ్చేశారు. తుపాకుల్తోనూ లాఠీలతోనూ జనం గొడవ చల్లబడింది. శాంతి భద్రతలు సాధించేనని మన కోతి గొప్పలు చెప్పుకుంటూ, డప్పు వాయించుకుంటూ తిరుగుతూ ఇలా పాట ప్రారంభించింది. "ముల్లుపోయి కత్తి వచ్చె, కత్తిపోయి కర్రవచ్చె, కర్ర పోయి రొట్టెవచ్చె, రొట్టిపోయి పిల్లవచ్చె, పిల్లపోయి డప్పువచ్చె డాం! డాం!డాం!!!

—ఫంతుల జోగారావు

## రాజు-రాణి

ఎండాకాలం అవటం వల్ల డాబా మీద పక్కవేసుకున్నాం. వేసవిలో అది మా ప్రేమ సామ్రాజ్యం. మా కోట బురుజు ! కోట బయట మా ప్రజలు...! ఆ రాజ్యానికి నేను రాణి-ఆయన రాజు !

రాత్రి సరిగా నిద్ర లేకపోవడంచేత అప్పుడే కళ్ళు మంటలు మొదలయ్యాయి. పక్కమీద వాలాను. దగ్గరికొచ్చిన శ్రీవారిని మృదువుగా వారించాను.

"మొద్దూ...ఏమిటి అప్పుడే నిద్రా? చంపేస్తా...లే !" జబ్బ పట్టుకు నిగుంజారు.

"అబ్బ వదలండీ...ప్లీజ్... నిద్రొస్తోంది.."

"పగలంతా ఏం చేసావ్ చిట్టీ.."

"చిట్టీ లేదూ-పొట్టీ లేదు.. పోండి అవతలికి!" పక్కకు నెట్టాను మెల్లగా.

కాస్త మగత నిద్ర పట్టింది.



మళ్ళీ మెలకువ.. దాహం వేస్తున్నట్టు అనిపించింది. ఆయనకు చెప్పాను. అది గ్రీన్ సిగ్నల్‌గా ఫీలై - హుషారుగా కిందకు వెళ్లారు తాళాలు తీసుకుని. మళ్ళీ నిద్రలోకి జారుకున్నాను. నిద్రలో కల- అదంతా నిజంగా మా సామ్రాజ్యం అయినట్టు!...నేనేమో మహారాణినీ...

మళ్ళీ మెలకువ...

ఎంతసేపు నిద్రపోయానో?...

ఆయన పక్కనే పడుకున్నారు.. లేచి మంచి నీళ్ల తాగుదామన్నా బద్ధకం వేసి, అట్లాగే వుండిపోయాను.

నా మెడమీద ముద్దు పెట్టుకున్నారు. అయినా నిద్ర వదల్లేదు. బలమైన ఆ వేళ్లు మెడచుట్టూ, వీపు మీదా చక్కలిగింతలు పెడుతున్నాయి. హాయిగా వుంది. ఆ హాయి అనుభవిస్తూ అట్లాగే మళ్ళీ నిద్రను కౌగలించుకున్నాను.

మళ్ళీ కల! రాజ్యం...ప్రజలు కల కరిగిపోయింది. గాఢమైన నిద్ర పట్టింది.

ఉలిక్కి పడి లేచాను. నీళ్ళతో కళ్ళు తుడిచారు ఆయన.

"లే మంచినీళ్లు తాగుతానన్నావ్!..."

"ఊఁ...వద్దులెండి"

"ప్రపంచంలోకెల్లా ప్రఖ్యాత బద్ధకిష్టివి! గ్లాసులో పోయనా పాపం"

"ఏ వద్దక్కర్లేదు" ఇంక పడుకోండి.

"అవునూ. నీ మెళ్ళో గొలుసు లేవీ?"

మత్తు వదిలిపోయింది.

లేచి కూర్చున్నాను

మెళ్ళో, గొలుసు, మంగళసూత్రం లేవు! చేతికి బంగారు గాజులు లేవు!

"ఏమైనాయి. మీ రేతీశారు ఇందాక!"

"నేనెట్లా తీస్తాను. ఇప్పుడే వస్తున్నాను. పాలల్లో తోడు వేయటం మరిచిపోయావు. మళ్ళీ వేడిచేసి తోడువేసి వచ్చేసరికి కాస్త ఆలస్యమైంది!"

షాక్!...

"అదేమిటండీ. ఇందాక నా పక్కనే పడుకుని. నా...."

"ధంపావుపో! ఎవడో దొంగవెధవ అయ్యుంటాడు" గుండెదడ మొదలైంది. గొలుసూ – గాజులూ కలిపి రెండు వేలుంటాయి!

నేను బిక్కమొహం వేశాను అంత మహారాణినీ! ఆయన చిరాగ్గా కిందకు పరిగెత్తారు అంత మహారాజూను.

—పాటలి

# ఆదుర్దా

గోడ గడియారం 'ఠంగు ఠంగు'న పది గంటలు కొట్టింది. గంటలు విన్న గణపతిరావుగుండెలో రైళ్ళు పరిగెత్తాయి. చెవుల్లో ఆఫీసర్ చీవాట్లు మారు మ్రోగాయి. ఆలస్యంగా వంటచేసిన భార్య్యా ఆండాళుని తిట్టుకుంటూ చెయ్యికడుక్కుని లేచేడు. ఆదరా బాదరా బట్టలేసుకొని, ఫైళ్ళు పుచ్చుకొని, 'వెళ్తున్నానేవ్' అని కేకేసి గుమ్మం దాటాడు.

గుమ్మం దాటిన గణపతిరావుని చూసి మెట్లు వెక్కిరించాయి. గణపతికి ఒళ్ళు మండిన విషయాల్లో అవొకటి. "ఎక్కటం



అయిదు నిమిషాలు, దిగటం అయిదు నిమిషాలు. ప్రాణాలు తోడేస్తున్నాయి" తిట్టుకుంటూ, స్థూలకాయాన్ని మోసుకుంటూ ఎలాగైతేనేం దిగేడు.

టైం చూసుకుందామని చేతిమణికట్టు వేపు దృష్టి సారించేడు. 'అరె! వాచీ

ఇంటో మరిచిపోయానే' అనుకుంటూ—

"ఆండాళూ! కాస్త వాచీ తెచ్చి పెట్టు టేబిల్ మీద మరిచిపోయాను. తెచ్చి క్రిందికి విసిరేయ్. నే జాగ్రత్తగా పట్టుకుంటాను"

'అలాగే' అని లోనికి వెళ్ళి వాచీ తెచ్చి పై నుండి జారవిడిచింది ఆండాళు. అసలే గాబరాలో వున్న గణపతిరావు దాన్ని పట్టుకోలేకపోయాడు. ఆ ఫలాన్న వాచీ కిందపడి అద్దం కాస్త బద్దలయింది.

తన చేతగాని తనాన్ని తిట్టుకుంటూ, రిపేరు కెంతవుతుందోనని ఏడ్చుకుంటూ జేబులో కళ్ళజోడు లేకపోవటం గమనించి

'అరరె! దీన్ని కూడా మర్చిపోయానే' అనుకుంటూ— "ఆండాళూ! కాస్త కళ్ళజోడు వెతికి తెచ్చిపడేయ్. అవతల నా కాఫీసుకి టైమయిపోతోంది" అని కేకేశాడు. ఆండాళు విసుక్కుంటూ లోపలికిపోయి కళ్ళజోడు తెచ్చి జాగ్రత్తగా కిందికి జారవిడిచింది.

ఈ సారి కూడా గణపతిరావు ఫెయిలయి పోవడంతో చక్కా అద్దాలు రెండూ ముక్కలు చెక్కలు అయిపోయాయి. గణపతిరావుకో వంక [illegible]పూ, కోపం కలగలుపుగా వచ్చాయి.

"జాగ్రత్తగా పడేయమ[illegible]నా! చూడు ఇప్పుడు ఏమయిందో" తన అసమర్థతని కప్పిపుచ్చుకొంటూ భార్య మీద కేకలేశాడు.

"ఈ సారైనా జాగ్రత్తగా పెన్ను జారవిడు. నా పాత చొక్కా జేబులో వుంటుంది. వెధవది తొందర్లో అన్నీ మరిచిపోయొచ్చాను"

ఆండాళు విసురుగా లోనికిపోయి, పెన్ను విసిరింది.

దాన్ని కూడా మిస్సయ్యాడు గణపతిరావ్ ది గ్రేట్. ఫలితం పెన్ను రెండు ముక్కలు.

"ఏడుపుగొట్టు మొహం నువ్వూను. ఏడుస్తూ చేస్తే ఇలాగే తయారవుతాయి అన్నీని" అని మొహాన పట్టిన చెమట తుడుచుకుందామని జేబులో చెయ్యి పెట్టి, రుమాలు తీయబోయి, చేతికి తగలకపోయేసరికి "ఇదిగో...సర్లే ఎందుకులే. నేనే వచ్చి తీసుకుంటాను" అంటూ గబగబ ఒక్క వూపున మెట్లన్నీ ఎక్కి, రుమాలు తెచ్చుకొని, అదే వూపున మెట్లు దిగి ఆఫీసు దారి పట్టాడు గణపతిరావ్.

—ఎస్.ఎం. మెహబూబ్

## ఉద్యోగం

ముకుందరావు వాళ్ళ అక్కయ్యను చూడక చాలా సంవత్సరాలైంది. పిల్లలికి ఎటూ ఎండాకాలం సెలవలేకదా! తనకూ ఎరెన్డ్ లీవు చాలా వుంది. అదంతా ఉపయోగించుకోవాలి. అందుకని సకుటుంబ సమేతంగా అక్కయ్య ఉండే విశాఖ పట్టణం రైలెక్కాడు.

చెప్పా పెట్టకుండా వచ్చినందుకు అక్కయ్య ఆశ్చర్యపోయింది. "ఏరా తమ్ముడూ !ఇన్నాళ్ళకు ఈ అక్కయ్యను చూడ్డానికి వచ్చావా? ఇప్పటికైనా నామీద నీకు దయ కలిగినందుకు సంతోషం" అంటూ నిష్ఠూరంగా మాట్లాడింది.

ముకుందరావు అక్కకు నచ్చే సమాధానం చెప్పాడు.

నౌకాశ్రయం, నూనెశుద్ధి కర్మాగారం,

హెవీప్లేట్స్ అండ్ వెస్సెల్స్ కర్మాగారం ఉత్తరోత్తరా రాబోయే ఉక్కు కర్మాగార స్థలం, విశ్వవిద్యాలయం, సింహాచల దేవస్థానం వగైరాలు చూడడంతో హాయిగా ఎండాకాలాన్ని వెళ్ళబుచ్చి ఇక హైదరాబాద్ వెడదామనుకున్నారు.

"ఏరా! తమ్ముడూ ఒకటడుగుతాను ఏమీ అనుకోవద్దు" బిడియంగా అడిగింది అక్కయ్య.

"నాదగ్గిర ఏమిటే నీ మొహమాటం, నాకు చేతనైన సహాయం తప్పకుండా చేస్తాను" అంటూ అభయ హస్తం ఇచ్చాడు ముకుందరావు.

"మీ బావగారి సంగతి నీకు తెలియంది కాదు. ఆయనకు సంసారం పట్టదు. ఇన్ని జీతం రాళ్ళు తెచ్చి నామీద పడేసి ఆయన చేతులు దులుపుకొంటారు" అన్నది అక్కయ్య.

"విషయం నాన్చకుండా అసలు విషయం ఏమిటో చెప్పరాదా?" అన్నాడు ముకుందరావు.

"నీకు తెలియనిది ఏముందిరా తమ్ముడూ, పెద్దాడు ఊరికినే ఉంటున్నాడు. వాడికేదైనా ఉద్యోగం వేయించరాదా?" అనడిగింది అక్కయ్య.

"ఓస్ ఇంతేకదా! సరే వాణ్ని ఇలా పిలువ్, వివరాలు కనుక్కుంటాను" అన్నాడు తమ్ముడు.

రామం వచ్చాడు.

''ఏరా! నీకు క్రికెట్ ఆడటం బాగా వచ్చా" అన్నాడు ముకుందరావు.

"రాదు" అన్నాడు రామం.

"క్రికెట్ వచ్చుంటే బ్యాంకులో ఉద్యోగాలు సులువుగా దొరకుతాయి. పోనీ ఫుట్ బాల్ అన్నా ఆడగలవా?"

"లేదు మామయ్యా ఆ ఆటకూడా నాకు రాదు".

"హాఁ! ఫుట్ బాల్ వచ్చుంటే రైల్వేలో ఉద్యోగం వేయించేవాణ్ని, పోనీ హాకీ అన్నా ఆడగలవా" ఇదైనా వస్తుందన్న సమాధానం చెబుతాడేమోనన్న ఆశతో అడిగాడు మేనల్లుణ్ని.

"సారీ మామయ్యా! నాకు ఆ ఆట కూడారాదు''

"పోనీ నీకు బుర్రైనా ఉందా?'' విసుగ్గా అడిగాడు ముకుందరావు.

"ఉంది మామయ్యా? నాకన్నిట్లోనూ ఫస్టుక్లాసులే వచ్చాయి" అన్నాడు రెట్టింపు ఉత్సాహంతో.



"అరే! అది ఉందా?'' అన్నాడు నిస్పృహగా

"అలాగంటావేం, మామయ్యా?''

''అది లేకపోతే కనీసం 'పోలీసు' డిపార్టుమెంటులోనన్నా ఉద్యోగం వేయిద్దామనుకున్నాన్రా" ఈసారి రామం తల పట్టుకున్నాడు. *

రావూరి రవీంద్రనాథ్

# గాడిదవాటం

ఓ పల్లెలో గ్రామీణ బేంక్ ప్రారంభించేరు.

ఆ పల్లెలో నీటి సదుపాయం సరిగా లేదని గ్రహించి, ఆ బేంక్ పక్కనే ఓ నూతిని తవ్వించాలనుకున్నారు బేంక్ అధికారులు.

మంచి నీరెక్కడ పడుతుందో తెలుసుకునేందుకు ఓ ఇంజినీరుగారు వచ్చారు. ఏవేవో పరీక్షలు జరిపి ఓ చోట తవ్వమన్నారు.



శాస్త్రోక్తంగా అక్కడ తవ్వగా తవ్వగా ఆరడుగుల కింద రాళ్ళు అడ్డం పడ్డాయి. మరోచోట ఎంత తవ్వినా నీటి జాడే లేదు.

ఇంజినీరు పరీక్షలు చేస్తుంటే పల్లెవాడు ఒకడు అటుపోతూ-

"ఏటి దొరా! సూస్తన్నారు?" అనడిగాడు.

"మంచి నీరెక్కడ పడుతుందో చూస్తున్నాన్రా" ఇంజినీరు జవాబిచ్చేరు.

పల్లెవాడు తెగ ఆశ్చర్యపడిపోయి—

"మీకా సంగతెట్టా తెలుస్ది" అని కళ్ళు మిటకరించుకొని అడిగాడు.

"అయిదేళ్ళు ఇంజనీరింగ్ కాలేజీలో చదువంటే ఏమనుకున్నావ్ మరి"

"దానికింత తతంగం వుందా! అయబాబోయ్ మేమే నయవన్నమాట"

ఇంజినీరు నవ్వుతూ—"మీరైతే ఎలా చూసి తవ్వుతార్రా?" అనడిగాడు.

"మేం గాడిద తోక్కి దారంతో సింత కాయ కడ్తాం దొరా! అది అగె త్తినపుడు దారం తెగి కాయ ఏడ పడితే ఆడ తవ్వుతాం దొరా! అక్కడ మంచినీరే పడుద్ది." ఇంజనీరు తెల్లబోయేడు. అయినా తన తెలివితేటల్ని ప్రదర్శించాలనుకొని—

"మీ పద్ధతి బాగుందిరా. కాని మీ ఊళ్ళో గాడిదలు లేవనుకో, అపుడేం చేస్తారు" అనడిగాడు సగర్వంగా.

ఆ పల్లెవాడు బొక్కమొహం వేసొ్కని బుర్ర గోక్కున్నాడు. ఆఖరికి "ఏ గాడిదా లేకపోతే ఏటిసేస్తాం దొరా. మీ కాడికే వత్తాం" అన్నాడమాయకంగా.

—పినిశెట్టి శ్రీనివాస్

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD/402

# అబ్బాయి చదువు కోసం అంత ధనం ఎలా సాధించాలి?

## మార్గదర్శి దానికొక మార్గం చూపిస్తుంది..

ప్రతి వ్యక్తి జీవితంలోనూ కొన్ని బరువూ బాధ్యతలూ ఉంటాయి. అవి తీరాలంటే అందుకు తగిన సాధన సంపత్తి చాలా అవసరం. కుమారుని విద్య, అమ్మాయి వివాహం, సుఖజీవనానికో ఇల్లు వ్యాపార ప్రారంభానికి మదుపు ... ఇలా బాధ్యతలు ఎన్నో రూపాల్లో ఉంటాయి. వీటికి సరైన పరిష్కారమార్గం – తగిన పథకం మార్గదర్శి చూపిస్తుంది.

క్లుప్తంగా కొన్ని ప్రధాన అంశాలు:

* రూ. 10,000 నుంచీ రూ. 1,00,000 వరకూ మీ శక్తికీ, అవసరాలకూ సరితూగే వివిధ చిట్‌లు. రూ. 200 నుంచీ, రూ. 2000 వరకూ నెలసరి వాయిదాల్లో చెల్లించే అవకాశంతో.

* సత్వర చెల్లింపులు. ఏ చిట్‌ఫండ్ సంస్థలోనూ కానరాని రీతిలో పాడుకొన్న రెండు వారాల్లో మొత్తం లభిస్తుంది.

* ఎంత మొత్తం ఏ తేదీలోగా చెల్లించాలో స్పష్టంగా తెలియజేస్తూ ప్రతి నెలా ప్రతి సభ్యునికి పోస్టు ద్వారా ఇంటిమేషన్ కార్డు అందుతుంది.

* డబ్బు నష్టపోయే ప్రమాదం లేదు. పదహారేళ్ళకు పైగా ఈ రంగంలో నిలదొక్కుకుని ఉన్న సంస్థ చరిత్రే అందుకు తార్కాణం.

**మార్గదర్శి**

**చిట్ ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్**

మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

డబ్బుకోసమేనా మీ చింత?
మార్గదర్శి ఉన్నది మీ చెంత!

